# ఈ క్రింది ప్రశ్నలకు మీ సమాధానం

# అవునయితే ✓

# అశ్రద్ధ చేయకండి!






➢ పరాయి వ్యక్తులతో కండోమ్ లేకుండా (అరక్షిత) సెక్స్‌లో పాల్గొన్నారా?

➢ పరీక్షించని రక్తాన్నీ, పరిశుభ్రపరచని సూదితో ఇంజెక్షన్ తీసుకున్నారా?

వీటి తరువాత ...
తరచు జ్వరం వస్తోందా?
విరేచనాలతో బాధపడుతున్నారా?

వెంటనే మీ సమీపంలోని ప్రభుత్వ ఆసుపత్రిలోని **స్వచ్ఛంద సలహా** మరియు **పరీక్షా కేంద్రాన్ని** సందర్శించండి.

**శాస్త్రీయ పరీక్షల** ద్వారా సకాలంలో **H.I.V.** ని గుర్తించి సత్వరమే తగు జాగ్రత్తలు తీసుకోండి




☞ ఈ పరీక్షలూ, సలహాలు మేలు చేస్తాయి

☞ అపోహల్ని తొలగిస్తాయి

**వైద్యం సహాయం పొందండి... H.I.V. ని నిరోధించండి.**

**ఆంధ్రప్రదేశ్ ఎయిడ్స్ కంట్రోల్ సొసైటీ**, సుల్తాన్ బజార్, హైదరాబాద్.

హెచ్.ఐ.వి./ఎయిడ్స్ గురించి మరింత సమాచారం కోసం సంప్రదించండి.



PRSVM02A117

సాహిత్య
ప్రస్థానం
జూలై-సెప్టెంబర్ 2005
సంపుటి : 3 సంచిక : 12

# నిషేధాలు నిషిద్ధమే!

**మా**వోయిస్టు పార్టీతో పాటు విప్లవ రచయితల సంఘంపైనా రాష్ట్ర ప్రభుత్వం నిషేధం విధించింది. అరుదైన అత్యంత అసాధారణ సందర్భాలను మినహాయిస్తే నిషేధాలు ఎప్పుడూ వాంఛనీయం కాదు. గతంలో అనేక సార్లు నిషేధాలు విధించడం ఎత్తివేయడం తర్వాతనే ప్రభుత్వం చర్చల ప్రక్రియ ప్రారంభించింది. ప్రజలు శాంతిని కోరుకుంటున్నా ఇరుపక్షాలూ చిత్తశుద్ధి చూపకపోవడం వల్ల దానికి విఘాతమేర్పడింది. జరగాల్సింది శాంతి ప్రక్రియ పునరుద్ధరణ తప్ప నిషేధం పరిష్కారం కాదు. అందులోనూ రచయితల సంఘంగా వున్న విరసం ను నిషేధించడం అసలే సమర్థనీయం కాదు. సాహితీ స్రవంతి ఈ నిషేధాన్ని ఖండించింది. విరసం నాయకులు కళ్యాణరావు, వరవరరావులను విడుదల చేయాలని కోరింది. ఇప్పటికైనా ప్రభుత్వం ఆ పనిచేయాలి. ఈ పేరుతో అరెస్టులు నిర్బంధాలు వేధింపులు ఏ మాత్రం సమర్థనీయం కావు. రాజకీయ సామాజిక సమస్యలను నిషేధాలతో బల ప్రయోగంతో పరిష్కరించడం సాధ్యం కాదని అనుభవం అనేక సార్లు నిరూపించింది. ఈ పరిస్థితి హింసా ప్రజ్వలనకు దారితీయకుండా చూడవలసిన బాధ్యత అందరిపైనా వుంది.

.... ... ....

వివిధ జిల్లాల్లో స్రవంతి పక్షాన అనేక విధాలైన సాహిత్య కార్యక్రమాలు జరుగుతున్నాయి. పుస్తకాలు కూడా ప్రచురితమవుతున్నాయి. అందులో భాగంగా హైదరాబాదులో ఇటీవల భారీ ఎత్తున జరిగిన 'సమాలోచన' సాహితీ మిత్రుల మన్నన పొందింది. సాహితీ స్రవంతి ఈ కాలంలో రాష్ట్ర కార్యాలయం ప్రారంభించింది. ఇకపైన మరింత క్రమబద్ధంగా సాహిత్య కార్యక్రమాలు నిర్వహించడానికి ఇది దోహదపడగలదనే ఆశిస్తున్నాము.

.... ... ....

సాహిత్య ప్రస్థానం మీ ఆదరణతో నిర్విఘ్నంగా నడుస్తున్నది. అయితే పోస్టు ద్వారా పంపడానికి సంబంధించి కొన్ని సమస్యలు అలాగే వున్నాయి. ఆసక్తిగా అడిగే మిత్రులను నిరుత్సాహ పరచడం ఇబ్బందికరంగానే వుంది. అందువల్ల పత్రిక రెగ్యులర్‌గా కావాలనుకునే మిత్రులు మాకు రాస్తే ఏదో విధంగా వారికి అందే ఏర్పాటు చేస్తాము. వారి చిరునామాలను బట్టి చందాలు ఎలా కట్టాలో తెలియజేయగలము. కనుక ప్రస్థానంను ఇంతకాలంగా ఆదరిస్తున్న మిత్రులు చొరవతీసుకుని దాన్ని తెప్పించుకునే వారి జాబితాలు సేకరించి మాకు అందించవలసిందిగా మనవి. పట్టణ ప్రాంతాలలో వున్నవారికి వెనువెంటనే పంపి. మిగిలిన చోట్లకు కూడా సాధ్యమైనంత త్వరలో సరఫరా ఏర్పాట్లు చేయగలం.

ముఖచిత్రం డిజైనింగ్ : గణేష్

లోపలి చిత్రాలు : రమణ జీవి, శేఖర్, ప్రభాకర్, మీరా

## ఈ సంచికలో...

బతుకు చిరునామా (కథ) ........ 2
సందర్భం (కవిత) ........ 9
అడుగడుగునా కారంచేడు (కవిత) ........ 10
కొత్త గాయాల తల్లి (కవిత) ........ 11
మా ఇల్లు (కవిత) ........ 12
తెలుగు కథ అభ్యుదయోద్యమం ........ 13
సమీక్ష పర్వం ........ 16
కవిత్వం గుబాళించిన నల్ల (కవులు) కలువలు ........ 25
జ్ఞాపకం (కవిత) ........ 29
కలాన్ని మోసేవాడు (కవిత) ........ 30
తృష్ణ (కవిత) ........ 31
ఒక విధ్వంసక సంస్కృతి
- అనేక సంస్కృతుల విధ్వంసం ........ 32
ఒకే పంట (కథ) ........ 33
నక్షత్రాలు (హైకూలు) ........ 36
జోన్ ఆఫ్ ఆర్క్ (కథ) ........ 37
స్వీకారం ........ 44
వెలి ........ 45
డైరీ ........ 49
పిల్లల ఆటా...పాటా...(డైరీ) ........ 55
మళ్ళీ మానేశాక ........ 56
పత్రం ........ 57
కాలాన్ని నడిపించిన కవి - కమ్యూనిస్టు మఖ్దూం ........ 59
మహనీయులకు మహా నివాళి "సమాలోచన" ........ 62
నా అమెరికోడు ........ 64

సంపాదకుడు
తెలకపల్లి రవి
ముద్రాపకులు, ప్రచురణకర్త
వి. కృష్ణయ్య
మేనేజర్
కె. లక్ష్మయ్య

ఎడిటోరియల్ బోర్డ్ అడ్రస్ :
సాహిత్య ప్రస్థానం
1-1-187/1/2,
వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోన్లు : 27660013, 27635136

1

# బతుకు చిరునామా

జాతశ్రీ



ఎవరూ - రమ్మని పిలిచిందీ లేదు. ఓ కార్డు ముక్క అందుకున్నదీ లేదు. 'పరిస్థితులిలా ఉన్నాయి. నువ్వోసారి వచ్చిపో...' అని ఫోన్ చేయించిన వారో, చేసినవారో ఎవరూ లేరు.

అయినా - నా మనసు నిలకడ తప్పుతుంది. ఏవేవో భయ ప్రకంపనలతో నా శరీరంలోని అణువణువూ కదిలిపోతుంది. కుడి కన్ను మరో పని లేనట్టుగా, అదే పనిగా అదురుతుంది. అడుగడుగునా అపశకునాలు... నా చెవుల్ని అంటుకొని వదలనంటోన్న ఏడుపు... గాలితో కలిసి, శ్వాసలో దూరి, 'గోస'లా వినిపిస్తున్న దీనమైన ఏడుపు!

ఒకటో, రెండో కాదు! వారం దినాలుగా నా మనో లోగిలిని పొక్కిలి చేస్తున్న కల! గుంభనంగా, వ్యంగ్యంగా నవ్వుతూ... నా ఛాతిపై నిల్చొని, నృత్యం చేస్తున్న మృగం!

కన్నుమూస్తే, కునుకు తీస్తే... నే బెంబేలెత్తేలా... ఉలికిపాటుతో వణికిపోయేలా - మళ్లీ మళ్లీ అదే కల. చీకటి 'షెడ్'లో దాగిన పెను చీకటి గుయ్యారం లాంటి మగ్గం గుంటలో... పాణీ చెక్కల్ని ఆయాసం వల్ల తొక్కలేక పోతున్న నా పాదాల్ని తాకుతూ... తూ... నాకుతూ... తూ... అకస్మాత్తుగా నములడం మొదలేసిన మృగం! దాని శరీరంపై ఓ మూలగా 'తొమ్మిది నక్షత్రాలు, మరికొన్ని ఎర్రని చారలూ...' చాలా చాలా బలంగా, క్రూరంగా ఉంది. ఆ మృగం నుంచి నన్ను కాపాడాలని, నాడె ను పదునైన బల్లెంగా మార్చి, భీకరంగా కేకలేస్తూ... నాకేసి పరుగెత్తి వస్తూ, అకస్మాత్తుగా అగాధంలో పడి, దైన్యంగా చూస్తూ, ఏడుస్తూ....

ఎవరా - ని చూస్తే.... ఆశ్చర్యం! - అమ్మ!!

అమ్మ ఎందుకేడుస్తుంది?!

అమ్మకేమయింది? ఏదో అయింది! ఏమయింది?

ఏదో, ఎలా, ఎందుకయింది?

- వెళ్లాలి!

"కలలో జరిగింది, ఇలలో జరగదంటరు గదరా... ముక్కంటీ" నా సహచరుడూ, ఒకే ఒక సన్నిహితుడూ - ఓదేలు బిక్కమొహంతో, బెదురు గొంతుతో... ఇది అయిదో సారో, ఆరో....

సన్నాసి వెధవ... ఓదేలు గాడికేం తెలుసు? ఒంటి పీతిరి గద్ద! వాడి బతుకున శూన్యమే తప్ప, రమణీయత లేదు - వాడి

ఆరాటపు ఆలోచనల్లో ఆకలి ఆశలు తప్ప, అనుబంధాల అనుభూతులు లేవు. నేనలా కాదే!... నాకు అమ్మ ఉంది! ఇద్దరు చెల్లెళ్ళు ఉన్నారు! రేపో, మాపో ఇద్దరు బావలూ వస్తారు. వాడిలా – నేను, నా కోసమే బతకడం లేదని మరోసారి గట్టిగా చెప్పాలి!

"జరగదని గేరంటీ యిస్తవ?" చిరాకెంత గయ్యాళిదో తెలిపేలా నా స్వరం.

ఓదేలు – అదోలా... ఎంతటి విరాగికైనా నవ్వు తెప్పించేలా – వెర్రి వెంగళాయిలా చూశాడు. అయితే ఆ చూపులో పదునైన కోటి కొడవళ్ళు!

అయినా నాకు నవ్వు రాలేదు. నవ్వడమనేది – చాలా చాలా ఖరీదైన ప్రక్రియ అని నాకు చాలా కాలంగా తెలిసొస్తుంది. ముఖ్యంగా ఈ 'భీవండీ' వచ్చాక! కృత్రిమంగా నవ్వుకునే జనాన్ని పక్కన పెడితే, నిజమైన నవ్వు నిండుగా నవ్వడానికి పెట్టి పుట్టాలి. ఏ టివి యాంకర్నో, సిడి సినిమాల్లోనో, క్రికెట్ కామెంటరీ బాక్సుల్లోనో చూసి, నవ్వడం ఎలానో తెలుసుకొన్నా – అలా నవ్వడానికి చాలా చాలా కన్నీళ్ళు రాల్చాలి! ఎంతో ఎంతో కష్టపడాలి. నాలా మగ్గం గుంటల్లో గడిపే వాళ్ళకు నవ్వు నిషేధం! మజూరి (కూలి) బతుకులకు నవ్వడం – కళ గాదు... కల!

"రేయ్, ఓదేలూ... ఉండలేర్రా, ఎళతా...

"ఎందుకురా అంత ఇది? నెల నెల పైసలు పంపిస్తనే ఉన్నవ్, ఫోనుల్ల మాట్లాడతనే ఉన్నవ్, అంతా బాగున్రని సెవి నేస్తనే ఉన్రు. ఇంగేంది బయం?" ఓదేలు పేద చూపుతో, బీద గొంతుతో అన్నాడు.

"నీకు తెల్వదురా ఓదేలూ, వోరం దినాలుగా ఇడవకుండా అదే కల! ... రేయ్ మా–మ్మ...." నా గుండెల్లో కదిలే రక్తంలో కలిసి వున్న నీరు బుడబుడమంటూ కన్నుల్లోకి చేరింది. గొంతు పూడుకపోయినట్లయింది. చెప్పాలనుకొనీ, చెప్పలేని వైనం. తన ఆకలి బయటపడకుండా ఏకుల దారాన్ని కడుపుకు చుట్టుకొని, మా ఆకలి తీర్చిన అమ్మ గురించి చెప్పాలంటే... నా గుండె కంత దిటవు లేదు. నాది ఒట్టిపోయిన ఒంటరి గుండె కాదు.

"ఎళతరా ఓదేలూ..." నిర్లిప్తంగా అనేసి, చిలక్కొయ్యకున్న ముదురు ఖద్దరు గుడ్డ సంచీ అందుకొని రెండు జతల బట్టలు కుక్కుకున్నాను.

"మళ్ళెప్పుడొస్తవ్?".

"సూస్త, అన్నీ సక్కంగుంటే... ఓరం, పద్దినాల్లో..."

"తొరగా రా, ఏజంటనలే మాదర్‌చోథ్... మజూరి కాడ మెలికేస్తడు." ఒదేలు నెమ్మదిగా అన్నా... పక్క 'షెడ్'ల వాళ్ళు ఎవరైనా విన్నారేమోనని భయంగా బయటకు చూశాడు.

* * *

రైలు పెట్టె నిండుగా ఉంది. ఇరుకింట్లో ఉమ్మడి కుటుంబం ఉన్నట్లుగా ఉంది. ముందుగా ఎక్కినందుకు నాక్కొంచెం స్థలం దొరికిందిగాని, కూచున్నోళ్ళ కంటే నిలుచున్నోళ్లే



ఎక్కువమంది ఉన్నారు.

"అబ్బ... ఏం జనం, ఏం జనం...! ఈళ్లంతా యాడికో?

నాలో నేనే అనుకున్నా, అది కాస్త పెదవి దాటి ప్రక్కగా నిల్చున్నతని చెవిన పడింది.

"యాడికేంది?... బతుకు దెరువుకి" అన్నాడు.

"బతుకు దెరువా!... యాడుంది?"

"యాడా లేదు. ఉందనుకుంటూ ఉరుకులాట్టవేఁ తప్ప, ఒరిగేదేం ఉండదు. దూరపు కొండల సావెంత!"

ఆహాఁ... నిజాన్ని ఎంత నిజంగా చెప్పాడు! మా అమ్మలా ఎంత కమ్మగా చెప్పాడు!!

"రేయ్, కొడకా... ముక్కంటీ మయ్యాని సూసిన, మియ్యానీ సూసినమయ్య జమాన్ల కాస్త నిబ్బరంగానే బతికినం. కరువొచ్చినప్పుడూ, కలరా వొచ్చినప్పుడూ, మిగతా కాలానా – మంచిగనే బతికినం, అణా, బేడలతోనే. తిరగమోత పప్పేసుకుని, ఎన్నపూస గోలికాయంత కలుపుకుని మస్తుగ తిన్నం. ఎందరున్నా పడుగు పేకలా కల్సి బతికినం. ఆపదలు రాలేదని కాదు. డొక్కల కరువు సుత కళ్ళ జూసినంలే.. ఒకర్నొకరం ఆర్సుకుంటుండేదిగా. ఏవని పిచ్చేది గాదు. పండగలకీ, పబ్బాలకీ – పిల్లా జెల్లా పెళ్ళి సందడిలా ఉండేది. ఎందరు తిన్నా ఓ మడ్సి బువ్వ కుండల మిగిల్న రోజులయి. 'మాదా కవళం తల్లా'ంటే, ఇంటి ముంగల ఆకేసి కడుపు నింపిన తల్లులున్న కాలవది.... పాయె!

ఇగ మియ్య రోజుల్ల సుత....జర, అబద్దమెందుగ్గానీ, ఉపాసాల బతుకేం బతకలె! ఇప్పటోళ్ల తీర్న ఊరొదిలి, దేశాలెమ్మటి బడిపోలె... మగ్గాలే మమ్మల్ని బతికిచ్చినయ్. ఊరోళ్లందరి మానాలూ మన శాలోల్లే కాపాడిన్రు. నెంబరు పంచెలూ, కలనేత కోకలూ, దొడ్డు దారం దుప్పట్లూ, మన మగ్గాల మీదనే నేసినం. అంతేనా? అగ్గిపెట్టెలో పట్టే ఆరుమూరల కోకా, వేలి ఉంగరంలో దూరే కోకా, కుట్టులేకుండా రయికా, సొక్కా... అబ్బో, ఆ వయిభోగం ఏవని జెప్పు? నేత పనోడు బయటికెళితే, పటేల్ దొర కున్నంత గిరాకీ ఉండేది. పత్తీ ఈడదే!...నేతా ఈడదే... 'ఏకులు' వొడకటం కాన్నుంచి, 'ఇచ్చుల్ని' రంగుల ముంచి, పడుగు... అయినంత గెంజి బెట్టి, 'సరి' దువ్వి... అన్ని పనులూ యింటిల్లాదులం జేసేది. నేతతోనే నీతిగా బతుకెళ్లదీసినం గాదూ! ఆ రోజులూ పోయినయ్.

"యాడికి పోయినయ్?"

"యాడికంటే... గోదాట్లో కల్సిపోయినయ్"

"ఎందుకు?"

"ఎందుకంటే....' క్షణమాగి, పోయినయంతే... ఒక్కసారిగ గుమ్ములు మర్లబడ్డయి. సిక్కుపడ్డ యచ్చుల (నూలు దారాల కట్ట) తీర్నయింది బతుకు. యాస్టకొచ్చి, సచ్చోడో సావంగ, సచ్చేందుకు కాదీ పుటకని యివరం తెల్సినోళ్ల బొంబాయినీ, భీవండనీ, చీరాలనీ ఉరుకుతున్రు... యాడికురికినా వొరిగేదేం ఉండదని తెల్వక ఉరుకుతున్రు గాదూ, ఎందర్నీ సూట్టంలె" అంది అమ్మ.

నిజం! అమ్మ ఆనాడు నిజమే

చెప్పింది. అనుభవాన్నే చెప్పింది.

ముందేదో ఉంది, మింగుదామనుకునేవాడు ముందుకే చూస్తాడు. వెనక్కెందుకు చూస్తాడు? అమ్మ అనుభవాన్ని పరిగణనలోకి తీసుకోలేదు. 'ముసల్ది మాటలు నేర్చింది. మాయలు సెయ్యటానికి సూస్తాంది' అనుకొని కొట్టి పారేశాను.

ఊరూ ఉరకమనలె! "వద్దురా ముక్కంటీ... మన బుద్దులకీ, పట్నం బుద్దులకీ పొసగదురా, మనం పక్కోడ్ని విడిచి బతకలేం, పట్నవోళ్లు పక్కోడ్ని పొడిచి బతుకుతార్రా..." అని చాలామంది చెప్పారు.

ఎందరు చెప్పినా – తరం మారింది. బతుకు రీతీ మారింది. 'అనుకొని కన్నతల్లినీ, చిన్న చెల్లెళ్ళనీ, చక్కదనాల ఊరునీ వదిలేసి...

'భీవండీ' చేరేందుకు అటకన ఉన్న మగ్గాన్ని వీధిలోకి వేలానికి పెడితే... అమ్మ నెత్తీ, నోరూ బాదుకుంది. భోరున ఏడుస్తూ, "కొడకా, మగ్గం అమ్మకూడదు... అమ్మకురా... మన కులానికది 'అచ్చి' రాదురా... మగ్గం మనింటి దేవతరా... కావాలంటే నా కాళ్ల కడియాలిస్త, అమ్ముకో... ఈ ఇల్లు గిరువు పెట్టుకో... మగ్గం మటుకు అమ్మకురా... నీ కాళ్లు మొక్కుత, బాంచన్." అంటూ మొత్తుకుంది.

"ఆc... దేవత... సింగినాదం గాదూ, దేవతనబట్టే బువ్వకు గతి లేకుండ సావగొడతాంది." అని నిష్టూరంగా అన్నాను.

మరో వారానికి – నే చేసే హడావిడి చూసి, అమ్మ – "కొడకా...కాదనంగ 'భీవండి' పయానం గట్టినవ్. నిన్నొదిలి నేనెట్టుండాలిరా?" అంది.

"ఈడుండి ఉరేసుకోనా? పోనీ, అదన్నా సెప్పు. పనిలేని కాడ పస్తులుండే కంటే నాల్డబ్బులు దొరికే కాడ బతికితేంది? రేపో, మాపో... సెల్లెళ్ల పెళ్లిళ్లు సెయ్యాల్నా? వద్దా?" కసిరితే తప్ప, అమ్మ గొణుగుడాపదనిపించి, అలానే అన్నాను.

"అదట్టుంచరా, నేనెట్ట?"

"ఎట్టేంది, నేనూకొంటనా? కాస్తో, కూస్తో పంపించనూ? తోడుగా నువ్వూ... రాట్నం వడికో, బీడీలు సుట్టో, పదో పరకో కూడ బెట్టుకో... రెండావులున్నాయిగా... ఆటిని సూసుకుంట దొర్సాని లెక్కుండు" అన్నాను.

"ఆవుల్ని సూసుకుంట దొర్సాని లెక్కుండనా?... మర్నా కడుపున బుట్టిన బిడ్డ యాదిల కొస్తే ఏం జెయ్యనురా... అది సుత జెప్పు..." అప్పటికే అమ్మ కళ్లు సూక్ష్మజలపాతాలయ్యాయి.

"ఫోన్నెంబరిస్తగా... ఫోన్జెయ్యరాదె!"

"మరి నీ కాకలయితే నేనేం సెయ్యన్రా?"

"అదేంటమ్మా... అట్టంటే, ఇట్టంటవ్?"

"అదేరా, ఫోన్జేత్తే ఆకలి తీరుద్దా? "నే కదిలిపోయేలా, ఏడుపు కలగలిసిన స్వరంతో అమ్మ.

ఏం చెప్ప?.... అమ్మ పిచ్చి!



"కొడకా... అద్దురా, వాలన బొయినా వారిగేదేం ఉండదు.

కాదూ, కూడదంటవా... అందరం పోదాం పద! కడుపార తిండి లేకున్నా, కన్నా సూసుకోటానికన్నా తోడుంటం. ఏవంటవ్?"

అమ్మకెలా చెప్పాలి? మారిన రోజుల్ల, మారని అమ్మతో ఏం జెప్పినా సెవి కెక్కుద్దా?... అసలింటే గద.. సెవినెక్కేది? సి....సీ.... "అది గాదమ్మా...." నా మాటల్ని వినకుండానే – తల అడ్డంగా ఊపుతూ అమ్మ. "నెవ్వన్ననా జెప్పు. నాకు తెల్సిందొక్కటే... మన్సికి డబ్బు ఆసరా అనుకొంట, ఆటి కోసం ఉరుకులు పెడతం గాని, సుద్ద తప్పు. మన్సికి మన్సే ఆసరా... ఉప్పిడి మెతుకులో, గుప్పిడి గంజో కల్సి బలికే తీరే – తీరు. ఆ తీరొదిలి, నీ దారిన నువు పోతనంటన్నవే...! ఈ తల్లినేం జేస్తవురా? ఈ మునసల్తనాన నిన్నొదిలి నేనెట్టుండన్రా?... నే మనేది పాలై సావనా?... పోనీ, అదన్నా సెప్పు. "అమ్మ స్వరం – స్వరంలా లేదు. ఏడుపులా ఉంది. గొంతు దాటని ఏడుపు.

'అంతా అయినాక, రేపో మాపో పయానం అనుకుంటుంటే, యీ కొలుపేంద్రా సావీc...' అనుకొన్నాను. చిరాకు, అసహనంతో పళ్లు కరకరమన్నాయి. "దెహెపో... నే సెప్పేది సెవినేసుకోకుంటే, యిగ నీ కరమ... మనేది పాలైతవో, గోదాట్లో కలుస్తవో నీ యిస్టం. ఎట్నన్నా సావు" అన్నాను.

అమ్మ ఏడ్చింది. గుండెలు పిండయ్యేలా.. గొంతు దాటని ఏడుపు.

ఎందుకు? ఏం జరిగింది?? ఏదో జరిగింది? "అమ్మా.."

"ఏయ్! ఏందా కదులుడు... ఈడ లేడీసున్నరు!"

ఉలిక్కిపడ్డాను. ఎదురు బెంచీపై కూచున్న తాత, నాకేసి కోపంగా చూస్తున్నాడు. పొరపాటు గుర్తించి సర్దుకున్నాను.

నా కాలు తగిలిన అవ్వ, సున్నితంగా నవ్వి, ఆత్మీయంగా చూస్తూ, "నిద్రొస్తున్నాది బిడ్డా?" అంది.

తలూపుతూ, రెండు చేతులతో కళ్లొత్తుకున్నాను.

రైలు కూతేస్తూ – నా ఊరు, నా గాలి, నా అమ్మకేసి వేగంగా దూసుకుపోతూంది.

"యాడికి పోతన్నవ్ బిడ్డా? అవ్వ పలుకరించింది.

"మా ఊరే. మా అమ్మని సూడ కాయిశయింది. పోతన్న" అన్నాను.

"అట్టనా బిడ్డా... పోవాల, అయినోళ్లని అప్పుడప్పుడు సూసుకుంట బతికేదే బతుకు. ఏ ఊరు మన్ది?" ప్రేమగా చూస్తూ అంది అవ్వ.

చెప్పాను.

తాత మాట కలిపాడు. "నీకున్న బుద్ది మా వోడికి లేకపాయె! ఆణ్ణి సూట్టానికి మేమే పోతన్నం. ఆడు కళ్లల్ల మెదిలినప్పుడల్లా, మునలమ్మ 'మనేది'న బడకముందే, నాలుగయిదు నెల్లకోసారి పొయ్యొస్తం. నెలనెలా పోవాలంటే, దూరాభారం... పైసలు గావొద్దా?... కూలికి పొయ్యి, కూడేసిన డబ్బులు తినంగ మిగిల్నయి మూటగట్టి, పోన్నాను 'తికెటు' మందం సూసుకొని, పోతం..." అన్నాడు.

"నీ కొడుకునే రమ్మనగూడదా?"

"ఆడు రాడుగా... పేకటేరికి నాగయితే జీతం కోస్తరంటడు. ఆడికి అయ్యమ్మల కంటే జీతవే ముక్కెం" అని, అదోలా పెదవి విరిచి, నిట్టూర్చి, "నువ్ సెప్పరబ్బాయ్, జీతంతోనే మన్సి బత్కుతాడ్రా?.. ఇంకేవీఁ వొద్దా... జీతం వస్తే బువ్వ ఉంటదేవో గాని, బువ్వొక్కటే బతుకయితాదిరా?... ఇంకే ముచ్చటా వొద్దా... ఎవురూ లేకుంట బతికేదీ – వో బతుకేనా? మాటాడవేంది?" అన్నాడు తాత.

"ఇయ్యాల్రేవూ రోజులట్ట సచ్చినయ్ తాతా"

"అగ్గో, మళ్లీ గట్నే అంటవ్!... మన్సికి పైసలొద్దనటంలే గాని, పైసలొక్కటే సాలా?... బతికిన నాల్రోజులూ నలుగురితో నవ్వుకుంట బతికేది మన్సి... అడివిల మెకం తీర్న దొరికింది తినుకుంట, పీతిరిగద్దలా బతికితే... అది మన్సి వరసేనా?...." అన్నాడు తాత.

ఏదో స్టేషన్‌లో రైలాగింది. పేద జనం, కూలి జనం, కూలి జనం, కట్టెల మోపుల జనం – కాకర, బీకర... కడుపు ఎండినోళ్ల సంత!

"ఛ... ఛ.. ఏందా అరుపులు!" అన్నాను అసహనంగా, అప్రయత్నంగా.

"నీకూ, నాకూ అరుపులు... కాని – వాళ్లకవి ఆకలి ఆరాటాలు, ఆవేశాలూ.." కిటికీ ప్రక్కన కూచున్న పెద్దమనిషి నింపాదిగా అన్నాడు.

ఎదురుగా కూచున్న తాత నాకేసి 'అదోలా' చూశాడు. 'అదోలా' అంటే – 'ఎద్దేవా'ని చూసినట్లు. కుదురుగా కూర్చోలేకపోయాను. తలదించుకొన్నాను.

రైలు కదిలింది.

* * *

చెల్లెళ్లిద్దరూ ఎదురొచ్చారు. వెలిగిపోతున్న ముఖాలతో నన్ను తడుముతూ, బుజాలు లాగుతూ ఇంటిలోకి తీసుకెళ్లారు. "నాకేం తెచ్చావన్నా?" అంటూ సంచీ లాగారు.

తెచ్చినవేవో వారికిచ్చాను.

అప్పటి వరకూ నులకమంచాన్ని అతుక్కొని, మూరేసుక కునుకు తీస్తున్న అమ్మ ఉలికిపాటుతో దిగ్గున లేచింది. తడబడే అడుగులతో, వర్షించే కళ్లతో, దాపుగా వచ్చి, వొళ్లంతా తడుముతూ "కొడకా..." అంటూ చేతులు పిసుకుతూ, నొసలు ముద్దాడుతూ, దగ్గరగా నేలపై చతికిలబడి కూచొని, కాళ్లు వొత్తుతూ, "కొడకా...కొడకా...." ఆ ఒక్క పదమే – మరో పదం రానట్టూ, లేనట్టూ...

అమ్మ ఏం బావోలేదు. చాలా చాలా బలహీనంగా ఉంది. నరాలు తేలి, ఎండిన వెదురుకట్టెలా ఉంది. మధ్య మధ్య దగ్గుతూ "కొడకా, కొడకా...." అంటూ...

"నేనేనమ్మా, ముక్కంటినే.."

"ఈ అమ్మని సూట్టానికి వొచ్చినవా కొడకా..." అమ్మ స్వరం వణుకుతోంది.

తలూపాను.

"ఇట్ట సిక్కిపోయినవేంద్రా కొడకా... ఏళకేవఁవన్నా తింటన్నవ, లేదా...?



నల్లబడ్డవు, నీళ్లు పడనట్టుగుంది. సెంపలు సుత పీక్కపోయినయ్, ఒళ్లంతా యిదేందీ.... గజ్జొచ్చినోని లెక్క! "అమ్మ కొలుపులా చదువుతూనే ఉంది."

"నీకట్లనే అనిపిస్తది గాని, నువ్వేంది, జొరానబడి నవిసినట్టున్నవ్! ఒంట్లె కులాసగుంటం లేదా? ఆ మద్దెన కీళ్ల తీపులన్నవ్... తగ్గిందా? అన్నాను.

నా చెల్లెళ్ళప్పుడే చుట్టుపక్కల చెప్పేశారులా ఉంది. ఎవరెవరో వస్తున్నారు. కొందరి పేర్లు మరచిపోయాను. కొందరి ముఖాలు గుర్తులేవు. నేనయి వారందరికీ గుర్తున్నాను.

"నేన్రా తమ్ముడూ... కొమరయ్య తాత బిడ్డని కాదూ...! అప్పే మర్సినవా? ఊనబియ్యం కోసం, నా ఎంగుపట్టుక మాసేనుకొచ్చింది గుర్తులేదా? అవ్వ, నీకప్పుడే పట్నం బుద్దులొచ్చినయ్‌రా!...."

"ఇంకేంది, రాజవ్వా.... కొడకా, కొడకా.... అని కలవరిస్తివి.

మూరేసి, రేపో మాపో అన్నట్టుగ మూలిగిందానివి, దిగ్గున లేసినవ్‌గా, నశీబంటే నీదే!'

"నీరసవేవాయె... మనేదేడ పాయె... కీళ్లతీపులేవాఁయె...

కొడుకుని సూడంగనే, కొత్త నెత్తురుబికొచ్చినట్టు, అవ్వ మొగం ఎలిగిపోతాంది."

– నాకేమీ కానివాళ్లు, ఎవరో – నే మర్చిపోయిన వాళ్లు, నా రాకను ఆహ్వానిస్తూ, అభినందిస్తూ, ఆత్మాయతానురాగపు వలుకరింపులతో నాలో నాలుగేళ్లుగా పేరుకుపోయిన నీరసాన్ని చిదిమేస్తూ... తీయని అనుభూతి!.... అనిర్వచనీయం!

అమ్మ నవ్వింది. నోటితో కాదు, కళ్లతో!

వచ్చిన వాళ్లంతా వెళ్లాక, ఇంట్లోకి నడిచాను. మగ్గం గుంట నిండా ఏవో, ఏవేవో పాత సామానులు.

"గుంట పూడ్పించక పోయినావమ్మా!"

అమ్మ నా మొహంలోకి క్షణం చూసి, చిన్నగా నిట్టూర్చి, "పానమొప్పలేదురా కొడకా... ఆ గుంటల్నే కూకొని మియ్య మనందర్నీ సాదిండు. మగ్గమెట్టా లేదు. మియ్య గుర్తుకి ఆ గుంటే మిగిలింది..." అంది అమ్మ.

తెల్లబోయాను. మాటలేం దూకి రాలేదు. అమ్మ పిచ్చో... నేను పిచ్చో తెలియడం లేదు. నాయిన గుర్తొచ్చి గుండెలో కలుక్కుమంది.

ఇంటి కప్పు ఫర్వాలేదు గాని, గోడలే అక్కడక్కడా పెచ్చులూడి ఉన్నాయి... "సెల్లెళ్లన్నారు. కాస్త గోడలు మెత్తియ్యకపోయినవా... తేళ్లు చేరవూ?" అన్నాను.

అమ్మ దీనంగా చూస్తూ, "కడుపులకి సూసుకోటంతోనే తెల్లారిపోతుండె. ఇంగ గోడల్ని సూసుకునే తీరుబడేడుంది?" అంటూ, కంచం కడిగి అన్నం పెట్టింది.

తిని, మంచం మీద నడుం వాల్చాను.

అమ్మ ముక్కాలి పీట తెచ్చుకొని, నా తల వేపు కూచోని, పేలు చూస్తుంటే, "సూపు బాగుందామా?" అన్నాను.

5

"తగ్గింది కొడకా, దూరపు సూపు పూరా బేకారయింది..." అంటూ తలలో వేళ్లు పెట్టి కుక్కుతూ, ఏవేవో ముచ్చట్లు! లోకాభిరామాయణం... ఊరి ఊసులూ, బంధువుల బాగోగులూ... మాటలెంతకీ తెగడం లేదు.

"రాట్నం వడకటం లేదామా?" అటక మీదున్న రాట్నాన్ని చూస్తూ అన్నాను.

"నేతుంటే గద, రాట్నం పని? ఆ మాయదారి 'పవర్‌లూం' మగ్గాలొచ్చాక, మన గుంట మగ్గాలన్నీ మాయమై పోయినయ్ గదరా! పత్తి సుత కరువైంది. కంటికి కనపట్టంలె!"

"మనూర్లె పత్తి పండించడం లేదా?"

"కాస్త కూస్తో పండిస్తనే వున్రు. ఈడ బండిన పత్తిని బోరెల్ల కెత్తి ఒరంగల్ మిల్లుల కంపుతున్రు గాదూ, ... పత్తే కరువైనాక, నేతగాడికి పనేది? రాట్నాల సప్పుడేడిది? నేతగాళ్ళంతా జీతగాళ్లయి పోతాన్రుగాదూ... ఆటోలు దోలుకుంట, సుతారి పనులు జేసుకుంట, ఓపికున్నోడు నీకు మల్లె దేశాలెమ్మటి తిరుక్కుంట అట్టట్ట బతుకుతున్రు, ఏదీ సేతగానోడు గింత పురుగుల మందు గొంతుల పోసుకుంటాండు. ప్చ్! మారింది కొడకా, నేతగాడి రాత పూరాగా మారింది.

"అవ్, యీ సావులేందమ్మా!... యాడ యిను, మన చేనేత పనోళ్ల సావులే యినపడతన్నయి" అన్నాను.

అమ్మ వెంటనే బదులివ్వలేదు. ఓ నిమిషమాగి, భారంగా నిట్టూర్చుతూ, "కొడకా, నేతగాళ్లియ్యాల కొత్తగ పుట్టుక రాలె!

మన్సి బట్ట కట్టినప్పట్నుంచీ ఉన్నరు. కష్టాలూ కొత్తగా మొలకెత్తలె. మన్సి పుట్టినప్పట్నుంచీ ఉన్నయ్! మద్దెలో పుట్టుకొచ్చిన దబ్బు మాయలో మతులు మారి బతుకుల్ని తెంచేసుకుంటున్రు" అంది అమ్మ. కాని మాగన్ను వల్ల మారు మాటెత్తలేకపోయాను.

* * *

మరునాడు, ఉదయాన్నే స్నేహితుల్ని కలిసేందుకు వెళుతున్న నాతో "ముక్కంటీ...మీ అత్తనోసారి పలుకరించి రారాదూ?" అంది అమ్మ.

"అవ్, అత్తగవడలె, ఏవయిందమ్మా?"

'ఏవన్నయితేనే పలకరిస్తవ? వదిన బాగుంటే, నువ్వొచ్చిన కాణ్ణుంచి రాకుండ ఉండేదా... పోయి సూడరాదూ?"

"అనా... అత్తకి బాగలే! పురుగుమందు తాగింది గాదూ?... కొత్తపేట ఆసుపత్రిల నాల్దినాలుండి నువ్వొచ్చే ముంగల్నే అచ్చింది గాదూ?" అంది పెద్ద చెల్లి.

"ఆ! ఎందుకూ?"

"అమ్మ తలెత్తి యీసడింపుగా, "పొయ్యడగరాదూ?... బిడ్డల్ని కన్న నేరానికి మాకు పురుగుల మందులే గతైతున్నాయి. మాయదారి కాలవయింది. మన్సుల్ని సంపక తినే బుద్దులచ్చినయ్..." అమ్మ స్వరంలో బాధ మాత్రమే కాదు. దాన్నంటుకొని కాస్త కసీ ఉంది."

నేను అత్త వడిలోనే పెరిగానట!



చాలాకాలం దాకా అత్తకి పిల్లల్లేరు. లేక లేక పుట్టిన కూతుర్ని నా కివ్వాలనుకుంది. కాని మేనరికాల వల్ల కీడేదో జరుగుతుందని ఎవరో చెపితే, చెవినుంచుకొన్నాడు నాయిన.

"అయిన వాళ్లం. నాకున్నది పార్వతొక్కతే. ఈ ఆస్తి పరుల పాల్జెయ్యనా పెద్దన్నా?" అత్త ఏడుస్తూ అంది.

"ఆస్తుల కోసం పిల్లల బతుకులు బలిపెడదావా సెల్లా?.... ఎవ్వరి రాత ఎట్టుందో... ఆస్తుంటేనే బతుకా?... పిల్లా జెల్లా సుకంగుండొద్దా?..." అని, తనే ముందుండి, పార్వతి పెళ్లి ఘనంగా జరిపించాడు నాయిన. ఆ పార్వతికిప్పుడు ఇద్దరు పిల్లలు. ఆమెది కలిగిన కుటుంబమని అన్నారేగాని, కమ్మని కుటుంబమని ఎవరూ అనగా నేను వినలేదు.

మనుమళ్లతో సంతోషంగా గడపాల్సిన వయసులో అత్త పురుగు మందు ఎందుకు తాగిందో... ఎంతాలోచించినా, ఔననిపించే కారణమేదీ తట్టలేదు.

మా అత్తవాళ్లూ నేత పనివాళ్లేగాని, నేత పని లేనంతలో ఉపవాసాలుండే వాళ్లేం గాదు. పెద్ద కులపోళ్లకు తీసిపోకుండా ఉన్నవాళ్లే! మా నాయిన పోయాక, మా కుటుంబం ఎంతగా చితికిందో, మామ కుటుంబం అంతగా ఎదిగింది. మామ మండల రాజకీయాల్లో తిరగడం వల్ల అదో పై సంపాదన. అయినా అత్త పురుగుమందు తాగిందంటే... ఆర్థిక కారణం కాదనిపించింది.

ముందుగా అత్త దగ్గరకు వెళ్లేందుకు వీధిలోకొచ్చాను.

వీధి విశాలంగా ఉంది. ఐదారేండ్ల క్రింద కాలిబాటగా ఉన్న వీధిని బాగా వెడల్పు చేసి రోడ్డుగా మార్చారు. అయినా ఏదో వెలితి. ఎప్పుడూ నాలుగయిదు యిళ్ళలోంచి విన్పించే మగ్గాల చప్పుడు మాయమయింది. నాడెకు నూలు కండె గుచ్చి, మగ్గం గుంటలో కూచొని, పాణీ తొక్కుతూ పడుగుకు అడ్డంగా, వాటు కొడుతుంటే... వాటు వాటుకూ ఒక లయతో విన్పించే 'నాదిరదిన్న' అనే శబ్దం! – ఆ శబ్దంలో ఒక ఆదరణ! హాయి!! నిశ్చింతకు హామీ!!!

"ఏరా, ముక్కంటీ... నిన్నొచ్చినవటగా... ఇన్నాళ్ళకు యాదికొచ్చిందార ఊరు? "కర్రపోటుతో ఎదురొచ్చిన ఓ తాత, పేరు గుర్తుకురాలే... బుజం తడుతూ పలుకరించాడు.

"అవున్తాతా, మీ అందర్నోసారి సూసి పోదావని!"

"సాల్లేరా, మా కోతలు నేర్చినవ్. పట్నం గాలి సోకి నోడికి, చుట్టరికాలెందుకుంటయ్!" అని మరో మాటకు అవకాశం యివ్వకుండా దాటిపోయాడు.

"ఈడ బుట్టి యీడ పెరిగినోడ్ని.... నాలుగేళ్లకే పట్నపోడినయిన్నా? అనుకుంటూ, వీధి మలుపు తిరుగుతూనే, 'గుటఖా' నములుతూ కనిపించాడు పెంటయ్య. నా ఈడువాడే! అన్నీ బాగుంటే నాతోపాటు భీవండి రావాల్సినవాడే, వాడి నాయన ఉరేసుక చావకపోతే!

ఆ రోజు పెంటయ్య నన్ను వాటేసుకొని, "ముక్కంటీ, మయ్య ఉరేసుక సావాల్సిన గతేంద్రా... ఎంత కటకట రోజులయితే మటుకు, సావటమేంద్రా... కస్టాలు కొత్తగ పుట్టుకొచ్చినాయిరా?" అంటూ భోరున ఏడ్చాడు.

కష్టాల కారణంగా తన తండ్రి ఉరేసుకున్నాడనుకొంటున్నాడు పెంటయ్య అవునా? - అయితే... ఏ చేనేత కార్మికుడు సుఖంగా, సంతోషంగా ఉన్నాడు. ఊరిలో కష్టాల్లేకుండా బతికేదెవరు? అంతా సగం ఆకలితోనే రోజులెల్లదీస్తున్నారు. ఆర్థిక యిబ్బందుల్లో సతమతమవుతూనే ఉన్నారు. అయినా అందరూ ఆత్మహత్యలు చేసుకోవడం లేదు! ఆర్థిక యిబ్బందులే కారణం కాకపోవచ్చు. మరోటేదైనా... మనసును విరక్తి పాల్జేసే కారణం ఉండొచ్చనిపించింది. బదులివ్వకుండా ఊరడించాను, వాడినా రోజు!

"ఏరా, ముక్కంటీ... బాగున్నవ... భీవండి బతుకెట్టుంది? గిట్టుబాటవుతుందా?" నా చేతులు పిసుకుతూ ఆత్మీయంగా అన్నాడు పెంటయ్య.

"గిట్టుబాటంటే...? అవునంటే - అవును, కాదంటే - కాదు, ఏదైనా మనవనుకోవడంలోనే ఉందిగదరా!... నేనాడ నాలుగు డబ్బులు కళ్లజూస్తే, నువ్వీడ నలుగురు పలకరింపులతో పులకరించి పోతున్నవ్! దేనికదే గిట్టుబాటు."

''వలుకరింవుల్దేవుందిరా? కూటికొచ్చేవా? గుడ్డకొచ్చేవా?"

''మరీ కొట్టెయ్యకురా... ఆ పలకరింపులు కరువై ఏడ్చేవాళ్లెందరు లేరు. నువ్ నలుగురిల ఉండబట్టి నీకు తెల్వటంలే.... పలకరించెటోళ్లు లేక, తిన్నది వంటబట్టక, 'మనేది'తో మంచాన బడినోళ్లెందరు లేరు! గోదాట్లో యీత గొట్టోడికి తెల్వదురా, నీటి యిలవ! ఎడారిన సుడి బడ్డోడికి తెలస్తది!" అన్నాను.

"పోనీగానీ, పెళ్లెప్పుడు?"

"నీ పెళ్లికి పిలవలేదేందిరా?"

"గుర్తొచ్చినవ్‌రా ముక్కంటీ!.... పట్నవోడివాయె, పైసలెక్కేసుకొని బతికేటోళ్లు. తీరుబడి దొరికినా రావనుకొని...." నసుగుతూ అన్నాడు పెంటయ్య.

మనసు చివుక్కుమంది. పేదగా పెంటయ్యను చూస్తూ, "ఏంర్రా, పెంటయా... ఏరుబందంగా జూస్తనవ్! బతకడాన్కిపోయినగాని, మిమ్మల్ని యాది నుంచుకోనారా?" అన్నాను.

"పోనీలే, మా బతుకు లెట్టాగూ గొడ్డుబోతు బతుకులైనయ్! పొద్దుగూకులు రెక్కలిర్సుకొన్నా అనుంగ తినలేకపోతన్నం. నువ్వున్న నుకం గుండు, ఏమాత్రం కూడేసినవేంది?" అన్నాడు.

ఏం చెప్పాలో వెంటనే తోచలేదు. "నువ్వనుకున్నంతగాదులే" అన్నాను.

"అదేంర్రా? ఆ మాత్రం దానికి ఉన్న ఊరునీ, కన్నతల్లినీ వొగ్గేసి పోటం ఎందుకు?" అని, టక్కున చెయ్యొదిలి, "మళ్లీ కలుస్త, మా తాత తులిసాకు తెమ్మన్నడు. పోవాల," అంటూ పరుగులా కదిలాడు పెంటయ్య.

పెంటయ్యను చూస్తుంటే అదృష్టవంతుడనిపించింది. బతుకులోని అన్ని రుచుల్నీ, రంగుల్నీ అనుభవిస్తున్నట్లనిపించింది.

సంపాదనే జీవితం అనుకునేవాళ్లకు... చివరికా సంపాదనే



ప్రాణాంతకంగా పరిణమించిన దాఖలాలు ఎన్ని లేవు? ఆస్తుల కోసం కుట్రలూ, కోర్టులూ, హత్యలూ - లక్షలు కూడగట్టి, వాటిలో ఊహించుకొన్న ఆనందాలు కనిపించక నీరసించడం కంటే.. పెంటయ్యలా నిశ్చింతగా బతికితే చాలదూ...?

* * *

మా మేనత్త యింటి ముందు రెండు స్కూటర్లు నిలిపి ఉన్నాయి. నిలిపి ఉన్న బండి దగ్గర ఆడుకుంటూ ఐదారుగురు పిల్లలు!

మామ - ముందు వసారాలో పొడవాటి చెక్కమంచం మీద కూచున్నాడు. ఎదురుగా ఎవరో ఇద్దరు... ఏవేవో మాటలు.

నన్ను చూస్తూనే ౕ గావు "రా, రా... ముక్కంటీ, నిన్నొచ్చినవటగ.... వద్దామంటే కుదిరి చవలె. ఇంట్లెకి పో, మిత్తని 'పలకరించు" అన్నాడు.

ఇల్లు నిశ్శబ్దంగా ఉంది. అత్త మంచంలో పడుకొని ఉంది. చాలా బలహీనంగా ఉంది. అత్త ఎలాటి బతుకు బతికింది! ముగ్గురన్నల చెల్లిగా ఎంత మురిపెంగా, కలుపుగోలుగా ఉండేది? మా అమ్మ దగ్గర ఎన్ని గారాలు పోయేది?

దగ్గరగా చూచాని, "అత్తా" అన్నాను.

నెమ్మదిగా కళ్లు తెరిచింది. నన్ను గుర్తుపట్టి, లో గొంతుతో, "బాగున్నవా నాయినా..." అంది. ఆమె కళ్లలో కదిలిన నీటికి నా కళ్లు తడిశాయి.

అత్త చిన్నగా లేచి, దిండును ఆసరా చేసుక కూచొని, "పురుగుల మందు గొంతుల పోసుకునే ముంగల నువ్వూ, పార్వతీ యాదిలకొచ్చిన్రు. ఆ పోరి దెట్టాగూ రాదు. నువ్వన్నా వస్తే బాగనిపించింది" అంది.

''పార్వతెందుకు రాదు, కబురెట్టలేదా?"

"ఇంత జరిగింది దాని పున్నేన్నే గాదూ!... దాని కట్నం డబ్బులో పాతికేలు యింకా యియ్యాల్సున్నం. అయి యిచ్చిందాకా మా మొహం సూడదట. తనకి తల కొట్టేసినట్టుందట. ఈ ఇల్లమ్మి డబ్బియ్యమని ఫోను మీద ఫోను..." అత్త కొంచెం సేపాగి, ఆయాసం తీర్చుకుంటూ, "ఇదంతా దానిది కాదా? సచ్చిన్నాడు నెత్తినెత్తకపోతవాౘ... ఏదవ పాతికేల కోసం కన్నోళ్లని అన్నేసి మాటలంటదా?... మా కెవురున్రు?... కొడుకయినా, కూతురయినా అదే గద, అయితే అట్ట నోరు పారేసుకుంటే, ఇంగీ బతుకెందుకనిపించింది, నా మనసిరిగింది ముక్కంటీ... అంటూ కళ్లు వొత్తుకుంది అత్త.

"అందుకని, సత్తవా అత్తా?"

"సావక! కడుపున బుట్టిందే "సీ" అన్నాక బతికేం, బత్కేం?.... కల్సి బతకాల్సిన బిడ్డే... కయ్యాల మారిదై, కాల్చుక తింటుంటే... ఇత బతుకు తీపేం తెలస్తది. సేదెక్కి ఊసెయ్యాలనిపించదూ?'' అత్త కళ్లు జలపాతాలయ్యాయి.

"ఏడవకత్తా?" మరేమనాలో తెలీక, అన్నాను.

మామ యింటిలో కొచ్చాడు. "మళ్ళీ మొదలేసినవా? దాన్ని తల్సుకోవద్దన్నానా?... ముక్కంటీ, ఇదిరా... మీ అత్త వర్స. దాని గుండె గోస సూస్తంటే నన్నేడ ఒంటిరొడ్ని సేస్తదోని పిసక్క సస్తన్న. తల్లీ బడ్డల పంతంతో

నా పానం గిల గిలలాడతంది." అదో మాదిరి గొంతు – గాద్గద్యమూ కాదు, చిరాకూ కాదు, రెండూ కలిసినట్టుగా, కొత్తగా ఉంది మామ స్వరం.

"అత్తకేం కాదులే మావా... ఆవె పున్నెవే ఆవెని కాపాడ్తది" అన్నాను.

మామ... కొంత సేపటికి తేరుకొన్నాడు "దా, బయట కూసుందాం" అన్నాడు.

"వద్దులే... ఈడనే, అత్తకాడనే కూసుందాం" అన్నాను.

అత్త నీరసం గుందంటూ మళ్ళీ పడుకొంది... మాత్రేసుకొన్నవా?" అంటూ మామ, దుప్పటికప్పి, దిండు సర్ది, కుర్చీలో చేరాడు.

"కాళ్లు లాగుతున్నయి..." అంది అత్త.

మామ – మళ్ళీ లేచి, అత్త కాలివేళ్లను కొంచెం సేపు లాగి, వత్తుతూ, "ముక్కంటీ, ఆ సిన్న గూట్లో మందు ట్యూబుంది. తే...." అన్నాడు.

నేను, తెచ్చిచ్చాక, మోకాళ్ల దాకా ఆ మందు రాసి, మళ్లీ దుప్పటి కప్పి, కూచున్నాడు.

మామ – పెద్దగా చదువుకోకపోయినా – రాజకీయాల్లో తిరగడం వల్ల కాస్త మాటకారితనం ఎక్కువ. పెద్ద మనుషుల మాటా – మంతీలో మామ మాటకి మంచి గిరాకీ ఉంటది. మా ఇళ్లలో ఏ జరిగినా మామ ముందుండాల్సిందే. ఎంత ముదురోళ్లయినా మామ మాట తీరుకు చిత్తయి పోవాల్సిందే!

"ముక్కంటీ, నీ కోటి చెప్పాలనిపిస్తంది. వెనకటి పెద్దల మాట... పొరుగూరి సోల కూలి కన్న ఉన్నూరి గిద్ద కూలి మెరుగ'ని ఊకెనే అనలె.

... నువ్వాడ తినో, తినకో వందలు మూటగట్టినవా? ఈడ మీ అమ్మి ఆ వందలకి సరిపోను రోగాల్ని మూటగట్టుకుంది. నువ్ పోయిన్నాటి నుంచీ రోజురోజుకీ కట్టెలెక్కనయింది. ఎందుకంటవ్?" అన్నాడు మామ.

"ఎందుకు?"

"తిన్నది వంటబడితేనే మనిషి! ఆ తిండి వంట బట్టాలంటే 'మనేది' ఉండకూడదు. నీ 'మనేది'తో మీ అమ్మ మంచం పట్టింది. కారం మెతుకులు తిన్నా అందరూ కల్సి తింటే పరమాన్నంతో సవానం. బతుకంటే అదే మరి. –

నా గొంతుకేదో అడ్డుపడినట్టుగా మాట రాలేదు. దిగాలుగా చూశాను.

"నిజం, ముక్కంటీ... డబ్బు రోగం అంటిన యీ కాలపోల్లకి తెల్సి సావడం లేదుగాని, పండగలనీ, నోములనీ, వ్రాతలనీ... ఎందుకు పెట్టిన్రో తెలుసా? సంక్రాంతనీ, దీపాళనీ... ఆ మాటకొస్తే రంజానూ, కిస్మిస్ (క్రిస్మస్) కూడా... దేవుళ్ల మాటేవో... నాకు తెల్వదుగాని, అయినవాళ్లంతా కలుసుకోటానికే యీ పండగలు!" మామ ఆగి, అత్తనోసారి చూసి, మళ్లీ నాకేసి చూపు మరల్చి, "అయినవాళ్లు కలుసుకున్న ప్రతిసారీ వాళ్ల హృదయాలు



మరోసారి జీవం పోసుకుంటాయట! గుండెలు గట్టిపడతాయట! మనసులు చిగురిస్తాయట! మొహాల్లో కళొస్తదట!... దాంతో ఏ రోగమూ దరికి రాకుండా 'మనేది' లేకుండా బతుకుతారట" అన్నాడు.

"అవునా మామా... కావొచ్చు. కాకుంటే ఏ దేవుడ్నయినా సూసిందెవురు?"

నా సందేహానికి బదులివ్వకుండా, తన వరసలో మామ – "అంతెందుకు, మా తాతల కాలాన ఉమ్మడి కుటుంబాలతో పండుగలాగ బతకలేదా?... మా నానమ్మ చచ్చిందాకా తుమ్మిన పాపాన పోలే... అంత పుష్టిగ బతికింది" అన్నాడు.

"అవ్ మామా...."

"అవ్ మామా.. అంటవ్, ఆనెంక ఎక్కిరిస్తవ్. ఈ కాలపోడివి... మీ నీడల్నే నమ్మరు మీరు. డబ్బులూ, కుషీలు తప్ప, మీకు కుటుంబాలూ, సంబంధాలూ... అనుబంధాలూ యాడ నచ్చినయ్? ఏదో తింటున్రు... బతుకుతున్రు... సప్పిడి బతుకు!.... వస్త, పనుంది" అంటూ మామ వెళ్లాడు.

పోతున్న మామకేసి చూస్తుండిపోయా. మామ చెప్పిందాంట్లో సత్యం లేదని కాదు. కాని మారుతున్న రోజుల్ని బట్టి, విలువల్ని బట్టి ఆ సత్యం చెలామణించడం లేదే! అయిన వాళ్లయినా, కన్నవాళ్లయినా డబ్బును బట్టే గుర్తిస్తున్నారే!

నా గుండె కవాటాలు మూసుకుంటూ, తెరుచుకుంటూ, ఎటూ మొగ్గడం లేదు. మనసున గజిబిజి ఆలోచనలు!... చిందర వందరగా గెంతుతూ, బుడగలేస్తూ... అయోమయపు ఆలోచనలు!

మామ మాటలు వదలకుండా వెన్నాడుతున్నాయి. మంచేదో, చెడేదో తేల్చుకోలేకపోతున్నాను.

* * *

"పయానమెప్పుడురా కొడకా?" మరో మూడు దినాలు గడిచాక, అమ్మ తలకు నూనె రాస్తూ అంది.

"పోనామ్మా?" తలెత్తి చూస్తూ అన్నాను.

అమ్మ అదోలా చూసింది. "నేను సెపితే ఆగుతవా? ఎన్నడాగినవ్?

..... మగ్గం అమ్మొద్దంటే ఆగినవా? కల్సి బతుకుదాం అంటే యిన్నవా?" అంది.

"అమ్మా...." – నేను

"నీ యిస్టం కొడకా, నీకెట్ట మంచిదనిపిస్తే అట్టనే బతుకు.

నాదేముంది?.... ముసల్దాన్ని... రేపో మాపో మట్టిల కలిసేదాన్ని" అంది అమ్మ. ఆమె లోలో కుమిలిపోతుందని ఆమె స్వరమే చెపుతుంది.

నేనెటూ నిర్ణయించుకోలేకపోతున్నాను.

'భీవండి' పోయి నాలుగు డబ్బులు సంపాయిస్తే మంచిదో.

యిక్కడే ఉండి దొరికిన చిన్నా చితకా పనేదో చేసుకుంట బతికితే మంచిదో ఎటూ తేల్చుకోలేకపోతున్నాను.

మా ఊరివాళ్లనెవరి నడిగినా కొందరటూ... కొందరిటూ...

నేను 'భీవండి' వెళ్లనా? మా ఊళ్లోనే ఉండనా...??

*

# సందర్భం

## అన్నా విజయకుమారి



సందర్భాలు, సన్నివేశాలు
వేళ్ళు పాతుకు పెరిగిపోతాయి
నేను నత్తనై గవ్వలా ముడుచుకుపోతుంటా
శరాలై దూసుకు వచ్చే హెచ్చరికలని
అసిధారా చక్రంలా మోస్తూ...
దుఃఖాన్ని విరజిమ్ముతూ...
మెలికలు తిరుగుతూ గుసగుసలాడే గాలి తరగల మధ్య
నా చుట్టూ అంతా దుఃఖం వాసనే
ఏవో రంగులు - అర్థం కాని గీతలు వెంటాడుతూ...
నిండుగా తడిసి వణికిస్తున్న దుఃఖం స్పర్శ
తురాయి పూల పరిమళంగా అల్లుకుంటూ
సముద్రం విరిగి ముక్కలవుతున్నట్లు
వాన నీటితో కరుగుతున్న మట్టిముద్దలా దేహం
ఒక కొత్తమాట కోసం గొంతు పగిలేలా అరవాలని
ఊపిరాడనీకుండా ఉక్కిరి బిక్కిరి చేస్తున్న గుండె గదిలో -
తలక్రిందులుగా వేలాడుతూ...
నాలో ఒకటి తరువాత ఒకటి వరుసలు దీరి
సామూహిక గానం చేస్తున్న కీచురాయి పాట
అవాంఛితమైన దేహంలో అనంతకాలపు ఖైదీనై
బయటపడే చిన్న మార్గం కోసం
గడ్డకట్టుకుపోయిన దుఃఖంలో దేహాన్ని మోసుకుంటూ
అకస్మాత్తుగా నాలో దుఃఖాన్ని చెరిపేసే సూర్యుళ్ళు
నా చుట్టూ - చెట్టూ - పిట్టా - భూమి - ఆకాశం అంతా మేల్కొలుపుతూ
ఏకాంతవాసాల నైరాశ్యాన్ని పారద్రోలుతూ
సందర్భాలుగా విడిపోతూ
సన్నివేశాలుగా ప్రత్యక్షమవుతూ
గుత్తులుగా జారిన కన్నీటి చుక్కల ఉప్పదనాన్ని విరిచేస్తూ
కన్ను పొడుచుకుంటూ నడచిన దారులకి వీడ్కోలు చెపుతూ
పాయలుగా ప్రవహిస్తున్న జలపాతమై
విశ్వచైతన్యాన్ని దోసిళ్ళతో వెదజల్లుకుంటూ
స్వేచ్ఛా నీలాకాశం క్రింద
మబ్బు పొత్తిళ్ళలో
కొత్త ఆశల్ని మొలిపించుకుంటూ...

---

# నానీలు

## డాక్టర్ వై. కృష్ణకుమారి

ముసలితనంలో
పెళ్ళి కొడుకులయ్యే
షేకులు
కూతుర్ల గతి ఏంటి?

సంస్కృతి
దిగజారిపోయాకే
ప్రపంచీకరణ
ఊపిరి తీసుకుంటుందా?



పేద లేదని
మట్టి గొబ్బెమ్మలు
మరి రేపు రేపు
సింథటిక్ బొమ్మలా?

మధు మేహ రోగిని
కుట్టి,
కందిరీగ తేనెటీగై
బిత్తర పోయిందట

అన్ని
అనునాసికాక్షరాలే
తుమ్మితే
ముక్కు ఊడిపోయిందట

హరిత విప్లవం గురించి
ఏసి గదుల్లో చర్చ
నీళ్ళులేక
చెట్లు నిండాయి

కూరలో ఉప్పు లేదంటే
రుచే లేదు
సముద్రమంతా ఉప్పే
ఛీ! అదేం రుచి?

ఎన్నిసార్లు పార్లర్‌కు వెళ్ళినా
ఏం లాభం!
ముసలితనం
గెలుస్తూనే ఉంది.

---

# అన్నీ తీరని దాహాలే



## - గవిడి శ్రీనివాస్

అలల రెప్పల్ని
కనుగుడ్ల తెడ్లతో నెట్టాను
ఒడ్డుకు
చేరని
కన్నీటి కలల్ని మింగుకున్నాను
చేప నీటిలో
పక్షి గూటిలో
నాకూ కనిపించని వేరే ప్రపంచం
దిక్కులు చలిగా మూసుకున్నప్పుడు
ఎక్కుపెట్టే ప్రయత్నాల పర్వంలో
రాలిన ఆకులూ
వాడిన మొగ్గలూ
అన్నీ తీరని దాహాలే

# అడుగడుగునా కారంచేడు

వై. శ్రీరాములు



అగ్రవర్ణాల
చీకటి గుణం
పెనుతుఫానై
రాత్రికి రాత్రే
దళితుల ఇళ్ళను
కూల్చింది.

ఇంటి పై కప్పుల్ని
ఇంటిలోని
పప్పుగింజల్ని
కంటక నిప్పుల వరదై
నిలువునా కూల్చింది

పంచన బతకాల్సినోడు
పంచ కడుతున్నాడని,
కసి.

నించుని
కునుకు తీయాల్సినోడు
మంచాలపై
నిదురిస్తున్నాడని,
కసి.

నేలపై
కూలబడేవాడు
కుర్చీలలో కూర్చుంటున్నాడని,
కసి.

గాలికి
బతకాల్సినోడు
గాలిలోకి
మేడలు లేపుతాడేమోనని
కసి.

కూలికి
రావాల్సినోడు
నేలను దున్నుకుంటున్నాడని,
కసి.

తలదించి
బతికేటోడు
తలఎత్తి
బతుకుతున్నాడని,
కసి.

మనిషిని
మనిషిగా చూడాలంటేనే,
కసి.

రెక్కలు ముక్కలు చేసి
కొన్న ఫ్యాను రెక్కల్ని
ముక్కలు చేసిన
కసి.

అందిన
ప్రతివాన్ని
కరిచేసిన
పిచ్చికుక్క
కసి.

వాడి పెరట్లోనే,
పూలు.
వాడి భూమిలోనే,
ధాన్యం
పండాలనే
కసి.

తన భూమి పనికి
పనికిరాని
పనికిరానివారి
కాళ్ళూ చేతులు
నరికేసిన
కసి.

అడుగడుగునా
కారంచేడు
ఆద్యంతం చేయాలని
వల్లకాడు.

ఏ గొంతు
దప్పికనైనా
ఏ పొలాన్నైనా
తడిపే గుణం
నీటికుంది.

నేలకు
నీది
నాదనే బేధం
లేనే లేదు.
అది అందరిది.

భూమికి మొలకెత్తే శక్తి
మనిషికి
ఆలోచించే స్వశక్తి
వున్నప్పుడు
ఎవడి పెత్తనం
సాగదు.

ఎన్నిసార్లు
నువ్వు
వెనుకనుంచి
దాడి చేసినా!

అన్నిసార్లూ
ఎదురు నిలిచి
పోరాడటం
తప్పదు.



# కొత్తగాయాల తల్లి

గంటేడ గౌరునాయుడు

వంతెన దువ్వెనతో అలల నీలి కేశాలను
పాయలుగా తీసి రెండు జడలేసి
నాగావళిని పడుచు పిల్లను చేసి
వెంకన్న కోవెలను శిరోభూషణంగా అలంకరించిన తల్లి తోటపల్లి
ఒక్కసారి ఉలిక్కిపడింది

నా నేల మీద నా హక్కును అడగడం నేరమయ్యింది
నా గుండె కాయకు ఖరీదు కట్టి అరువు బేరాలు సాగిస్తుంటే
ప్రశ్నించడం నా పొరపాటయ్యింది
అటు మొలుచుకొచ్చిన ఖాకీవనం
ఇటు పోటెత్తిన జనసముద్రం
రక్తాభిషేకంతో అరుణారుణమైన దేహాన్ని చూసుకుని
విస్తుపోయాడు వెంకటేశ్వరుడు
రాజ్యసింహానికి కాళ్ళూ గోళ్ళూ కోరలూ అధికారులని
అర్థం చేయించింది తోటపల్లి
కాలం చెక్కిట కన్నీటి చారికయ్యింది తోటపల్లి

నువ్వు పువ్వు గోకరంలో చెమటను పాల చుక్కలు చేసి
పుడమిని పసిపాపగా లాలించాల్సినవేళ
ఖాళీవనంలో నెత్తుటి పువ్వును కావడం యాదృచ్ఛికం మాత్రం కాదు
పండును తినడమెలాగో పండే నేర్పినట్టు
బతుకు పోరును బతుకే నేర్పుతుంది
నేలను ప్రేమించిన బాదికే కదా తెలిసేది నేలకు దూరం
కావడంలోని బాధేదో...
ఏటికి ఎదురీదే శక్తి ప్రేమనించే పుడుతుందని
తొలిపాఠం చెప్పింది తోటపల్లి

నేలంటే కొంచెం మట్టి, కొంచెం ఇసుక
లేదా కొన్ని రాళ్ళు రప్పలేనా?
నేలంటే నాలుగు గట్టు... నడుమ కొంత ఖాళీ జాగాయేనా?
నేలంటే కొనుక్కునే వస్తువు మాత్రమే కాదుగదా...
నేలంటే తరతరాల స్వేద పరిమళాలు వీచే నా పూర్వుల
రక్తమాంసాస్థికంలోంచి మొలుచుకొచ్చిన బతుకు చెట్టు
నేలంటే నాగలి మొన స్పర్శతో పులకరించిన నా తల్లి చేతిలో
అరవిరిసిన బువ్వ పువ్వు
హరిత ప్రవాహ గానమై నాలో ప్రసరించి
నన్ను నడిపించే నెత్తుటి సంగీతం
ఇరిడి బండి, పునస నాగలి, పూలు, మేడి.. ఏటికర్ర... నొల్ల చెక్క
సమస్త పనిముట్లు నేల శరీర భాగాలే కదా.

నా భార్య సిగలో నవ్వై పూచి
దేవుడి గూట్లో దివ్వై మొలిచి
నా నట్టింట పరుచుకున్న పసుపు కాంతుల పున్నమి కార్తీకం నేల
నా ఇంటి మునివాకిలి దువ్వారానికి బంతి పూలదండై వేలాడి
వచ్చే చుట్టాల కోసం పాడే పలకరింపుల పాట నేల

నా కూతురు పెళ్ళి నేల
నా కొడుకు చదువు నేల
నా కష్టం నేల... సుఖం నేల
నా కాళ్ళకు ఊనిక నేల
వావి వరసల మమతానుబంధాల అనురాగాల అల్లిక నేల
నా కలలో... కన్నీళ్ళూ... నా సర్వస్వమూ చేరడు నేలే...

పరిహారాన్ని స్వీకరించమంటే ఆత్మలేని దేహాన్ని వలస పోవడం
నేలను దూరం చేసుకోవడమంటే కర్ణుడినై చర్మాన్ని వొలుచుకోవడం.

కడసారిగా నేల మీద నా పాదముద్రలను తాకి చూద్దామనుకుంటే
నదిని దానం చేశాక అలల మీద ఆశలింకేలరా వలస పక్షీ అని
తత్త్వ బోధ చేసింది

తోటపల్లి
ఇప్పుడు
నా వొళ్ళొక తోటపల్లి
చినుకులకు చెదిరిపోతున్న రంగవల్లి
జల సమాధికి తలవంచిన నీరుల్లి
తోటపల్లి... కొత్త గాయాల తల్లి



# "మా ఇల్లు"

గరికపాటి మణీందర్

ఆగ్రాలో తాజ్‌మహల్ ఏమోగానీ
వెన్నెల్లో మా తాటాకుల ఇల్లు
అనపకాయల తీగను చుట్టుకుని
బిడ్డల బరువును మోస్తున్న
ఒంటరి తల్లిలా వుండేది...
ఆదివారం పూట హాస్టల్లో బువ్వతిని
పొద్దువాలకముందే
ఈత తోపు నుండి ఇంటికి రావడం కోసం
ఎంతగానో తపించిపోయేవాణ్ణి...
ఆరుబయట పండు వెన్నెల్లో
బొంతపైన మూకుమ్మడిగా కూర్చుని
అమ్మ చేతి కారం బువ్వ తిన్నా
అమృతంలా అన్పించేది...
ఎప్పుడో ఓసారి
ఎండు చియ్యల తోరణాలతో
ఇల్లంతా కళకళలాడేది...
నాన్న పాత పంచె చాటు కట్టిన
సగం రాలిన మట్టి గోడలపైనే
మసి బొగ్గుతో ఓనమాలు దిద్దాను.
గోడ నెర్రెల్లోంచి ఏపుగా ఎదిగిన
జాడు కర్రల ముద్దకంకుల్ని
ఆత్మీయంగా ముద్దాడాను.
ఎన్నో కష్టాల్లో కాపుల దగ్గర తాను తాకట్టయి
మా పరువును నిలబెట్టింది.
ఎండవానల నుండి చలి రాక్షసి బీభత్సం నుండి
కంగారులా కడుపులో పెట్టుకుని
పొదవి బట్టి మా ప్రాణాలు నిలబెట్టింది.
వానా కాలం రాత్రులు
నీటిపై ఊగే తెరచాప పడవలా తేలియాడేది...
కప్పల కుప్పల బెకబెక విలంబిత దరువులకు
సంగీత సదనంలా మారిపోయేది....
క్రిస్మస్ పండుగకు అమ్మ
కొడుకును శుభ్రం చేస్తున్నంత శ్రద్ధగా
గోడలను ఎర్రమట్టి పట్టీలతో
అందంగా అలంకరించేది...
మిణుకు మిణుకుమనే కిరసనాల
గుడ్డి దీపం చుట్టూ శలభాల్లా చేరి
పుస్తకాలు వల్లెవేసిన మా బ్రతుకుల్లో
కొత్త వెలుగు నింపింది.
ఆధునికంగా చుట్టూ లేచిన
ఆకాశ హర్మ్యాల మధ్య
శిథిల దేవాలయంలా దీనంగా
చూస్తున్నట్లనిపిస్తుంది.
తనవైపు చూసిన ప్రతిసారి నన్ను
బాల్య జ్ఞాపకాల దొంతరల్లోకి లాగేస్తుంది.

# తెలుగు కథ - అభ్యుదయోద్యమం



తెలుగు కథ మీద అభ్యుదయోద్యమ ప్రత్యక్ష, పరోక్ష ప్రభావాలను సమీక్షించడంలో జరగవలసినంత కృషి జరగలేదు అని ఈ సందర్భంలో మనం గుర్తు చేసుకోవాలి. ఆంధ్రప్రదేశ్‌లోని నాలుగు ప్రాంతాల అంటే తెలంగాణా, రాయలసీమ, కోస్తాంధ్ర, కళింగాంధ్ర, ప్రాంతాల నుంచి గడచిన ఏడారు దశాబ్దాల్లో కనీసం మూడువేల మంది కథా రచయితలు కన్పిస్తారు. అయిదు తరాల రచయితలు వీళ్లు. నిన్న మొన్నటి దాకా తెలుగు కవిత్వంలో అభ్యుదయ విప్లవాలను విమర్శకులు విపులంగానే పరామర్శించారు. వచన ప్రక్రియల్లో ప్రధానంగా కథ విషయంలో ఈ పరామర్శ అతి తక్కువగా జరిగింది.

**కేతు విశ్వనాథరెడ్డి**

అభ్యుదయోద్యమం అంటే అభ్యుదయ సాహిత్యోద్యమం, తెలుగు కథ మీద ఈ అభ్యుదయ సాహిత్యోద్యమ ప్రభావం అంటూ పడిందా? ఈ ఉద్యమం వల్ల తెలుగు కథకు మేలంటూ జరిగిందా? జరిగిన ఆ మేలు ఏమిటి? ఈ ఉద్యమం వల్ల కథా సాహిత్య విలువలు నిజంగా పెరిగాయా? ఈ ప్రశ్నల్ని ఎవరైనా చారిత్రకాసక్తి కొద్దీ అడగవచ్చు. సాహిత్య వివాదం కోసం అడగవచ్చు. ఎవరు ఎట్లా ఎందుకోసం అడిగినా చర్చించడం మంచిది. తెలుగు కథా సాహిత్యంలోని సామాజిక సాహిత్యాంశాలనూ, వీటి పరస్పర సంబంధాన్నీ వివేచించడం మంచిది. అప్పుడు మాత్రమే అభ్యుదయ సాహిత్యోద్యమం అభ్యుదయ రచయితల సంఘం సారధ్యంలో నడచిన ఉద్యమం తెలుగు కథా సాహిత్య చలనానికి దోహదపడిందో లేదో తెలుసుకోగలుగుతాము.

అభ్యుదయ సాహిత్యోద్యమం తెలుగునాట పుట్టి అరవై ఏళ్లు దాటాయి. ఈ ఉద్యమానికి అంతకుముందే అంతర్జాతీయ అభ్యుదయ సాహిత్య లక్ష్యాలు ప్రేరణ ఉంది. ఆ లక్ష్యాలు 'స్వేచ్ఛ, ఆలోచన, భావ ప్రకటన స్వాతంత్ర్యం', జాతీయ, ప్రాంతీయ సాహిత్యాల వారసత్వముంది. సంఘ సంస్కరణోద్యమం, జాతీయోద్యమం కథా సాహిత్యంలో ముందుకు తెచ్చిన సంస్కరణ భావాల, ఆధునిక భావాల నేపథ్యముంది. గడచిన నూరేళ్ళలోని రాజకీయ, రాజకీయేతర ఉద్యమాల, చారిత్రక ఘటనల, సామాజిక సందర్భాల, శ్రోతలు, పాఠకులు, ప్రేక్షక వర్గాల్లో వచ్చిన మార్పుల ప్రభావాలు కూడా ఉన్నాయి. వీటి వెలుగులో తెలుగు కథకూ అభ్యుదయోద్యమానికీ ఉండే సంబంధాన్ని తెలుసుకోవాలి. తెలుగు కథ మీద అభ్యుదయోద్యమ ప్రభావాలను చర్చించాలి. అభ్యుదయ కథా దీపధారుల కృషిని గురించి పరామర్శించుకోవాలి. అభ్యుదయ కథా రచయితలు చిత్రించిన జీవిత సమస్యలనూ, వారి అవగాహనను అంటే ప్రాపంచిక దృష్టినీ వివేచించాలి.

1936, ఏప్రిల్ 9, 10 లక్నోలో జరిగిన అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం మొదటి సమావేశం "జీవితాన్ని విమర్శించేదే సాహిత్యం'' అని అభిప్రాయపడింది. "ఏ రూపమైనా కావచ్చు జీవితాన్ని తప్పనిసరిగా వ్యాఖ్యానించాలి, భాష్యం చెప్పాలి.... మానవుడి ఔన్నత్యానికి, దివ్యతకు అవరోధంగా ఉన్న వాటినన్నిటినీ ఎదుర్కొంటారు రచయితలు, దళితులు, పీడితుల పక్షపాతం వహిస్తారు అని ప్రకటించారు. 1943 ఫిబ్రవరి 13, 14 తేదీల్లో తెనాలిలో సమావేశమైన మొదటి మహాసభల్లో ప్రకటించిన అభ్యుదయోద్యమ లక్ష్యాలు : భారతీయ నాగరికతలోని ఉత్తమ సంప్రదాయాల వారసత్వాన్ని గౌరవిస్తూ, దేశంలోని అభివృద్ధి నిరోధకత్వాన్ని అన్ని విధాలా విమర్శించడం దేశీయ, విదేశీయ విజ్ఞాన సంపదను వినియోగించుకోవడం, నూతన సమాజాభివృద్ధికి పాటుపడటం, ఆకలి, దారిద్ర్యం రాజకీయ బానిసత్వం, సాంఘికంగా వెనుకబడటం, అభివృద్ధి నిరోధక సంస్కృతిని ప్రతిఘటించడం అంటూ కుల మత శక్తులు, జాతి విద్వేషం, వర్గ దోపిడీ వీటిని పురిగొల్పే శ్రోతల్ని ప్రతిఘటించడం."

ఈ లక్ష్యాల రూపం ఈ ఏడారు దశాబ్దాల్లో మారుతూ వచ్చిందేగానీ సారం మారలేదు.

ఈ సందర్భంలో 1948 అక్టోబర్ అభ్యుదయ సంచికలో రాసిన మద్దుకూరి చంద్రశేఖరరావు "ఆంధ్ర సాహిత్యంలో కొత్త పోకడలు" అనే వ్యా213ంలోని ఒక అంశాన్ని ప్రస్తావించుకోవాలి. ఈ వ్యాసంలో ఆయన ఒక మాట అన్నారు. ప్రజా వుద్యమాల నుంచి వచ్చిన రచయితలకు జీవితానుభవం ఉంది. కాని సాహిత్య విజ్ఞానం తగినంత లేదు. అందుచేత నూతన రచయితలు వ్రాస్తున్న వాటిలో వున్న లోపాలను సరిదిద్దడానికి అనుభవజ్ఞులు సాయం చేయాలి" అని అన్నారు. ఆయన సాహిత్యంలోని నిర్మాణపరమైన అంశాలను దృష్టిలో పెట్టుకున్నట్లు మనం భావించవచ్చు.

అప్పటికే కథా రచనలో అనభవజ్ఞులై, అభ్యుదయోద్యమంతో సంబంధం ఉండిన కొడవటిగంటి కుటుంబరావు, చాగంటి సోమయాజులు రాసిన కథల్ని చూద్దాం. అభ్యుదయ కథకుల్లో వాళ్ళిద్దరూ మార్గదర్శకులు.

కుటుంబరావు నాలుగు వందల దాకా కథలూ, కల్పికలూ రాశారు. కుటుంబ హింస, సామాజిక హింస, వర్గ హింస, రాజ్య హింస ఏయే రకాల్లో, ఏ విధంగా బయటపడుతుందో, వాటిని ఆదరించే సంస్కార భేదాలేమిటో, ఆ సంస్కారాలను తీర్చిదిద్దుతున్న సామాజిక, రాజకీయ, సాంస్కృతిక శక్తులు ఎట్లాంటివో, వాటి మూలాలేవో ఆయన తన కథల ద్వారా నిరూపించారు. శ్రామిక వర్గాన్ని గురించి ఒకటి రెండు కథలు రాసినా, ప్రధానంగా మధ్యతరగతి విలువలు, ఆ తరగతిలో ఘర్షణ పడుతున్న కొత్త భావాలు, కొత్త సంస్కారం, కుటుంబరావు కథా వస్తువులు, వ్యక్తికీ, కుటుంబానికీ, ఆర్థిక స్థితిగతులకూ, సంప్రదాయాలకూ, కొత్త ఆలోచనలకూ మధ్య ఉండే సంబంధాలను ఆయన చిత్రించారు. వ్యక్తిగతమైన మోహాల, ప్రేమల స్థానంలో సామాజిక ప్రేమను కథల ద్వారా చాటడానికి కుటుంబరావు పూనుకున్నారు. సామాజిక ప్రేమ ఆయన దృష్టిలో నిజమైన ఆపేక్ష, పరస్పరం ఇచ్చి పుచ్చుకునేది. తన రచనలు అభ్యుదయ రచనలే అని నమ్మారు. అభ్యుదయ కథా సాహిత్యానికి పట్టుగొమ్మగా నిలిచారు.

అభ్యుదయ కథా సాహిత్య వ్యాఖ్యాతగా, ప్రచారకుడిగా ఉద్యమ దీక్షతో వ్యాసాలను కూడా రాశారు.

కథా శిల్పాన్నీ, సజీవ పాత్ర చిత్రణనూ, వాస్తవికతా వాద కళనూ, కుటుంబరావు పాఠకులకు తన కథల ద్వారా నిరూపించారు. జీవితంలోని వైరుధ్యాల మధ్య జీవిత సత్యాలనూ, గతిశీలతనూ కుటుంబరావు నిరూపించారు.

తెలుగు కథా రచనలో కుటుంబరావు కొత్త పోకడలు పోయారు. ఆయన రాసిన ఐతిహాసిక కథ బకాసుర, అన్యార్థ కథ, జంతు కథ, పట్నవాసం, వ్యంగ్య కథలు, దిబ్బ రాజ్యం వంటివీ, శాస్త్ర విభజన కల్పనా కథలూ, అభ్యుదయ రాజకీయ భావాల కథా రూపాలు. 50 దశకంలో విజృంభించిన డిటెక్టివ్ సాహిత్యాన్ని కేయాస్ కథలలో వ్యంగ్యంగా విమర్శించారు. పిల్లల మనస్తత్వాలను ఆడించే వాతావరణం ఏదో వాళ్ళను గురించి రాసిన కథల్లో నిరూపించారు. మానవ విలువలు, ఆ విలువల్ని ధ్వంసం చేయగలిగిన సామాజిక రాజకీయ సాంస్కృతిక శక్తుల్నీ, కల్పనా శాస్త్ర విజ్ఞానాన్నీ కుటుంబరావు తన కథల ద్వారా చిత్రించారు. అభ్యుదయోద్యమ పరమ లక్ష్యమైన నూతన సమాజాభివృద్ధికి దోహదం చేశారు.

"మార్క్సిజాన్ని కథా సాహిత్యంలోకి ప్రవేశపెట్టింది నేనే" అని చెప్పుకోవడంతో పాటూ, దానికి నిదర్శనంగా కథా రచన చేసిన చాసో అభ్యుదయ సాహిత్యోద్యమ నిర్మాతల్లో ప్రముఖులు. చాసో తన కథల్లో ఆకలి, దారిద్ర్యం, పీడనను ఇతివృత్తాలుగా తీసుకున్నారు. ఆర్థిక రాజకీయాల నుండి, రాజకీయార్థిక విజ్ఞానం అనండి, ఏదైనా పీడన స్వరూపం ఎట్లా ఉంటుందో కుంకుడాకు, కుక్కుటేశ్వరం, బొండు మల్లెలు, ఎంపు కథల ద్వారా మనం గ్రహించవచ్చు.

1943లోనే ఆయన భల్లూక స్వప్నం అనే ఒక కథ రాశారు. ఈ కథా కాలం 1939 – 45 మధ్య జరిగిన రెండో ప్రపంచ యుద్ధ కాలం. ఒక ప్లీడరు గుమస్తా కలనూ, కలలో భయాన్నీ చిత్రించిన కథ ఇది. డబ్బూ, దస్కం, కోర్టులూ, వ్యాజ్యాలూ భద్రంగా ఉన్నంత కాలం సోషలిస్టు రాజ్యం భారతదేశంలో రాలేదనే వ్యక్తి స్వార్థాన్ని వ్యంగ్యంగా విమర్శించిన కథ భల్లూక స్వప్నం.

కళింగాంధ్ర ప్రాంత జీవితాన్నీ, అక్కడి భాషా శైలుల్నీ తన కథల్లో చిత్రించి ప్రాంతీయ వాస్తవికతా వాదానికి చాసో మార్గదర్శి అయ్యారు. ప్రతి తెలుగు కథకూ స్థల కాలాల నేపథ్యం ఉంటుంది. వాటి నుంచే

------- *** -------

**అభ్యుదయోద్యమంతో సంబంధమున్న కుటుంబరావు, చాసోల కథా నిర్మాణ మార్గం మద్దుకూరి చంద్రశేఖరరావు ఆశించిన అనుభవజ్ఞుల మార్గం. తెలుగు కథా పరిణామంలో ఇది అభ్యుదయ వాస్తవికత బలంగా ఎదగడానికి తోడ్పడింది. సంస్కరణ వాస్తవికతా వాదంలో వ్యక్తి సంస్కరణ ప్రధానం. అభ్యుదయ వాస్తవికతా వాదంలో బహుముఖ సమాజాభివృద్ధి ప్రధానం.**

------- *** -------

పాత్రల ప్రాంతీయ వర్గ స్వభావాలూ, భాషా రూపొందుతాయి. పాత్రల సామాజిక సంబంధాల నుంచీ, ఘర్షణ నుంచీ ఇతివృత్తం రూపొందుతుంది. రచయిత అభ్యుదయవాది అయినప్పుడు, రచయితకు మేధాశక్తి ఉన్నప్పుడు కథ ద్వారా చెప్పే జీవిత సత్యం పాఠకులకు బోధపడుతుంది. చాసో కథా నిర్మాణంలో ఈ అంశాలు కన్పిస్తాయి. కథా నిర్మాణంలో నిగ్రహం, గడుసుదనం, ప్రగతిశీల భావాల విషయంలో చిత్తశుద్ధీ ఉండే అభ్యుదయ కథా శిల్పి చాసో.

బాల్యాన్నీ, బాల్య సమస్యల్నీ సైతం అమితమైన ఆర్ద్రతతో చాసో తమ కథల్లో చిత్రించారు.

అభ్యుదయోద్యమంతో సంబంధమున్న కుటుంబరావు, చాసోల కథా నిర్మాణ మార్గం మద్దుకూరి చంద్రశేఖరరావు ఆశించిన అనుభవజ్ఞుల మార్గం. తెలుగు కథా పరిణామంలో ఇది అభ్యుదయ వాస్తవికత బలంగా ఎదగడానికి తోడ్పడింది. సంస్కరణ వాస్తవికతా వాదంలో వ్యక్తి సంస్కరణ ప్రధానం. అభ్యుదయ వాస్తవికతా వాదంలో బహుముఖ సమాజాభివృద్ధి ప్రధానం.

తెలంగాణా సాయుధ ప్రతిఘటనోద్యమం అభ్యుదయోద్యమ కథా ప్రేరిత రచయితల్ని కదిలించింది. కాళోజీ, వట్టికోట ఆళ్వారుస్వామి, పొట్లపల్లి రామారావు, వి.ఆర్. అవధాని, తమ కథల ద్వారా అప్పటి పీడనను తెలంగాణా గడ్డ నుంచి చిత్రించారు. భావసామ్యమున్న తెలంగాణేతర ప్రాంత కథా రచయితలు తుమ్మల, తెన్నేటి సూరి, లక్ష్మీకాంతమోహన్, పి.వి. కృష్ణారావు వంటి వారు అప్పటి రాజకీయ ఉద్యమం ఆటుపోట్లనూ, ప్రజల అగచాట్లనూ, ప్రతిఘటనలనూ తమ కథల్లో చిత్రించారు. పొట్లపల్లి రామారావు జైలు కథలు, ఆళ్వారు స్వామి జైలు లోపల కథలు పేర్కొనదగినవి.

ఈ సందర్భంలో ఒక విషయం ప్రస్తావించుకోవాలి. తెలంగాణా ప్రత్యేక భౌగోళిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక, చారిత్రక సందర్భాన్ని అనుసరించి గ్రామీణ సమాజాల్లోని కల్లోలాన్ని – ప్రధానంగా నిజాం పాలనలో దొరలు పటేల్ పట్వారీలు, రజాకార్లు సృష్టించిన కల్లోలాన్ని తెలంగాణా రచయితలు చిత్రించారు. కాంచనపల్లి చినవెంకట రామారావు 1974లో నల్లగొండ జిల్లా అభ్యుదయ రచయిత సంఘం తరపున తన కథల సంపుటి "మన ఊళ్ళో కూడానా" ప్రచురించారు. ఆయన ఉద్యమాల్లో పాల్గొన్న రచయిత. తెలంగాణా పల్లెల్లో చిన్నా చితకా రైతుల మీదా, పేదల మీద జరిగే పీడనను తన కథల్లో చిత్రించారు. తెలంగాణాలోని దొరలు, జాగీర్దారులు మతాన్ని ఏ రకంగా తమ ఉనికిని స్థిరపరచుకోవడం కోసం వాడుకున్నా, ఆ మాయను సంఘటితమైన ప్రజలు ఎట్లా ఛేదించగలిగారో చిత్రించారు. 'తిరగబడిన తెలంగాణా' ఆయన కథా వస్తువు.

మరొక రకంగా భౌగోళిక స్థితిగతులు, రాజకీయ సామాజిక సాంస్కృతిక చరిత్ర ఉన్న రాయలసీమలో అభ్యుదయ కథా రచయితలు గంజి కరువునూ, కరువుల వాతబడిన గ్రామ జీవితాలనూ, గ్రామీణ పరివర్తనలోని విషాదాన్నీ, సంక్షోభాన్నీ చిత్రించి ప్రభుత్వాల చర్యల్ని నిరసించారు.

కళింగాంధ్ర జీవిత చిత్రణ చాసో కథల ద్వారా తెలిసిందే. ఈ మూడు ప్రాంతాల కంటే గోదావరి, కృష్ణా జలాల వల్ల, విద్యా వ్యాప్తి వల్ల, పట్టణీకరణ వల్ల అభివృద్ధి చెందిన కోస్తాంధ్ర సమస్యలు వేరు. శారద అట్టడుగు జీవితాలను స్పృశించడం అందుకే. పెద్దిబొట్ల దిగువ మధ్యతరగతి కుటుంబాల విషాదాన్ని చిత్రించడం అందుకే. అక్కడ మధ్యతరగతి జీవులు ఎక్కువగా కథా వస్తువులయ్యారు.

బొమ్మిరెడ్డి పల్లె సూర్యారావు, నార్ల చిరంజీవి, అట్లూరి పిచ్చేశ్వరరావు, అవసరాల సూర్యారావు, అనశర్మ, సెట్టి ఈశ్వరరావు, ఆవంత్స సోమసుందర్, కాంచనపల్లి చిన వెంకట రామారావు, రాచమల్లు రామచంద్రారెడ్డి, జి. రామకృష్ణ, ఉప్పల లక్ష్మణరావు, దాశరథి రంగాచార్య, శారద, మంద రామిరెడ్డి, జాతశ్రీ మా గోఖలే, పెద్దిబొట్ల సుబ్బరామయ్య, సాదుం జయరాం, వైసివి, కవనశర్మ, చాగంటి తులసి, పరిమళా సోమేశ్వర్, పరిమళా సోమేశ్వర్, సదానంద శారద, వాసిరెడ్డి సీతాదేవి, చందు సుబ్బారావు, మొదలైనవాళ్ళు అభ్యుదయోద్యమ

స్ఫూర్తితో కథలు రాసినవాళ్ళు. ఒకరిద్దరు తప్ప మిగిలిన అందరూ అభ్యుదయ రచయితల సంఘంతో సంబంధమున్న రచయితలు.

తెలుగు కథ మీద అభ్యుదయోద్యమ ప్రత్యక్ష, పరోక్ష ప్రభావాలను సమీక్షించడంలో జరగవలసినంత కృషి జరగలేదు అని ఈ సందర్భంలో మనం గుర్తు చేసుకోవాలి. ఆంధ్రప్రదేశ్‌లోని నాలుగు ప్రాంతాల అంటే తెలంగాణా, రాయలసీమ, కోస్తాంధ్ర, కళింగాంధ్ర, ప్రాంతాల నుంచి గడచిన ఏడారు దశాబ్దాల్లో కనీసం మూడువేల మంది కథా రచయితలు కన్పిస్తారు. అయిదు తరాల రచయితలు వీళ్లు. నిన్న మొన్నటి దాకా తెలుగు కవిత్వంలో అభ్యుదయ విప్లవాలను విమర్శకులు విపులంగానే పరామర్శించారు. వచన ప్రక్రియల్లో ప్రధానంగా కథ విషయంలో ఈ పరామర్శ అతి తక్కువగా జరిగింది.

తెలంగాణా తొలి తరం కథలు, కళింగాంధ్ర కథలు, సీమకథలు వంటి సంకలనాలు, విప్లవ రచయితల సంఘం, జనసాహితి సంస్థలు ఏర్పడ్డాక వెలువడిన కథా సంకలనాలు మహిళోద్యమం, దళితోద్యమంలో భాగంగా వెలువడిన సంపుటాలు, జిల్లా రచయితల సంకలనాలూ, వివిధ వామపక్ష పత్రికల్లో వచ్చిన కథలు, సంకలనాలు, మైనారిటీ కథకుల కథా సంకలనాలూ, సంపుటాల్ని నిశితంగా పరిశీలిస్తే తప్ప అభ్యుదయోద్యమ విజయగాథను అర్థం చేసుకోలేము. ఈ సంకలనాల్లో, సంపుటాల్లో, పత్రికల్లో కనిపించే రచయితలందరూ అభ్యుదయోద్యమంలో ప్రత్యక్ష భాగస్వాములు అయి ఉండవచ్చు. కాకపోయీ ఉండవచ్చు. ఇప్పుడు మనం చేయగలిగింది స్థూలంగా పరిశీలించడం మాత్రమే. స్థూలమైన అవగాహనకు రావడం మాత్రమే. ఒక్కటి మాత్రం నిజం. తెలుగు మాట్లాడే నాలుగు ప్రాంతాల నుంచీ వెలువడిన తెలుగు కథల్లో అభ్యుదయోద్యమం సామాజిక చలన సూత్రాల పరిజ్ఞానాన్ని పెంచింది. సమాజ పరివర్తన అవగాహనను పెంచింది. స్థానీయ, ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ స్థితిగతుల అనుభవ స్పృహను పెంచింది. సమాజంలోని సకల వివక్షల, పీడనల గుర్తింపు చైతన్యాన్ని ఇచ్చింది. కథలో ఉపయోగించే భాషా శైలులు, భాషా భేదాల విషయంలో ప్రజాస్వామిక దృష్టిని పెంచింది.

ప్రస్తుతం అభ్యుదయోద్యమం ముందు సవాళ్ళు లేకపోలేదు.

తెలుగు గ్రామీణ ప్రాంతాల్లో హరిత విప్లవం వాణిజ్య పంటల వైపు దూసుకువెళ్ళింది. పర్యావరణ సమస్యలు తలెత్తాయి. సరళీకరణ, ప్రపంచీకరణ ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు అన్ని రంగాల్లో మానవాభివృద్ధి సూచిను ఆశించిన మేరకు పెంచలేకపోయాయి. తెలుగు కథా పరిణామంలో ఈ దశ క్లిష్టమైంది. ఈ క్లిష్టత ఎందుకేర్పడిందో తెలుసుకుందాం.

**తెలుగులో ఉద్యమ ప్రభావాలున్న కథల మీద ఆరోపణలు కూడా లేకపోలేదు. మూసపోసినట్లుండే వస్తువు, పాత్ర చిత్రణ, ఘర్షణ, ఇతర కథా నిర్మాణాంశాలూ తెలుగు కథ కళా నియమాల్నీ, విలువల్నీ ధ్వంసం చేశాయనే ఆరోపణ ఉంది. ప్రయోగ శూన్యత ఉందనే ఆరోపణ ఉంది. అస్తిత్వ విచికిత్సను రేకెత్తించే కథేతి వృత్తాలు, కథాంశాలు లేవనే ఆరోపణ ఉంది.**

మొదటిది ప్రసార మాధ్యమాల కార్పొరేటీకరణ వల్ల మేధో విరుద్ధ ధోరణుల ప్రభావం తెలుగు కథ మీద పడింది. రెండవది నేరస్థ రాజకీయాల విజృంభణ, హింసావాదం, వ్యక్తివాదం, వ్యక్తి పూజా విధానాలు, అప్రజాస్వామిక విలువలను పెంచి పోషిస్తున్నాయి. మూడవది సాంస్కృతిక సంక్షోభం. నాల్గవది గ్రామీణ వ్యవసాయ రంగం మట్టి గొట్టుకొని పోవడం. దీనిలో రైతులు, రైతు కూలీల, వృత్తి జీవుల వలసలు, చెదిరిపోయిన ప్రజల సమస్యలు. అయిదవది వృద్ధాప్య సమస్యలు. ఆరవది పట్టణీకరణ, నగరీకరణ, పరిశ్రమలు వీటి వల్ల మానవ సంబంధాల్లో వచ్చిన – అభివృద్ధి పేరిట వచ్చిన – సమస్యలు.

ఇప్పటి తెలుగు కథ చిత్రించడానికి ప్రయత్నిస్తున్న సమస్యలు ఇవి :

తెలుగులో ఉద్యమ ప్రభావాలున్న కథల మీద ఆరోపణలు కూడా లేకపోలేదు. మూసపోసినట్లుండే వస్తువు, పాత్ర చిత్రణ, ఘర్షణ, ఇతర కథా నిర్మాణాంశాలూ తెలుగు కథ కళా నియమాల్నీ, విలువల్నీ ధ్వంసం చేశాయనే ఆరోపణ ఉంది. ప్రయోగ శూన్యత ఉందనే ఆరోపణ ఉంది. అస్తిత్వ విచికిత్సను రేకెత్తించే కథేతి వృత్తాలు, కథాంశాలు లేవనే ఆరోపణ ఉంది. యాభై, అరవై దశకాల్లో మొత్తం కవిత్వాన్ని, అభ్యుదయ కవిత్వాన్ని, ఆకలి కవిత్వం అన్నట్లే ఈ కథలు ఆకలి కథలు అనే ఆరోపణ లేకపోలేదు. అభ్యుదయోద్యమంలోని ప్రథమోద్రేకాల వల్ల, రచనోత్సాహం వల్ల, అధ్యయన లోపం వల్లా, మూసకథల సృష్టి జరిగింది. కొడవటిగంటి కుటుంబరావు, చాసో వంటి అభ్యుదయ కథా రచయితల వారసత్వాన్నీ, ఇతర ఉత్తమ ప్రజాస్వామిక రచయితలు వస్తు రూపాలలో కనబరచిన శ్రద్ధనూ, కొత్త అంశాలనూ నిశితంగా పరిశీలించకపోవడం వల్లా మూస కథలు వచ్చాయి. తెలుగులోని ఉత్తమ కథకుల భాషా ప్రయోగ నైపుణ్యం మీద దృష్టి ఉంచడం కంటే, ఆధునిక వచన సంస్కారం మీద శ్రద్ధ వహించడం కంటే, అభ్యుదయ కవిత్వాలాలసత్వం వల్ల మూసకథలు వచ్చాయి.

అభ్యుదయోద్యమ ప్రభావంలో వెలువడిన తెలుగు కథా సాహిత్యంలోని ప్రముఖ లక్షణాలను చివరగా చెప్పుకుందాం. అవి ఏమిటంటే...

తెలుగు కథా రచయితలు ఆర్థికానికీ సామాజిక పరిణామాలకూ వెనుక ఉండే గతిశీల లక్షణాలను గుర్తించడం.

పరాయీకరణ ఎందుకు, ఎట్లా, ఎప్పుడు వ్యక్తి చేతనలో ప్రవేశిస్తుందో గుర్తించడం.

వర్గ స్వభావాలు ఏర్పడే తీరును విశ్లేషించగలగడం.

పీడిత పక్షాల పట్ల సహానుభూతి కలిగి ఉండటం.

ఇందువల్లనే కుటుంబరావు అన్నది : 'మార్క్సిజం అర్థం కానివాడు జీవితాన్ని అర్థం చేసుకోలేడు' అని ఆయనే మరొక మాట కూడా అన్నారు. కథా రచయితలకు జీవితం ప్రమాణం అని ఆయన ఉద్దేశించిన జీవితం భౌతిక జీవితం, వాస్తవ జీవితం.

"జీవితాన్ని గురించి లక్ష సత్యాలు తెలుసుకొని ఏం లాభం? ఒక చిన్న సత్యానికి అనుగుణంగా జీవితాన్ని మార్చే శక్తి లేనప్పుడు? సంస్కారం విప్లవాత్మకమైంది, ఉత్త జ్ఞానం చాలదు'' అని కుటుంబరావు మారిన జీవితంలోని కథకుడు అంటాడు. అభ్యుదయోద్యమం తెలుగు కథకు ఇచ్చిన సంస్కారం జీవితాన్ని విశ్లేషించే శక్తి, మార్చే శక్తి, తెలుగు కథా రచయితలకు ఇచ్చిన ప్రజాస్వామిక స్ఫూర్తి సత్యాలను తెలుపకపోయినా, అసత్యాలను చలం లాగా ఖండించగలగడం.

ఒక్క మాటలో చెప్పాలంటే, అభ్యుదయోద్యమమే లేకపోయి ఉంటే గురజాడ, శ్రీపాద, చలం, కరుణకుమార, గోపీచంద్ వంటి కథా రచయితల భావధారల అణచివేత జరిగేది. రావిశాస్త్రి, కాళీపట్నం వంటి కథకులూ గడచిన రెండు తరాల కథకులూ తమ ప్రగతిశీల సంస్కారాన్ని ముందుకు తీసుకువెళ్ళగలిగిన పరిస్థితులు ఉండేవి కావు.

*

# సమీక్షా పర్వం

* అగ్ని కవితల "స్పర్శ"
* శిలాలోహిత "డిఫరెంట్"
* మట్టివాసనల "ఎండమావి"
* పరివేదనకు "పర్యాయపదం"
* జాజులగౌరి కథలు "మన్నుబువ్వ"
* సీమ పేదల బాధాగీతి "మెరవణి"
* కొత్త ఆలోచనల్ని రేకెత్తించే కథలు "నెలపొడుపు"
* ఒక సామూహిక దుఃఖానికి "దాఖలా"
* చిక్కటి కవిత్వం నుండి "పారిపోలేం"
* విద్యా వ్యవస్థ తీరుతెన్నులకి "బడి కథలు"
* లస్కర్ జీవితాల మిర్రర్ "లొల్లి"

జి.ఎస్.




## అగ్ని కవితల "స్పర్శ"

సమకాలీన సమస్యల్ని తన అగ్ని శిఖల్లాంటి కవితల్తో నిలువునా దహిస్తూ, చైతన్యరహితమైన మన మెదళ్ళను ఆ మంటల వెలుగుతోనూ, వేడితోనూ స్పర్శించి, రగిలించి, మేల్కొల్పడానికి చేసిన ప్రయత్నమే బండ్ల మాధవరావు "స్పర్శ" కవితా సంపుటి. ఇందులోని ప్రతి కవిత, నిత్యం మన చుట్టూ జరుగుతున్న అనేకానేక సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక దురాగతాలను నిస్సంకోచంగా నిలదీసి దులిపేస్తుంది. అర్థంపర్థంలేని ఆర్థిక వ్యామోహాలతో ఎటో వెళ్ళిపోతున్న ఆధునిక జీవితాల్ని ఆపి, మనం ఎక్కడ దారితప్పుతున్నామో స్పష్టంగా చూపించే ప్రయత్నం చేస్తాడు కవి.

ఈ సంపుటిలోని మొదటి కవితే టి.వి. ఛానళ్ళపైన, అవి ప్రసారం చేస్తున్న పచ్చి బూతు దృశ్యాలపైన దాడి చేస్తూ, "విశ్వ విజ్ఞానానికి కవాటాలు తెరవాల్సిన / మనిషి మెదడు / ఒకే ఒక్క అంగంలోకి కుదించుకుపోయింది" అంటూ తీవ్రంగా నిరసిస్తుంది. అంతటితో ఆగక, "విశృంఖలత్వం రంగుల పతాకాల నక్షత్రాల నుంచి / సరాసరి ఇంట్లోకి ప్రసరించి / లేత సున్నిత హృదయాలను సైతం ధ్వంసం చేస్తోంది" అంటూ చెబుతున్నప్పుడు ఇటీవల ఓ తెలుగు టి.వి. ఛానల్ ప్రకటన మనకు గుర్తుకొస్తుంది.

సామ్రాజ్యవాదుల మధ్య పోటీ తీవ్రమై, "ఒకే ఒక్క గుప్పిట భూమినంతటినీ ఇరికించుకోవాలని" చూసినప్పుడు, "జీవ చైతన్యం నిషేధిత"మవుతున్నప్పుడు మోసులెత్తే మొలకలపై కూడా ఆంక్షల వేటు పడుతున్నప్పుడు; "ఒకరు ఒకరు మరొకరు ఉద్యమాలలో కొందరు కొందరు అందరూ ఆయుధాల్తో" ఎదురు తిరిగే తప్పనిసరి పరిస్థితులు తప్పవని కవి ఆవేశంగా హెచ్చరిస్తాడు. ఇదే సామ్రాజ్యవాదం తన ప్రపంచీకరణ, వేర్పాటువాదం లాంటి మెత్తని కత్తులతో ఎలా మన జీవితాల్ని బలిగొంటుందో వర్ణిస్తూ "ఏడవండి నా తమ్ముళ్ళారా ఏడవండి / దేశదేశాంతరాల్లోని పల్లెల చెవులు / చిల్లులు పడేలా ఏడవండి" ఇక్కడ నరమేధం జరుగుతోంది" అని చెబుతూ "రండి నా తమ్ముళ్ళారా రండి / వేల వేల చేతుల్ని కలిపి పేనుకొని ఉరితాళ్ళై రండి / తెగిపడ్డ దేహాల్ని బిగించిన / దప్పుల చప్పుళ్ళలోంచే ఒక సరికొత్త వరసను సృష్టించాలి / ఖండితావయవాల్ని కలిపి నేసిన పతాకాన్ని ఎగరవేయాలి" అంటూ ఆవేశంగా మనల్ని కమ్ముకొంటాడు కవి (పుట 14). హద్దుమీరిపోతున్న సైబర్ సంస్కృతిని "సంధ్యార్ణవాలు" అనే కవితలో ఎండగడతాడు.

దేశం మొత్తాన్ని అట్టుడికించిన గుజరాత్ మారణహోమంపై కవి "భుజాన ఉన్న శవపేటికలు / క్షణక్షణానికి బరువెక్కుతుంటాయి / లాలూచీ పడ్డ శవవాహకులు / నిన్ను శ్మశానానికి తీసుకెళ్ళకుండా / నడిరోడ్డులోనే సమాధి చేస్తారు" అంటాడు తీవ్ర స్వరంతో (పుట 41). ఆంధ్రా జలియన్ వాలాబాగ్‌లాంటి బషీర్‌బాగ్ దురాగతాన్ని స్మరించుకుంటూ, దానికి ప్రతీకారంగా ప్రజలు కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ ఇచ్చిన ప్రజాస్వామిక తీర్పును సమర్థిస్తూ కవి "ఆత్మలు శాంతిస్తున్నాయి / బషీర్‌బాగ్ కూడలిలో / ఇనుప కంచలకు వేళ్ళాడిన దేహాల్లోని ఆత్మలు / ఆనందంతో వేడుకలు జరుపుకొంటున్నాయి" అంటూ... వాడు అక్కడే అలాగే / గడ్డంలోని వెంట్రుకల్ని లెక్కబెట్టుకొంటూ / బిత్తర చూపులు చూస్తూ / మళ్ళీ వ్యూహాన్ని ప్రారంభిస్తాడు / ఎలాంటి యుద్ధ వ్యూహమైనా / అంతిమ విజయం నీదే కావాలి....' (పుట 76) అంటూ ప్రజలకు భరోసా ఇస్తాడు.

కవితా సంపుటి నిండా ఇలాంటి అనేక సమకాలీన సజీవ సమస్యల మీద కవి స్పందించిన తీరు పాఠకుల్ని ఆకట్టుకుంటుంది. పుస్తకంలోని 40 కవితల్లోనూ పదాడంబరంగాని, అస్పష్టత లేకుండా స్పష్టంగా, సరళంగా సాగి పోతాయి. ప్రతి కవితా పాఠకుణ్ణి స్పర్శించి, స్పందింపచేస్తుంది. సామాజిక సమస్యలను గూర్చి ఆలోచింపచేస్తుంది. సమాజం పట్ల నిబద్ధత గల్గిన వారంతా కొని చదవదగ్గ పుస్తకం "స్పర్శ" కవితా సంపుటి.

**పుస్తకం పేరు : స్పర్శ (కవితా సంపుటి)**
**రచయిత : బండ్ల మాధవరావు**
**పేజీలు : 80 వెల : రూ. 30**
**ప్రతులకు : నవోదయ పబ్లిషర్స్, కార్ల్‌మార్క్స్ రోడ్, విజయవాడ-2. ఫోన్ : 0866 - 2573500**

బి. లలితానంద ప్రసాద్




# మట్టివాసనల 'ఎండమావి'

'కథ మాత్రమే చెప్పాలి. సూటిగా చెప్పాలి' అన్న కొ.కు. మాటల్ని తూ.చా. పాటించారనిపిస్తుంది. యెన్నం ఉపేందర్ 'ఎండమావి' కథలు చదివితే పాత్రలు, ఇతివృత్తం, సంభాషణలు అన్నింటా కుప్తత పాటించారు.

ఏ సాహిత్య ప్రక్రియకైనా చదివించే గుణం ముఖ్యావసరం. ఈ లక్షణం ఉండటం వలన వలు కథలు త్వరగా ముగిశాయనిపిస్తాయి. నిడివి పెరిగిన ఎండమావి, గ్లోబల్ ఉప్పెన, గ్లోబల్ నగరం, మరో ముఖం, నిర్ణయం లాంటివి మినహాయింపు.

ఆ రైతు మాల్గుడి, శంకరమంచి అమరావతి కథల్లా రచయిత చెప్పినట్లు మా కథలన్నీ నల్గొండజిల్లా, తుంగతుర్తి మండలంలోని 'గుమ్మడవెల్లి' గ్రామ పరిసరాల్లో పరిభ్రమించినవే. అక్కడక్కడా గగనంలో విహరించినా తిరిగి తిరిగి నేలూనుతాయి. అయితే వారిలా సమగ్రత, శైలి నిశితం, విస్తృతి దిశగా పయనించాల్సుంది.

రావిశాస్త్రి, దాశరథిల్లా సంభాషణల్లో మాండలికం ఎక్కడా పాఠకునికి ఇబ్బంది కలిగించదు. పైగా సహజత్వానికి దగ్గరగా తీసుకెళ్తుంది. కొందరిలా పూర్తి సంభాషణ, మరికొందరిలా పూర్తి వివరణ, వర్ణనల కథనంగాక సమతూకం పాటించడం వీటి ప్రతీక.

ఆయా కథల్లో వస్తు వైవిధ్యం, ఆశావహ దృక్పథం, స్త్రీ వివక్ష పట్ల ఆర్ద్రత, మూర్తీభవించిన మానవత్వం ఉన్నాయి. ప్రపంచీకరణలాంటి అంశాలపై ఇరు పార్శ్వాలూ స్పృశించారు. అన్నింటా ఆపన్నుల పట్ల ఆర్తి వుంది. 'చిరుగు వస్త్రం'లో రైతు - వలస కూలీగా మారే క్రమం ఆవిష్కరించారు. అట్లాగే పరిణామ క్రమంలో మారుతున్న మానవ సంబంధాల్నీ, విలువల్నీ ఆక్షరీకరించారు. 'నిర్ణయం'లో కట్న కానుకల విషయాల్లో మానవ నైజం సమాజం పోకడలకు అద్దం పట్టారు. 'సైనికులు'లో బొగ్గుగని కార్మికుల దుర్మరణ వాస్తవాన్ని హృదయవిదారకంగా వర్ణించారు. 'స్మైలాల్'లో మనిషి ద్వంద్వ ప్రవృత్తుల్ని బహిర్గతం చేశారు.

శీర్షికలననేకం కథల చివరి పేరా / వాక్యంలో మాటలుంచడం గమనార్హం. రచయిత కవి కూడా కావడం ఇందుకు కారణం కావచ్చు. మొత్తం 32లో పలు కథల్లో పాత్రలు ద్వంద్వాల్లో పూర్తిగా ఏదో ప్రక్క కోపుగాసినట్లుంటాయి. వాస్తవం మూసకతీతం. మనిషి రెండింటి సమ్మేళనం, తేడా దామాషాలోనే. ఈ దిశగా దృష్టి మరలిస్తే వీరి నుండి మంచి కథల్ని ఆశించవచ్చు.

తెలంగాణా మట్టి వాసనలు అనుభూతించాలంటే తప్పక చదవాలి యెన్నవి ఉపేందర్ 'ఎండమావి' కథలు.

**(పుస్తకం పేరు : ఎండమావి, రచయిత : యెన్నవి ఉపేందర్, వెల : 60 రూపాయలు, పేజీలు : 192, ప్రతులకు : విశాలాంధ్ర, 'ప్రజాశక్తి' అన్ని బ్రాంచీలు. నవోదయ - హైదరాబాద్)**

---

# శిలాలోహిత "డిఫరెంట్"




డాక్టర్ ద్వా.నా.శాస్త్రి

"నా చుట్టూ ఉన్న కోట్లాది స్త్రీల సమస్యలూ, పెనుగులాట ఒకటే కావడం - 'నేను'ను శోధించుకుంటూ ఏకాంత సంగీతాన్ని వినిపించేదే నా కవిత్వం. నా కవిత్వమొక నిరాడంబరపు నిశ్శబ్దపు చప్పుడు. సామాజిక సమస్యల్ని చాలా పర్సనల్‌గా వినిపించడం నా కవిత్వంలో చూడవచ్చు. నేను కవిత్వంలో నిరాడంబరతను ప్రేమిస్తాను."

- ఇవి కవయిత్రి మాటలు. ఇలా తన లక్ష్యాలను, రచనా పద్ధతిని కవి చెప్పుకోవడం నన్నయ నుంచి ఉన్నదే. పాఠకుడు లేదా విమర్శకుడు పక్కదారులు తొక్కకుండా ఉండటం కోసం, కవిత్వాన్ని అవగాహన చేసుకోవడం కోసం ఈ మాత్రం వివరణ అవసరమే. అంటే కవిత్వానికి దిశా నిర్దేశం అన్నమాట.

డాక్టర్ పి. లక్ష్మి 'శిలాలోహిత' అనే కలం పేరుతో రాసిన "ఎంతెంత దూరం" అనే కవితా సంపుటిని పై మాటలు ఆధారంగా, ఆ నేపథ్యంతో పరిశీలించాలి. అప్పుడు కవయిత్రి అంతరంగం తెలుస్తుంది. ఈమె కవితలన్నీ చదివితే - ఈ అభిప్రాయాలు ఏర్పడతాయి.

ఈమెది స్త్రీ వాదమే కానీ - పురుష ద్వేష స్త్రీ వాదం కాదు.

ఈమెది స్త్రీ వాదమే కానీ - తాత్త్వికపరమైన స్త్రీ వాదం.

ఈమెది స్త్రీ వాదమే కానీ - మనిషితనానికి ప్రాముఖ్యమిచ్చే స్త్రీ వాద కవయిత్రి

ఈమెది స్త్రీ వాదమే కానీ - ఆ చట్రంలోనే ఇమిడి పోకుండా అనేకానేక అన్యాయాలకు స్పందిస్తుంది.

ఈమెది స్త్రీ వాదమే కానీ - జీవిత మూలాలను, కుటుంబ బంధాలను మర్చిపోని స్త్రీవాద కవయిత్రి.

ఇంకా శిలాలోహిత కవిత్వంలో 'నిరాడంబరత' వుంటుంది. కానీ అది భావ తీవ్రతతో కూడుకొని వుంటుంది. ఎన్. గోపి, దర్భాశయనం, అద్దేపల్లి వంటి వారి కవిత్వంలోనూ ఇదే గమనిస్తాం. సాదాసీదాగా చెప్పినట్లుగా వుండే శైలి - భావానుగుణమైన శైలి - వస్తుపరమైన శైలి, కొందరి కవుల ప్రత్యేకత. ఏది శిల్పం? అన్నప్పుడు - అదెప్పుడూ చర్చనీయాంశమే. శిల్పం మీద దృష్టి ఎక్కువైతే వస్తువు పలచబడటమో - అస్పష్టంగా మారడమో (మోలాంటి కవుల్లాగా) జరుగుతుంది.

శిలాలోహిత కవిత్వం సమకాలీన కవిత్వం. ఇవాళ చాలా మంది ఇలాగే రాస్తున్నారు. ప్రతి కవీ, కవయిత్రీ తన సొంత ముద్రలోనే రాస్తున్నారు. శిలాలోహిత కూడా డిఫరెంట్ శైలిలో, డిఫరెంట్ వస్తువుతో, డిఫరెంట్ ఆలోచనలతో రాయడం గమనిస్తాం. అందుకే నేటి కవయిత్రులలో – ముఖ్యంగా స్త్రీవాద కవయిత్రులలో "డిఫరెంట్ వాయిస్' ఈమెది అనాలనిపిస్తుంది.

"మాదైన భాష కోసం తపించాం
నాలుగ్గోడల మధ్యకు విసిరితే
దేహాత్మలేని వాళ్ళలా లోపల్లోపలే దుఃఖించాం
ఎప్పటికీ వీడని కప్పెట్టిన
మేలి ముసుగుల మధ్యన జీవచ్ఛవాలమయ్యాం"

అనడంలో ముస్లిం స్త్రీల దుస్థితినీ ప్రకటించడం గమనిస్తాం. ఈ ధైర్యం కొంతమంది స్త్రీవాద కవయిత్రుల్లో చూడం. అందుకే ఈమె "డిఫరెంట్" అనడం.

"మనుషుల్ని ఉప్పుమడిలో నీటిని నిలిపినట్లుగా
తరిమి తరిమి నిప్పుల ఉప్పు కయ్యల్లోకి తోసి"

అంటూ గుజరాత్ బాధితులపై రాసిన కవితా శైలి – అభివ్యక్తి శిల్పం హృదయాన్ని కదిలిస్తుంది. "అలవోకలు" అనే కవితా ఖచ్చితంగా "డిఫరెంట్" స్త్రీ, కన్నీరు, చెట్టు, ఆమె, విత్తనం, వెన్నెల... ఇలా ప్రతి దానికీ కవితాపరంగా నిర్వచనమిచ్చారు. మరో చూపు కలిగించారు.

"ఇన్నాళ్ళూ
నడక నేర్పిన నాన్న నడక మర్చిపోయారు
చూపునిచ్చిన నాన్న చూడలేకపోతున్నారు
మాట నేర్పిన నాన్న మాట్లాడలేకపోతున్నారు
శరీరమిచ్చిన నాన్న స్పృహను కోల్పోతున్నారు
పోరాటం నేర్పిన నాన్న నిశ్శబ్ద చిత్రమవుతున్నారు"

అంటూ నాన్నపై కవిత్వం రాయడం డిఫరెంట్! నాకు తెలిసినంతవరకు నాన్నపై రాసిన తొలి కవయిత్రి శిలాలోహిత అనుకుంటాను.

"అది గుడిసైనా, మేడైనా, మిద్దెయినా
రూపమేదైనా నడక ఒక్కటే
ఇల్లంతా అనేక వేల కిలోమీటర్లు కలియ తిరిగే నడక"

అంటూ 'ఇల్లు'ను గురించి చెప్పినప్పుడు ఆలోచనలూ భిన్నం – శైలి భిన్నమే.

"ఇద్దరూ ఒక్కటై నిలిచి, పనులు బాధ్యతలు
ఆడ, మగరేఖల్ని చెరిపేసే రోజు – మనముందే వుంది"

అనడం ఇప్పుడు అవసరం.

"అన్నా తమ్ముళ్ళు నన్నో ఆపదలా చూస్తుంటారు"
"సర్రున కోసేస్తూ గాయాలనృత్యం"
"బాల్యం – దాచేసిన భూతద్దం"
"శరీరపు ఆల్చిప్పలో దాచుకొనే ముత్యమాతడు"

– ఇటువంటి కొత్త అభివ్యక్తులు చాలా వున్నాయి. కానీ శిలాలోహిత

"సూర్యుడికి అరచేతిని పట్టి ఆపేదెవ్వరు"
"రాజకీయాల రాబందుల"

వంటి "పాతపద్ధ" వాటిని వదిలించుకోవాలి. వ్యక్తిగత అనుభవాల్ని, ఆత్మీయుల్లా సామాజిక పరం చేయడంలో ఇంకాస్త శ్రద్ధ వహించాలి. కవిత్వానికి "సంక్షిప్తత" ప్రాణం. కొన్ని కవితల్లో సంక్షిప్తత అవసరమనిపిస్తుంది. గుజరాత్ పై రాసిన కవితని సంక్షిప్తంగా రాయమనలేం. 'సంగమం' వంటి కవితను సంక్షిప్తం చేయవలసి వుంది. "పాఠక ప్రతి క్రియ" పేరుతో తన కవిత్వాన్ని సమీక్షించిన వారి వ్యాసాలు అన్నిటినీ ప్రచురించడం అవసరమా – అనిపిస్తుంది. ఇవన్నీ ప్రశంసా సమీక్షలే గదా! ఏమైనా నేటి కవయిత్రుల్లో శిలాలోహితది విలక్షణ స్వరం – లోకానుశీలనం విశిష్టం – అభివ్యక్తి విభిన్నం అని ఈ కవితా సంపుటి ప్రకటిస్తుంది. కవిత్వాన్ని చదివేవారు అదృష్టవంతులైతే చాలామందిని అదృష్టవంతుల్ని చేసే సంపుటి ఇది.

**(ఎంతెంత దూరం (కవితా సంపుటి),**
**కవయిత్రి – శిలాలోహిత,**
**వెల రూ. 60.**
**ప్రతులకు – ప్రజాశక్తి, విశాలాంధ్ర,**
**దిశ పుస్తక కేంద్రం, హైదరాబాద్)**

---

*గేరా*




# పరివేదనకు "పర్యాయ పదం"

తాను పుట్టి పెరిగిన పల్లెటూరు, ఎన్నో తరాలుగా చెక్కు చెదరని దాని అనుబంధ జీవితాలు, కుల వృత్తులు, విలువలు, వాటితో ముడిపడిన ఓ అద్భుత సౌందర్యం అన్నీ తన కళ్ళ ముందే ధ్వంసమైపోతుంటే, ఆ విధ్వంసం మొత్తంగా తన అస్తిత్వాన్నే ప్రశ్నిస్తుంటే, గాయపడిన తన హృదయ పరివేదనకు పర్యాయ పదాలుగా వెలువరించిన కవితల సమాహారమే బాణాల శ్రీనివాసరావు "పర్యాయపదం" కవితా సంపుటి.

ఆధునిక ప్రపంచం అందించిన గ్లోబలైజేషన్, సామ్రాజ్యవాదం, విశృంఖల సమాచార సాంకేతిక విప్లవం వంటి రుగ్మతలతో ఒక్కసారిగా ఉక్కిరిబిక్కిరైన సమాజంలో నుండి బయటపడే మార్గాన్ని అన్వేషించడానికి బదులు, కవి క్షతగాత్రమైన తన గతకాలపు వైభవాల్ని నెమరేసుకొంటూ ఆవేదనతో పలవరిస్తాడు. ఇందులో మొదటగా తనకు జన్మనిచ్చిన తల్లిని గూర్చిన జ్ఞాపకాల్ని తడుముకొంటూ, "అన్నమయ్య పాటల్ని / గోరుముద్దలుగా తినిపించిన / నీ మునివేళ్ళ కమ్మతనం / జీవితాంతం మర్చిపోలేని నా జీవకణాలు" అంటూ ఆర్ద్రంగా కలవరిస్తాడు చివరగా...

"ఎంత రాసినా పూర్తికాని కావ్యం
అమ్మంటే అనంతం'' అంటూ అమ్మకు సరికొత్త నిర్వచనమిస్తాడు.

గ్లోబల్ కత్తులు వాళ్ళ చేతి వేళ్ళను నరికేశాక, పంట భూములన్నీ ప్లాట్లుగా మారిపోయాక, నిండు పున్నమిలాంటి వాళ్ళ ఊరు నెలవంకలాగాను, గలగలపారేటి ఊరు ఎండిన చెరువులాగాను ఎలా మారిపోయిందో "నెలవంక" అన్న కవితలో ఆవేదనతో అభివ్యక్తీకరిస్తాడు.

కేవలం భౌతిక విధ్వంసాన్నే కాకుండా, మృగ్యమైపోతున్న

మానవ సంబంధాలను, వినాశనమైపోతున్న వ్యక్తిత్వాలను కవి నిర్మొహమాటంగా వ్యతిరేకిస్తూ...

"స్పందనలన్నీ ఇంకిపోయి, అనుభూతి అనుభవాలన్నీ మనస్సు పొరల్లో ఎక్కడో బిక్కు బిక్కుమనుకొంటూ, అస్తిత్వాన్నెప్పుడో కోల్పోయి, మనిషి లక్షణాల్ని రాల్చుకొని, కృత్రిమంగా మెలుస్తూ, ఇజాలనన్నీ భద్రంగా జేబుల్లో దాచుకొని, హ్యూమనిజాన్ని ఎక్కడో పారేసుకొంటూ, రాతియుగంలోంచి మళ్ళీ రాతియుగంలోకి...." మనుషులెలా పయనిస్తున్నారో వర్ణిస్తాడు.

ఇక నిర్మాణపరంగా చూసినపుడు ఈ కవితా సంపుటిలో, కొన్ని కవితలు వచన కవితా రూపంలో అంటే పంక్తులుగా కనపడితే, మరికొన్ని శుద్ధవచనంలాగా పేరాల రూపంలో ఉండటం గమనార్హం! "ఎండమావుల ఒయాసిస్" అనే కవితలో మనకు హైకూ, నానీల నిర్మాణం కనపడుతుంది. "చలికి బాగా చలిపెట్టి చలి కాచుకుంటున్న దృశ్యం / తీరని దాహంతో సముద్రం" వంటి వాక్యాల్లో మనకు సర్రియలిస్టిక్ ధోరణులు కనపడతాయి. అలాగే "మరణించడమంటే జీవించడమే / జీవించడమంటే మరణించడమే" వంటి వాక్యాలలోని కవి నిర్దేశిత తాత్వికత ఏమిటో పాఠకులకు అర్థం కావడం కష్టమే అనిపిస్తుంది.

"మాటే మనిషికి ప్రాణం / మాట్లాడేవాడే మనిషి / మాట్లాడుతాను మనిషిగా" అంటున్న ఈ కవే మళ్ళీ.

"మట్టిలోకి దూసుకుపోతూ... / మా గాయాల పాటల్ని / మీ చెవుల్లోకి ఒంపుతాను / కొత్త దారుల్లోకి సాగిపోతూ / బకెట్ల కొద్దీ బాధల్ని చేది / మీ దోసిళ్ళు నింపుతాను" అంటూ అసంతృప్తి, ఆవేదనలతో నిండిన వాక్యాల్ని కాకుండా "రాలిపడుతున్న కన్నెప్పల మీద / జారిపడుతున్న చీకటి పర్వతాలు / వెలుగు సమ్మెటల్తో / పగలగొడ్తూ నేను" వంటి ఆత్మవిశ్వాసాన్నిచ్చే మాటలనిన "తీరమెప్పటికీ ఒంటరి కాదు / పాటల కిరణాల్తో / సముద్రాన్ని తడుపుతూ / గాలి కెరటాల్తో / సందేశాన్ని పంపుతూ / వెన్నెల విహంగం!" వంటి ఆశా దృక్పథ భాష మాట్లాడితే మరింత మంచి కవిత్వాన్ని మనకందిస్తారనడంలో సందేహం ఏమాత్రం లేదు.

**పర్యాయపదం**
**బాణాల శ్రీనివాసరావు**
**పేజీలు : 125**
**వెల : రూ. 50/-**
**ప్రతులకు : విశాలాంధ్ర, నవోదయ, ప్రజాశక్తి, దిశ పుస్తక కేంద్రం, తెలుగు బుక్‌హౌస్**

---

**బి.ఎస్. రాములు**

# జాజులగౌరి కథలు "మన్నుబువ్వ"




ఆకలి ఏ జీవికైనా ఒకటే. అది తీరే మార్గాలు వేరు. కాని మన్ను కూడా ఆకలి తీర్చుతుందనే సత్యమే మన్ను బువ్వ కథలు. అదీ నిజమేననీ ఇటీవల ఆంధ్రజ్యోతి దినపత్రిక (4-5-05) నిరూపించింది. ఇటువంటి నగ్నసత్యాలెన్నో ఈ కథల్లో వున్నాయి. ఆకలి, పేదరికం, చదువు ఈ కథల్లో ముఖ్యపాత్ర వహించాయి. తన చుట్టు వున్న సమాజాన్ని స్వయంగా పరిశీలించి, పరిశోధించి, అనుభవించిన ప్రతి చిన్న విషయం కథా రూపంలో మలచబడింది. ఆకలి, పేదరికం తరువాత చదువుకు ప్రాముఖ్యతనిచ్చి చదువుతోనే గుర్తింపు పొందగలమనే విశ్వాసం "నేన్ నేన్ లెక్కనే' రుజువవుతుంది. కులమనే విష బీజాలు పసి హృదయాల్లో ఎలా నాటుతుందనేది గుండం కథలోను, ఈ పూటకి ఆకలి తీర్చే దేవాలయాలు ఉప్మా బదులు, విద్యావ్యాప్తికి ప్రభుత్వం ప్రవేశపెట్టిన పథకాలకు విస్తృత ప్రచారం అవసరమనే విషయం సిడి, దస్మత్‌లో నిరూపించారు.

ప్రకృతిలో మార్పు సహజం. ఆ మార్పుకు హద్దులు నిర్ణయించడం ఎంతవరకూ సమంజసము? అడవి రక్షకులు మానభక్షకులుగా మారిన తీరు, ఇంటి పట్టాలు కోసం నిత్యం దగాపడే నిరుపేదలు, నగరాల్లో యాంత్రిక జీవనంతో అలసిపోయిన వారి నిట్టూర్పులు, నెగెటివ్ ఆలోచనల భంగిమలు గర్భ విచ్చిన్నాలు సర్వసామాన్యమనే విషయం రచనలో గొప్ప అనుభూతిని కలిగిస్తాయి. పర్యావరణం, అంటరానితనం కన్నా ముందే స్త్రీని అణగదొక్కబడినదనే విషయాన్ని, పేదరికం కన్నా ఆప్యాయతలు, గొప్పవనే విషయాన్ని నిరూపించిన నిరుపేద కుటుంబాలు, భార్యాభర్తలు ఇరువురూ బ్రతుకు బండికి రెండు చక్రాలనీ, అణగదొక్కితే తిరగబడిన సూరీడు, సమాజ సేవలో సమిధలైన అభాగ్యులకు ఆసరాగా మరింతమంది అమ్మలు అవసరమనీ, అగ్రవర్ణం వారిని తాకితే దళితులే మైలపడతారనే స్థితికి ఎదగాల్సిన ఆవశ్యకత, రక్తసంబంధం కన్నా జంతు సంబంధం ఎక్కువనే నగ్న సత్యాన్ని, శవాలపై ఏరుకు తెచ్చిన మురీలైనా ఆకలి తీర్చి, ఆనందంగా జరుపుకొనే దీపావళి పండుగలు, అన్ని రకాల సమస్యలు - పరిష్కారం అడుగడుగునా కనిపించే డాక్యుమెంటరీలు ఈ కథలు సంపుటి. నేడు దళితుల్లో కొరవడిన ఐకమత్యంపై రచయిత్రి దృష్టి కూడా పడితే బాగుండేది.

ఊహల్లో విహరిస్తూ కాలక్షేపానికి చదివే కథలు కానివి. ఆలోచించి ఏదీ చేయాలనే భావం, తపన కల్పించి పాఠకుల్ని ఆలోచనల్లో పడవేసేవి మన్ను బువ్వ కథలు.

**మన్నుబువ్వ**
**బి.ఎస్. రాములు**
**పేజీలు : 154**
**వెల : రూ. 75/-,**
**ప్రతులకు : విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ పుస్తక కేంద్రాలు, హైదరాబాద్**

**ఎస్.పి.**

# సీమ పేదల బాధా గీతి మెరవణి




దేశంలో అధిక శాతం జనాభా గ్రామాల్లో నివసిస్తున్నారు. వీరిలో అత్యధిక శాతం పేదవారే! అటువంటి వారి దైనందిన కార్యకలాపాలు, జీవన స్థితిగతులు ఒక చోట చేర్చబడిన రాయలసీమ 'ముఖచిత్రం' మెరవణి - కథల సంపుటి. వివిధ పత్రికల్లో ప్రచురించబడినా, అన్ని కథలు ఒకేసారి చదువుకొనే అవకాశం కల్పించారు.

రాయలసీమ గ్రామాల్లో పేద ప్రజల జీవన విధానం, వారి జీవన ప్రమాణం, ఆచార వ్యవహారాలు, గ్రామ దేవత పండుగల విధానాలు, కథలో కనిపించుతాయి. ముఖ్యంగా భాష శైలి వల్ల ఒకటికి రెండుసార్లు చదవాల్సి వస్తుంది.

ప్రభుత్వం విద్యావ్యాప్తికి చేసే కృషిలో చిత్తశుద్ధి వుంటే అభివృద్ధిని ఆశించిన రామనాథం చింతచెట్టును చూసి బాధపడేవాడు కాదు. స్త్రీ శరీరానికి, ఆస్తికి ఇచ్చిన విలువ మనసుకు ఈయలేదనే భావం, నల్లపూసలపై చూపించిన నాంచారి, ఆత్మాభిమానాన్ని చంపిన కులవృత్తిని హోమంలో దగ్ధం చేసినా, వీరపోటీలో రెడ్డప్ప తండ్రి ఆశయం కొరకు కులవృత్తిని చేపట్టాడు. (ఈ కథలో చెప్పిన భూమి పట్టాలు వి.ఎ.ఓ.లు ఇస్తారు కాని విడిఓలు కాదు).

గ్రామాల్లో కులం తరువాత ఆధిపత్యం వహించేది వర్గం. వర్ణ బేధంతో బలిపశువులుగా మారేది అమాయక పేద జనాలే. కలకాలం కక్షలకు సాక్ష్యం శనీశ్వరుడు. మరణం తప్పదని తెలిసినా వైరాగ్యం క్షణం మాత్రమే. అయినా ప్రతి జీవికి యాతన తప్పనిసరి. (మిన్నేరు). ప్రకృతి అనుకూలించకపోతే మనిషి జీవితం నెగిటివ్‌గానే ముగిసిపోతుంది. (అన్నెకారిజల) మారక ద్రవ్యాల వలన ఎందరి బ్రతుకులు చీకటై పోతున్నవో, ఆకలి తీరడానికి ఏ (చావు) కూడైనా ఒకటేననీ, ఆకలి పేదరికం కన్నా కళే గొప్పది. దీన్నే తపస్సుగా ఎంచుకున్న పగటి తెరలు, మానవత్వం ఏ మతంలోనైనా ఒకటేనన్న నామాల సాయిబు, ఏ గాలికి పెరిగినా చిన్న జీవనోపాధితో తనకు జరిగిన అన్యాయాన్ని ఎదిరించి ఆత్మాభిమానాన్ని నిలబెట్టుకోవడానికి స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం ఆవశ్యకతనూ ఈ కథల్లో నిరూపించబడినవి.

గ్రామాల్లో దళితులతో పాటు పేద రైతుల వ్యథలతో పాటు, మైనారిటీ వర్గం వారికి రచనలలో స్థానం కల్పించి సమానత్వం, పరమత అభిమానం కనబరిచారు.

కొన్ని కథల్లో ముగింపు నాటకీయంగా వుండటం వలన సహజత్వాన్ని కోల్పోయినట్లయినది. కొన్ని కథల వలన పేజీలు పెరిగినట్లనిపించింది. మొత్తం మీద రాయలసీమ గ్రామీణ ప్రజల బాధలను మోస్తున్న "మెరవణి" వి.ఆర్. రాసాని గారి కథలు.

**మెరవణి**
**సాయిప్రకాష్**
**పేజీలు : 158**
**వెల : రూ. 60/-**
**ప్రతులకు : విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ పుస్తక కేంద్రాలు, హైదరాబాద్**

---

**సయ్యద్ ఖుర్షీద్**

# కొత్త ఆలోచనల కథలు "నెలపొడుపు"




మన చుట్టూ వున్న ప్రపంచాన్ని, ప్రపంచంలో రోజురోజుకూ వస్తున్న మార్పులను, మారుతున్న వ్యక్తులు వృత్తులు, స్వభావాలు అన్నింటిని సునిశితంగా పరిశీలిస్తే, ఎన్నో కథాంశాలు ఇట్టే దొరుకుతాయని బి.వి.ఎస్. స్వామి తన కథా సంకలనం "నెలపొడుపు" ద్వారా నిరూపించారు.

వర్తమాన ప్రపంచంలో శరవేగంగా వస్తున్న మార్పులు ప్రపంచ దేశాల మధ్య దూరాన్ని తగ్గించాయి. ఈ ప్రపంచీకరణ వల్ల మాత్రం మనుష్యుల మధ్య దూరం పెరిగిపోయింది.

ఇలా సమాజంలో వస్తున్న మార్పులను, మార్పుకు కారణమైన అంశాలను అన్నింటిని స్వామి తన కథా వస్తువులుగా మలచుకున్నాడు. మొత్తం 17 కథలున్నాయి. అన్ని ఇంతకుముందే పత్రికలలో ప్రచురించబడ్డాయి.

"నెల పొడుపు", "శారద" అనే స్త్రీ జీవిత వ్యథ. తప్ప తాగి భర్త తనువు చాలిస్తే, ఇటు అత్తింటివారూ, అటు పుట్టింటివారూ ఆమెను పట్టించుకోరు. ఈ నేపథ్యంలో తన పిల్లల పాలనా పోషణకు ఆమె జీవన పోరాటం చేస్తుంది. మసిబారిన ఆమె బ్రతుకులో మరో పురుషుడు ప్రవేశిస్తాడు. వెన్నెల కురిపిస్తాడు. చాలా కథల్లోలా కాకుండా స్త్రీల బలహీనతల్ని ఆసరా చేసుకొని ఆమెను వాడుకొని వదిలేసే పురుషుల్లా కాకుండా, ఆమెకు తోడుగా ఉండాలనుకోవడం రచయిత ఆశావాద దృక్పథానికి నిదర్శనం!

"ఎండుటాకు" ఇది మరో స్త్రీ కథ కుటుంబ బాధ్యతల నిర్వహణకే పరిమితమైన స్త్రీ సుజాత. కానిస్టేబుల్ భార్య. గ్రామాలు ప్రజల ఆధునిక అవసరాలు తీర్చలేక విఫలమవుతుంటే, చాలామందిలానే పట్టణానికి వచ్చేస్తుందామె కుటుంబం. తనకు సంబంధం లేని శక్తులు తన భర్తను కబళిస్తే, గత్యంతరం లేని పరిస్థితుల్లో భర్త విధుల్లో

చేరుతుంది. వివిధ పరిస్థితుల్లో ఆమె ఎలా ఎదిగిందీ రచయిత స్పష్టంగా చిత్రీకరించారు.

"కలుపు మొక్క" కథలో స్త్రీది మరో కథ. కుటుంబం కోసం బండెడు చాకిరీ చేసినా, చేయని తప్పుకు అందరి దృష్టిలో నిందితురాలిగా నిలిచిపోతుంది, ఈ కథలోని ప్రధాన పాత్ర, మున్ముందు ఏం జరుగుతుందో అనే ఆసక్తితో, చదివించగలిగే శక్తి ఈ సంకలనంలోని కథలన్నింటిలోని కనిపించినా, దాని పాలు ఈ కథలో మరీ ఎక్కువ.

ఈ సంకలనంలో స్త్రీ, జీవితాలకు సంబంధించిన కథలే కాదు, ఇతర కథలు కూడా ఉన్నాయి. "పరిగడుపు" అనే కథ ప్రభుత్వ పథకాల అమలులోని డొల్లతనాన్ని వివరిస్తుంది.

మరో మంచికథ "దేవులాట". వ్యవసాయదారులపై ఆధారపడి జీవించే వడ్రంగి నారాయణ. మానేరు డామ్ ముంపు వల్ల రైతులు భూముల్ని కోల్పోతే, వడ్రంగి నారాయణ ఉపాధిని కోల్పోతాడు. ఏమీ తోచని స్థితిలో 'సన్యాసి'లా జీవితం గడుపుతుంటాడు. చివరికి దేవుణ్ని గుట్ట దింపి క్రిందకి తెస్తాడు. గుట్టపై దేవుడు ఎంతోకాలం పూజాధికాలు చేసినా దేవుడు ఊర్లోకి రాగానే ఆ హక్కుకు దూరమవుతాడు. ఏదో ఒక రకమైన ఉపాధి లభించినా, తన హక్కును కోల్పోయిన తీరు కథలో అంతర్లీనంగా ధ్వనిస్తూనే ఉంటుంది.

'కరెంట్' కష్టాలు వర్ణింపనలవి కానివి. కరెంట్ వినియోగం భారంగా మారి అటు వ్యవసాయరంగం, ఇటు వ్యాపార రంగం చతికిలబడుతున్నాయి. పరిస్థితులు ప్రజల్ని ఉద్యమాలకు ప్రేరేపిస్తున్నాయి. ఇందుకు ప్రభుత్వం పరోక్షంగా ప్రపంచబ్యాంకు కారణమని "అభ్యంతరం" కథలో స్పష్టంగా వివరించడం జరిగింది.

సంకలనంలోని కథలన్నింటిలోను కొట్టొచ్చినట్లు కనిపించే లక్షణం - సంక్షిప్తత. పాత్ర కూడా పరిధి దాటి, పెదవి దాటి ఒక్కమాట మాట్లాడినట్లు కనిపించదు. కరీంనగర్ ప్రాంతీయ యాసను, తెలంగాణ భాషను సందర్భానుసారంగా ఉపయోగించడం జరిగింది. పద ప్రయోగాలు తళుక్కున మెరిసి, ఆకట్టుకుంటాయి. "తన్ను తాను కాల్చుకోవడం కోసం సిగరెట్ వెలిగించాడు" (నిష్క్రమణ) "తడిలేని లోకం" (విషప్రయోగం) లాంటివి యిందుకు నిదర్శనం. సందర్భానుసారంగా జానపద గేయాలను వినియోగించడంతో ఈ కథలు మరింత రక్తికట్టాయి.

తన కళ్ళ ముందు కనిపించే విషయాలనే కథాంశాలుగా మలచుకున్న స్వామి, తన ఎరుకలోకి వచ్చిన అన్ని అంశాలను కథీకరించాలనుకోవడంతో కొన్ని కథలు తేలిపోయాయి. కేవలం వ్యాసాలుగా మారిపోయాయి. "చదువు చెప్పిన రైతు", "ఉచ్చు", "వలస" కథల్లో ఈ లోపం కొట్టొచ్చినట్లుగా కనిపిస్తుంది. వర్తమాన ఉత్తర తెలంగాణా కథా సాహిత్యంపై పిహెచ్‌డి చేస్తున్న స్వామి, మున్ముందు ఈ లోపాలను సవరించుకుంటే మంచి కథకుడిగా పది కాలాలపాటు నిలబడగలడు.

**(నెల పొడుపు - కథా సంకలనం : బి.వి.ఎన్. స్వామి, పేజీలు : 144, వెల : రూ. 50/- ప్రతులకు : విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ, దిశ పుస్తక కేంద్రాలు)**

---

**ఎ.కె. ప్రభాకర్.**

## ఒక సామూహిక దుఃఖానికి "దాఖలా"




కాలం నాడి తెలిసిన కవి వర్షుల శివకుమార్, కాలం కదలిక మీద కన్నేసి వుంచి, 'కవిత్వాన్ని జీవితంగా అనుభూతించి - గాయపడి - గాయాల్ని కవిత్వంతో ముడుచుకోవాలనీ మట్టి మీద, మట్టి కోసం తపించే మనిషి మీద మమకారం పెంచుకోవాలనీ తపన చెందే వర్షుల యింతకుముందే 'గోగు పువ్వు', 'పాలకంకుల కల'ల కవిగా (అవార్డు సంగతెట్లున్నా) మంచి గుర్తింపు తెచ్చుకున్నాడు. ఇప్పుడు 'ఏతమెత్తుకుంటున్న దుక్కం సాచ్చి'గా సంస్కరణ ఫలాలు మన బతుకుల్లో కల్లోలాన్నీ, మానవ సంబంధాల్లోకి కల్తీనీ నింపిన మార్కెట్ దాహాన్నీ, పల్లె గొంతుకల చుట్టూ తడిగుడ్డలు చుట్టి ప్రాణాలు తోడేవాడినీ, ఆకలికీ, అన్నానికీ మధ్య బంజరుకీ - బతుక్కీ మధ్య మరణాల్ని జెండాగా ఎగరేస్తున్న వాడినీ, గంగడోలు దువ్వి పాల పొదుగును లేగల కందకుండా చేసే దుర్మార్గుల్నీ ఎత్తుకుంటున్న కలలపై విషపు వల విసిరి విచ్చుక [illegible] పహరాలు పెట్టే వేటగాడినీ, విశ్వకల్యాణం పేర విభజించి పాలించే వాడినీ, మనందరిలోకి పరకాయ ప్రవేశం చేసి మన వేలితో మన కళ్ళే పొడిచే అదృశ్య శత్రువునీ, కంచానికి కాపలా కాసే నెపంతో కంచంలో కూటికే ఎసరు పెట్టే ద్రోహుల్నీ, ఆకలిని ఆరేసుకొని నాల్గు మెతుకులు పోగు చేసుకొని సొంత నేల మీదే బికార్లు, పకీర్లయి భయంభయంగా బతుకీడ్చేవాళ్ళ గొంతుకల్లోకి కత్తులు దించి రాజ్యంతో రంకు చేయిస్తున్న 'మోడీ' ఆటగాళ్ళనీ నిరసిస్తూ, నిలదీస్తూ సమస్త ధరిత్రినీ అఖండ ప్రేమ కావ్యంగా ఆవిష్కరిస్తున్నాడు. సమకాలీన కవిత్వానికి యిది 'దాఖలా'.

నిన్న శిలువకు మేకులమ్మి, ఇప్పుడు ఆయుధాలమ్మి, నేలంతా కళేబరాల పంట నింపి, ప్రపంచాన్ని పచ్చిపుండులా చేసిన అమెరికన్ 'సైతాన్' ఆధిపత్యాన్ని తెగనాడినా, ఎడారి గుండెల్ని బతుకు తీపితో చదును చేసుకొని, యిసుక పర్రల్ని చెమటతో తడిపి గూళ్ళు కట్టుకొన్న ఇరాకీయుల 'కుర్బానియత్'కి సంఘీభావాన్ని ప్రకటించినా, ఈ మట్టి మీదే ఊపిరి పోసుకొని పరాయి ముద్రతో అణచబడి, ఒక రక్తస్రావం గడ్డి కట్టకముందే ప్రమేయం లేకుండా మరో గాయాన్ని దేహాల మీద [illegible]స్తున్న వాళ్ళ మీద 'అమానవీయం'గా అమలవుతోన్న 'హిందూత్వ హింసావాదాన్ని', 'వేదోక్త సెక్యులరిజాన్ని' ఎండగట్టినా శివకుమార్ [illegible]కంగా తెలంగాణా కవి. అందుకే విత్తనాల కోసం విత్తం కోసం [illegible]లరిగేలా తిరగే దేహాల గురించి, బలిమిటికి బొగ్గు బాయి పొక్కల్లోకి జారి నల్ల బంగారమై నడిచొచ్చేటోళ్ళ గురించి, అంతా 'కొనుగోల్‌మాల్' అ[illegible]న మార్కెట్ మాయాజాలంలో చేతివృత్తులు మూలబడి కడుపు

తీపితో సాంభా కమ్మీలకు వేలాడుతోన్న పేగుల గురించి, కట్టిన డాంల కింద ముంపుకి గురై పెయ్యంతా కాల్వల వాతలతో నిద్రనీ, భద్రతనీ పోగొట్టుకొన్న బతుకుల గురించి, కోటొక్క చేతుల కొట్లాట గురించి, ఉత్పత్తి దాహాల మీద, ద్రోహాల మీద నదీ నినాదాలు పోటెత్తుతున్న 'గోదావరి లోయ' గురించి, ఒక చెర నుంచి మరో చెరలోకి మార్చి స్వేచ్ఛని నిర్వచిస్తోన్న హంసముఖం రాజ్యహింస గురించి, అలజడించే ఆరాటాన్ని మట్టుపెట్టే లక్ష్యంగా శాంతి భద్రతల తంత్రీలో 'అప్రస్తుతాంశమైన మానవ హక్కుల గురించి, రాత్రికి రాత్రి పాట మీద కత్తి కట్టిన కాలం గురించి...కవిత్వమై పలవరిస్తున్నాడు. తననో మాటల మంత్రగాణ్ణి చేసి, పాటల పల్లవి చేసి, వెన్నెల కోనలో తననో నిప్పుని చేసిన 'యీ నేల అడుగడుక్కి' దండం పెడుతున్నాడు.

ఈ నేల మీద యింత 'పావురం'తో కట్టిన వర్ఖుల 'పుదిచ్చిన బోనాన్ని' కుక్కల పాల్జేసిన వలస వాదానికీ - పుట్టి మెట్టిన గురించి కలలకి కాలం చెల్లింప చేసిన ప్రపంచీకరణకీ - మట్టితో, మనిషితో అనుబంధాలను కొనసాగనివ్వని మార్కెట్ మంత్రజాలానికీ - ఆయుధంగా తప్ప వేరేలా ఎదురుపడలేని (పిరికి) అమెరికన్ ఆధిపత్యానికీ - సంబంధం వుందని సరిగ్గానే గ్రహించాడు. అప్పు చేసైనా పప్పుకూడు తినాలనే తత్వం వంటబట్టించి, 'రుణానందలహరి'లో తేలియాడించి, కలల మార్కెట్లో కనుగుడ్ల వేలం పాటలు పాడే కన్స్యూమరిజం - మన నరాల్లోకి రక్తంగా ప్రవహింపచేస్తోన్న నయా సామ్రాజ్యవాదం మనల్ని మనకి కాకుండా ఒక పరాయీకరణకి గురిచేస్తున్నాయి. మన నిర్ణయాలేవీ మనవి కావు. మనం కనే కలలు మనవి కావు. మన కోరికలూ - వ్యామోహాలూ మనవి కావు. సొంత ముఖాన్ని కోల్పోయిన మనిషి మార్కెట్లో వస్తువైపోతాడు. 'సుఖాలు, సౌకర్యాలు, సౌలభ్యాలు మనం ఒకటి కొంటే - మరెన్నో మనని కొంటాయి. ప్రపంచం మన గుప్పెట్లో - మరి మనం ఎవరి గుప్పెట్లో??? - అని వస్తు వ్యామోహాల్తో మనిషి సరుకై అమ్ముడుపోతున్న దాఖలాని శివకుమార్ కవిత్వీకరించాడు.

అయితే అసలు శత్రువెవరో గుర్తించాక కూడా ఇదంతా మనం చేతులారా చేసుకొన్నదే అంటాడీ కవి. 'కలుపు మొక్కలను చేన్లోకి పిలిచినట్లు మనం అనుమతించనిదే వాడి ఆట మన వాకిట్లో సాగదనీ, ఇప్పుడు గొంతుక్కి బిగుసుకుంటున్న తాళ్ళన్నీ మనం అనుమతిస్తున్నవే' అనీ, మట్టినాడుల మీద పెత్తనాన్ని వాడికి కట్టబెట్టింది మనమేననీ ఆత్మశోధనలో పడ్తాడు. ఒక్కోసారి యిది నిజమే అనిపిస్తుంది. మన చుట్టూ మనం ప్రాకారాలు కట్టుకొని, 'వైరుధ్యాల అంచుల మీద' నిలబడి, ఒకరిపై ఒకరు అభియోగాలు మోపుకొని, ఒక గాలివాటు ఆవేశాన్ని ఆవహనం చేసుకొని, శాశ్వత ప్రయోజనాల్ని మంట గలుపుకుంటూ, జట్లు జట్లుగా విడిపోయి - వేరు వేరు శిబిరాలుగా లేచి, జుట్లు జుట్లు పీక్కుంటూ మనమే వాడికి లేని బలాన్నిస్తున్నాం. ఇప్పటికైనా చీలిపోయిన మన దార్లని ఏకం చేసి, ఉమ్మడి శత్రువుని విచ్చుకత్తుల్తో ఎదుర్కోవాలంటే 'ఇప్పుడు నిర్మాణం జరగాల్సింది లోపలే' అని మృదువుగా స్నేహపూర్వకంగా మందలిస్తాడు కవిగా వర్ఖుల శివకుమార్. అందుకే యీ కవితల్లో ఛెళ్ళున కొట్టే చెర్నాకోల్ చురకలు గానీ, సర్రున దూసిన కరవాలాల దిబ్బలు గానీ మనకు కనిపించవు. మానవ సంబంధాల్ని పటిష్టపరచడమే కవిత్వానికి పరమావధి అని భావించడం వల్లే - 'కవిత్వమైనా కమ్ముకోమని జింబోని ఆవహన చేసుకొని లోపలి వర్షంలో తడవడం, స్నేహితుడి ఆకస్మిక నిష్క్రమణని బహిష్కరించడం, ఒక సహవాసం కోసం - ఆలంబన కోసం 'అంకితం' కావడం.

ఓ నాల్గు కొత్త పదాల జగ్గరీతో, నాల్గు ప్రతీకల హెచ్చువేతల్తో, ఆత్మని వదిలేసి వట్టిపోయిన వాక్యాల్తో, వట్టి శబ్దాల రాపిడీ లాంటి అకవిత్వాన్ని నిరసిస్తూ - నిలవ నీటి బావిలోకి కొత్త ఊటలా కవిత్వం ఊరాలనీ, మంచి మాటై, పాటై బతకాలనీ, ఆశించే శివకుమార్ ఒక్కో సందర్భంలో శుద్ధ వచనమై పోతూ వుంటాడు. కానీ 'రాట మీద నుంచి బావిలోకి జారిపోయిన పాటని' పట్టి తెచ్చి దాహార్తిని తీరుస్తాడని నమ్మకాన్ని పోనివ్వడు. అవును 'ఆకుల ఆరాటాన్ని తీర్చడం కోసం/ మరిన్ని వెల్తురు పాటలతో / మళ్ళీ పిట్టలొస్తాయి' ఎదిరి చూద్దాం.

**(దాఖలా - కథా సంకలనం : వర్ఖుల శివకుమార్, పేజీలు : 104, వెల : రూ. 50/- ప్రతులకు : విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ, దిశ పుస్తక కేంద్రాలు, హైదరాబాద్)**

# చిక్కటి కవిత్వం నుండి "పారిపోలేం"




**- పసునూరి రవీందర్**

ప్రజల నోళ్ళల్లో నానేదే అసలైన కవిత్వమంటాడు 'విలియం షేక్స్పియర్'. అలాంటి కోవలోనిదే ప్రభు కవిత్వం 'పారిపోలేం'. కవిత్వం తెలుగులో విస్తృతంగా వస్తున్న ప్రక్రియని వేరే చెప్పక్కర్లేదు. అనేక సంకలనాల్ని ముందేసుకున్న సాహితీ ప్రియులకు ఏదో కొద్దిమేర మాత్రమే పది కాలాలు దాచుకునే కవిత్వం దొరుకుతుంది. 'పారిపోలేం' కవితా సంకలనం సరిగ్గా అలాంటిదే. అకవిత్వం విరివిగా, వరదలా వస్తున్న సమయంలో మంచి కవిత్వం చదివామన్న తృప్తి మిగిల్చేది ఈ 'పారిపోలేం'.

అద్దేపల్లి ప్రభు కవిగా, కథకునిగా సాహితీ లోకానికి పరిచితులే. - సుమారు పదిహేను సంవత్సరాల నుండి రచించిన కవితలన్నీ ఇందులో పొందుపరిచారు. బాధ్యత కలిగిన కవిగా తనను తాను నిర్ణయించుకున్నాడు కాబట్టే చుట్టూ ఉన్న పరిస్థితుల్ని తన కవిత్వంలో ప్రతిబింబించాడు. ఆధునిక కాలంలో ప్రజల ముందు అనేక సమస్యలున్నాయి. ఆ సమస్యల్ని శాస్త్రీయ దృక్పథంతో అవగాహన చేసుకున్న తీరు కవిలో స్పష్టంగా కనిపిస్తుంది. సామ్రాజ్యవాద కుట్రల నుండి మొదలుకొని సరళీకరణ విధానాల వరకు, అమెరికా యుద్ధోన్మాదం నుండి ఆంధ్రలో జరిగే బూటకపు ఎన్‌కౌంటర్‌ల వరకు, సమైక్యతను దెబ్బతీసే మతోన్మాద చర్యల నుండి మండిపడే మిర్చి రైతు వరకు ఈ కవి తన కవితా వస్తువులుగా స్వీకరించారు. ప్రకృతి, పరిసరాల అనుభూతి, మానవ సంబంధాల ఔన్నత్యం అన్నీ 'ప్రభు' కవిత్వంలో కనిపించే అంశాలు.

మానవ సంబంధాలన్నీ మార్కెట్ సంబంధాలై పోతుంటే ఈ కవి చూస్తూ కూర్చోలేదు. గుండెను గొంతుక చేసుకొని ఒక పొలికేక వేస్తున్నాడు.

"దేశమంటే మరేం కాదోయ్ - దేశమంటే సంతోయ్" అంటాడు.

ప్రపంచీకరణ పెరిగిపోయి దాని ప్రభావం తృతీయ ప్రపంచ దేశాల మీద ఎలా ఉందో కళ్ళ ముందుంచాడు. ఇంటర్‌నెట్‌లొచ్చి ప్రపంచం కుగ్రామమైందన్నారు మేధావులు. కానీ ఈ కవి ప్రపంచం సంతైపోయిందని, మనిషి సరుకైపోయాడని ప్రతిపాదిస్తున్నాడు. "మనిషికి ఉపయోగపు విలువా / మారకపు విలువ ఉంటాయి" (మాయదారి సంత) అంటాడు. ప్రపంచీకరణతో పాటు సరళీకరణ ఆర్థిక విధానాల మూలంగా అన్నదాత ఎలా సతికిలపడ్డాడో తెలియజేశాడు. "రేణువు రేణువునే సరళీకరణంగా ఆక్రమిస్తూ / ఆత్మకీ మట్టికీ మధ్య బంకలా అంటుకున్న / ఎరువుల పాల్పిడి నిర్జీవమౌతున్న నేల / ఎలా తాకుకుంటుంది." (ఆత్మకి మట్టికి మధ్య) అని ప్రశ్నిస్తున్నాడు. మతం వెర్రితలలు వేస్తుంటే మనం ఎలా మౌన ముద్రలమయ్యామో, అవుతామో 'ప్రపంచ దుఃఖం' కవితలో వెల్లడించారు. "మతోన్మాదపు జాతుల్ని / జాత్యోన్మాదపు మతాల్ని చూస్తూ / మూడో కన్ను సోకని గుల్లలోకి పోతాం" అని మనలోని అచేతనాన్ని వెక్కిరిస్తున్నాడు. ప్రభు ఉన్న కవిత్వ దృష్టి మనకు వెంటనే పట్టించే కవిత "రైలు పట్టాల మీద వెన్నెల", "బుగ్గల మీద చారికలు గట్టిన కన్నీటి ధారల మల్లే / చీకటి పడ్డాక పట్టాలు విషాదంగా ఉంటాయి" అని రైలు పట్టాల్ని కన్నీటి చారికలతో పోల్చడం ఒక అద్భుతమైన విషయం. సమస్యను చూసి స్పందించి బాధపడటమే కాదు ఒక పరిష్కారాన్ని కూడా కనుగొంటున్నాడీ కవి. దుఃఖం గడ్డకట్టి గడ్డకట్టి ఎలా మారుతుందో ఊహిస్తున్నాడు. "మా దుఃఖం బిగుసుకొని / ఒక మానవ బాంబవుతుంద"ని రావల్సిన మార్పును బలంగా కాంక్షిస్తున్నాడు.

తన కవితలకు శీర్షికలు పెట్టడంలో కూడా ఒక నైపుణ్యతకు ప్రదర్శించాడు. స్మృతికి మృతి లేదన్నట్లు, జ్ఞాపకానికి మరణం లేదని నిరూపించడం కోసం మనుషులతో, మనసులతో తనకున్న ఆత్మీయతను, అనుబంధాన్ని గుర్తు చేసుకుంటూ తాదాత్మ్యం చెందడం ఈ పుస్తకంలో మనకు కనిపిస్తుంది. ఈ చిక్కటి కవిత్వం నుండి మనమెవ్వరం 'పారిపోలేం'.

**('పారిపోలేం - కవితా సంపుటి, రచన - ప్రభు,**
**వెల : రూ 40/-, దొరుకు చోటు : ఎ. ప్రభు,**
**3-5, మధురానగర్, కాకినాడ-4.)**

---

**మొలకలపల్లి కోటేశ్వరరావు**

# విద్యా వ్యవస్థ తీరుతెన్నులకి 'బడి కథలు'



ఉపాధ్యాయులు, విద్యార్థులు ఎదుర్కొంటున్న సమస్యలు, పనికిరాని చదువులు, పురుగుల తిండి పెట్టే హాస్టళ్ళు, వార్డెన్ల వేధింపులు, స్వేచ్ఛని కోల్పోయిన బందిఖానా లాంటి బాల్యం, చెత్త పాఠాలు - మొత్తంగా బడికి సంబంధించిన అంశాలతో వచ్చిన కథల సంకలనం 'బడికతలు'

"అన్నిటికీ కీలకమైంది భూదేవత... నేలలేనోడు కూలోడు. కూలోడికి కూలాడితేనే కూడు. కూడు లేనోడు సదువేటి సదువుతాడు?" 'పర్యవస్థ' కథలో ఒక పాత్ర అంటుంది. నిత్యానంద నాయుడు కౌలు రైతుల భూముల్లో పంటలు కోసుకుపోయి దౌర్జన్యాలు చేస్తుంటాడు. కౌలు రైతులు నిత్యానంద నాయుడ్ని చంపడానికి తరుముతూ చంద్రశేఖర్ అనే మాష్టారు అభ్యర్థనతో "రక్తం ఇక్కడే కాదు, ఎక్కడా చిందకూడదు" అంటూ వెళ్ళిపోతారు. ఈ గొడవల్లో దానయ్య అనే చురుకైన విద్యార్థి చదువు మానుకుని కౌలురైతులతో వూరువిడిచి వెళ్ళిపోతాడు. 'పర్యవస్థ' కథ ఇది. రచయిత అట్టాడ అప్పల నాయుడు. బడిలోనూ, హాస్టల్లోనూ పెట్టేహింసలు భరించలేక పారిపోయి ఇంటికి చేరిన సన్నాయి అనే పేద విద్యార్థి కథ 'అక్షరాల దారిలో...' చివరికి ఒక మంచి మాష్టారి మంచి మాటల్తో చదువు కొనసాగించడానికి స్కూల్‌కి తిరిగి వెళ్తాడు సన్నాయి. మల్లిపురం జగదీష్ కథ ఇది. సినీగీతాల మోజులో పడిన విద్యార్థులకి వారం రోజులపాటు సినీ సంగీత సప్తాహం ఏర్పాటు చేస్తాడు హెడ్‌మాష్టర్. మూడో రోజుకే మొహం మొత్తి, సంగీతం వద్దు, చదువుకుంటామని విద్యార్థులు మొరపెట్టుకోవడం ఐ.ఎ.నరసింహం కథ 'హింసధ్వని'

భజనల పేరుతో చేస్తున్న శబ్దకాలుష్యం కారణంగా ఒక విద్యార్థి పరీక్షల్లో ఫెయిల్ కావడం బడబాగ్ని శంకరరాజు కథాంశం 'తనదాకా వస్తే...' సర్కారు బడుల్లో పిల్లలకి పాఠాలు చెప్పాలని ప్రయత్నించినా, వాళ్ళని చెప్పనివ్వకుండా విద్యేతర విధుల్తో అడుగడుగునా ఆటంకాలు ప్రభుత్వం ఎలా కల్పిస్తుందో చింతా అప్పలనాయుడు కథ 'ఐకమ...' వివరిస్తుంది. ఈ కథలో ప్రభుత్వ ఉపాధ్యాయుడ్ని గైరమ్మ అనే మహిళ "మీ పిల్లల్ని కానిమెంటుల్లో సదివించుకుంటారు. అటుకీకాగ, ఇటుకీకాగ మద్దిన సెడిపోయింది మాగుంటలే కదా..." అంటూ శాపనార్థాలు పెడుతుంది. మూడేళ్ళుగా సిట్టుమని సినుకులేక, పంటలన్నీపోయి, తాగడానికే నీళ్ళు దొరక్క అమ్మానాయనా వలసపోగా, వాళ్ళ దిగులుతో నాయనమ్మ సచ్చిపోగా, పట్నంలో ఒక టీచర్ చెంత చేరిన పసిపిల్ల గంగ నీటి కోసం పడే తపననీ, హృదయవేదననీ 'నీటి చిత్రం' కథలో పి. కమలకుమారి ఆవిష్కరించారు.

టీచర్ల మధ్య ఉన్న కులపోరు కారణంగా ఒక విద్యార్థిని కొట్టాడనే ఆరోపణతో ఒక మంచి ఉపాధ్యాయుడ్ని సస్పెండ్ చేయడం 'అల్పజీవి' కథ. రచయిత ఉపాధ్యాయుల గౌరీశంకరరావు. కొన్ని గ్రామాల్లో పంచాయతీ ఎన్నికల్ని మరపించే రీతిలో జరుగుతున్న విద్యా కమిటీల ఎన్నికలు పాఠశాల పిల్లల మనసుల్ని ఎలా కలుషితం చేస్తాయో, ప్రభుత్వ పాఠశాలల్లో పని చేస్తున్న టీచర్లు ప్రయివేట్ పాఠశాలల్ని స్థాపించి, మాతృసంస్థల్ని ఎలా నాశనం చేస్తున్నారో దాసరి రామచంద్రరావు రాసిన 'చోటు' కథ వివరిస్తుంది. పిల్లల్ని ప్రేమిస్తూ, ఆరాధిస్తూ పాటలూ, కథలూ, బొమ్మలూ లాంటివి నేర్పాలనుకునే ఒక టీచర్ని కుటుంబం, సమాజం, పాఠశాల ఎలా పిచ్చివాడిగా చూస్తుందో, ఎలాంటి అవమానాలు ఎదుర్కో

వాలో గంటేడు గౌరునాయుడు 'జీవన్మృతులు' కథ గొప్పగా తెలియజేస్తుంది.

మొత్తం 9 కథలు ఉన్న ఈ సంకలనంలో వస్తురీత్యానూ, శిల్ప రీత్యానూ కొన్ని కథలు చాలా పేలవంగా వున్నాయి. 'పిల్లల్ని ప్రేమించిన వాళ్ళ కథలు' పేరుతో చినవీరభద్రుడు రాసిన ముందు మాట విద్యకు సంబంధించి కొన్ని ఆలోచనలు కలిగిస్తుంది. అయితే "ఈ కథా సంకలనం కొడవటిగంటి కుటుంబరావు 'చదువు' తర్వాత అంత ముఖ్యమైన పాత్రని తెలుగు సాహిత్యంలో నిర్వహించడానికి ముందుకొస్తోంది" అన్నారు. ఈ కథలకి అంతశక్తి వున్నదా అనేది సందేహమే.

**(బడికతలు, కథాసంకలనం, పేజీలు : 67.10, ధర : రు. 25/-, ప్రచురణ, సంపాదకత్వం, ప్రతులకు : స్నేహ కళాసాహితి, కురుపాం-535 524)**

# లస్కర్ జీవితాల మిర్రర్

## 'లొల్లి'




**భిక్షపతి నాగబండి**

నగరంలో ఎక్కడ చూసినా లొల్లి, నీళ్ళ పంపుల దగ్గర ఆడవాళ్ళ లొల్లి, కోర్టు బాగా లేనందుకు లొల్లి, పెంచిన గ్యాస్, పెట్రోలు ధరలు తగ్గించాలని లొల్లి, పసిపిల్లలపై చదువుల భారం వద్దని లొల్లి, హైదరాబాద్‌లోని లస్కర్ జనాల బాధలు తీరాలని లొల్లి, మధ్యతరగతి మానవుడి కనీస అవసరాలు తీరాలని లొల్లి, ప్రజలు చేసే లొల్లి, పార్టీలు చేసే లొల్లి, ఉద్యోగులు చేసే లొల్లి, కవులు చేసే లొల్లి, రచయితలు చేసే లొల్లి, ఇన్ని లొల్లుల్ల వచ్చింది కంభాలపల్లి 'కృష్ణ' లొల్లి.

హైదరాబాద్‌లోని లస్కర్ ప్రజల జిందగీలను వారి భాషలోనే (తెలంగాణా మాండలికం) వారి యాసలోనే హాస్యంతో కూడిన సంభాషణతో వచ్చిన వ్యంగ్య రచన లొల్లి. దీని రచయిత కృష్ణ ప్రజాశక్తి, ఆంధ్రజ్యోతిలలో వివిధ హోదాల్లో ఆయన పని చేశాడు. ప్రస్తుతం టివి9 రిపోర్టర్‌గా పనిచేస్తున్నాడు. సామాన్యుని జీవితాన్ని అర్థం చేసుకున్న కృష్ణ వారి బాధలన్నింటిని తన రచనల్లోకి ఎక్కించాడు.

ప్రధానంగా ఈ పుస్తకం గురించి చెప్పాలంటే సెటైర్ గురించి చెప్పాలి. సెటైర్‌లు (Satires) అంటే వ్యంగ్యం అని అర్థం. దీనిలో చెబుతున్నట్లు కనిపించేది ఒకటయితే చెప్పే విషయం మరొకటి అవుతుంది. చెబుతున్నట్టనిపించే దానికి, రచయిత ఉద్దేశించిన దానికి మధ్య వైరుధ్యం, వ్యత్యాసం అనేది వీటిలో కనిపిస్తుంది.

వ్యాపారం చేస్తున్న కంపెనీలు ప్రజా శ్రేయస్సును పక్కనబెట్టి లాభాలు ప్రధాన ధ్యేయంగా కనీస ప్రమాణాలు పాటించకుండా వస్తువులను మార్కెట్‌లోకి విడుదల చేసి లాభాలు దండుకుంటున్నాయి. శీతల పానీయాలను తయారుచేస్తున్న కంపెనీలు వాటిలో మోతాదుకు మించి రసాయనాలు వాడటం వలన ప్రజల ఆరోగ్యం దెబ్బతినే తీరును 'అదే తాగిన' చెబుతుంది. హైదరాబాద్ నగరంలో ఇల్లు అద్దెకు దొరకటం అనేది సామాన్యమైన విషయం కాదు. ఒకవేళ దొరికినా సవాలక్ష నిబంధనలు. నీటి బిల్లు. కరెంట్ బిల్లు. చుట్టాలను లోనికి రానివ్వకపోవడం. రాత్రి తొమ్మిది గంటలు దాటితే గేటు మూసేయటం లాంటివెన్నో అందులో ఉంటాయి. ఇవన్నీ ఒక ఎత్తయితే బ్యాచిలర్స్‌కి ఇల్లు దొరకటమనేది మరో సమస్య. ఇలాంటి సమస్యలన్నీ కలిపితే ఏర్పడిందే 'కిరాయిల్లు'. ప్రభుత్వం ఏ విధమైన ప్రణాళికలు లేకుండా ఎయిడ్స్ గురించి చేపట్టిన కార్యక్రమం పక్కదోవ పట్టిన వైనాన్ని 'పులిరాజా'లో చూడొచ్చు. ధర్మబద్ధమైన సంసారిక జీవనాన్ని గడపటానికి సూచనలు చేయాల్సింది పోయి, కండోమ్‌లనిచ్చి వ్యభిచారాన్ని ప్రత్యక్షంగా ప్రోత్సహించేలా ఉన్న ప్రభుత్వ చర్యలను తూర్పారాపట్టే విధంగా ఉందా రచన. మధ్యతరగతి మనిషికి అనేక రకాలైన కోరికలుంటాయి. వాటిని తీర్చుకోవడానికి వాళ్ళు అనేక ఇబ్బందులు పడుతుంటారు. మోటార్‌సైకిల్‌పై తిరగటం ఆ కోరికల్లో ఒకటి. ప్రభుత్వం మాటిమాటికి పెంచే పెట్రోలు ధరలలో మోటార్ సైకిల్ కొనుక్కున్నా దానిపై తిరగలేని పరిస్థితి ఏర్పడింది. దాన్ని వదిలేసి బస్సుల్లో తిరగాలనుకుంటే ఆర్టీసి అంటే ఛార్జీల మోత, బస్‌పాస్‌ల రేట్లు రోజురోజుకూ పెరుగుతూనే వుంటాయి. ఇలాంటి పరిస్థితుల్లో మధ్యతరగతి మనిషి కోర్కెలను చంపుకొని సైకిల్‌కు దగ్గరైన వైనాన్ని 'ఆనిక్కుడా తెల్సంది'లో వివరించిన తీరు బాగుంది. బోనాల పండుగకు కోళ్ళను కోసే విధానాన్ని 'పండుగ'లో చెప్పాడు. 'పరీచ్చ'లో కాన్వెంటు చదువుల కండిషన్లు బైట పెట్టాడు. బ్యాంకుల్లో డిపాజిట్లు గల్లంతయి బ్యాంకులను మూసేసి సామాన్యుల జీవితాలతో చెలగాటమాడుతున్న ప్రైవేట్ బ్యాంకులను ఎద్దేవా చేయటం 'దావత్'లో కనిపిస్తుంది. తాగటానికి కూడా నగరాల్లో నీళ్ళు దొరకని పరిస్థితిని 'కస్టమాయె'లో చూడవచ్చు.

గతంలో పెళ్ళిళ్ళు రెండు, మూడు రోజులు జరిగేవి. ప్రస్తుతం రోజులు పోయి గంటల్లోకి మారిన వైనం. పట్టణాల్లో, నగరాల్లో కల్యాణ మండపాల తీరుతెన్నులు 'మల్లేస్ గాని పెళ్ళి'లో వివరించిన తీరు ఆకట్టుకునే విధంగా ఉంది. కరెంట్ కష్టాల గురించి 'సిమ్మ సీకటి'లో చెప్పాడు. నగరంలో వాహనం తోల్తోడు హెల్మెట్ పెట్టుకోకపోతే పోలీసులు పెట్టే బాధలు 'గుబులుపడ్డ'లో కనిపిస్తాయి. పార్కులు, విజ్ఞాన వినోద కేంద్రాలుగా ఉండాల్సిందిపోయి ప్రేమికులు బహిరంగంగానే సాగిస్తున్న ప్రేమ కలాపాల గురించి 'షికారు పోయినం'లో చెప్పిన శైలి బాగుంది. పెద్దలు చేస్తున్న పనులు పిల్లలు అనుకరించడం అనేది సాధారణ విషయం. వినాయకచవితికి పెద్దలు గణేష్ పూజ చేస్తే పిల్లలు కూడా దాన్ననుకరించి వినాయకుడిని పూజించడం 'దినాం ఒకడు'లో చెప్పగా నగరీకరణ పెరిగిపోతున్న రోజుల్లో ఖర్చులు కూడా పెరుగుతుంటాయి. ఆ ఖర్చులు తీర్చుకోవడం వచ్చే సంపాదనతో అయ్యే పనికాదు. తప్పనిసరి పరిస్థితుల్లో అప్పులు చేసే విధానాన్ని 'కర్సులు'లో చూపెట్టాడు. రాజకీయ నాయకులు కాంట్రాక్టర్లు అవినీతిపరులుగా తయారై దేశాన్ని దోచుకుంటున్న వైనాన్ని 'పైసలు మేసుడు'లో చెప్పి ఊకదంపుడు మాటలతో కాలక్షేపం చేసే తీరును 'కయితల మీటింగ్'లో వివరించాడు.

కంభాలపల్లి కృష్ణ పూర్తిగా తెలంగాణా మాండలికంలోనే రాశాడు. ఇందులోని ఈతిబాధలన్నీ ప్రజల భాషలో, వారి యాసలో చెప్పిన పద్ధతి బాగుంది. ప్రజల కష్టనష్టాలను ప్రజల భాషలో వివరించినట్లయితే అవి వారికి తొందరగా చేరువవుతాయనడానికి 'లొల్లి' ఒక నిదర్శనం. మాండలికంలో కాకుండా ప్రామాణిక భాషలో రాస్తే అంతగా ఆకట్టుకునే రచన అయి ఉండేది కాదు. కృష్ణ ఇలాంటి 'లొల్లి' మళ్ళీ చేస్తాడని ఆశించవచ్చు.

**(లొల్లి - వ్యంగ్య రచనలు : కంభాలపల్లి కృష్ణ, పేజీలు : 88 , వెల : రూ. 50/- ప్రతులకు : విశాలాంధ్ర, ప్రజాశక్తి, దిశ పుస్తక కేంద్రాలు, హైదరాబాద్)**

# కవిత్వం గుబాళించిన నల్ల (కవులు) కలువలు



**అంతవరకూ వున్న భాషను మార్చడానికి, తమ సొంత భాష చుట్టూ కవిత్వాన్ని తిప్పడానికి పదాలలో అంతర్నిహితంగా వున్న అర్థాలను వెలుగులోకి తేవడానికి నల్లకవులు గొప్ప కృషి చేశారు. అంతవరకూ నీచమైనదిగా, అశ్లీలమైనదిగా (మురికి) భావింపబడుతున్న బ్లాక్ అన్న పదం ఈ గతి క్రమంలో సొగసైనది, సగర్వమైనది అన్న అర్థంలో ప్రయుక్తమైంది. ఈ పరిణామ క్రమంలో నల్లకవులు తమ విస్తృత జీవితానుభవాలకు అక్షర రూపం యిచ్చారు యీ సంకలనంలో.**

**డాక్టర్ దిలావర్**

పతితులను, భ్రష్టులను, బాధాసర్పదష్టులను ఏడవకండే డవకండి, నేనున్నానని సమాశ్వాసించడం సంగతి అటుంచి కనీసం వారి నీడ కూడా వారికి సహాయపడని నిస్సహాయ స్థితి ఒకప్పటి ఆఫ్రికన్లది.

దాదాపుగా రెండు శతాబ్దాల క్రితం వరకూ పాశ్చాత్యులచే 'చీకటి ఖండం' అని పిలవబడిన ఆఫ్రికా వాసుల కడగండ్లు ఒక్కనాటివి కావు. ఒక్క తీరువి కావు.

14 - 18 శతాబ్దాలలో - నాలుగు వందల సంవత్సరాలలో సుమారు కోటిన్నర బానిసలను అమెరికా వారైతేనేం. యూరోప్ వారైతేనేం చెరబట్టారు. డచ్, ఫ్రెంచి, బ్రిటిష్, స్పెయిన్ వారు ఆఫ్రికన్ల జీవితాలను అంధకారంలోకి తోసివేశారు.

హారియట్ బీచర్ స్టొ రాసిన 'అంకుల్ టామ్స్ క్యాబిన్' దగ్గర నుండి అలెక్సీ హేలీ రచించిన 'రూట్స్' వరకు అన్నీ నీగ్రోల హృదయ విదారక దీన గాథలను తెలిపేవే. బానిసల దుర్భర జీవితాలను చిత్రించిన మరో గొప్ప పుస్తకం 'స్పార్టకస్'. నల్లవారి కన్నీటి గాథలను రాసిన యింకో రచయిత ఎలాన్ పాటన్. విలియం కాంటన్ రాసిన 'ది ఆఫ్రికన్' ఆ కోవలోనిదే. అయితే యివన్నీ నవలలే. ప్రపంచమంతటా యీ నవలలు చొచ్చుకుపోయినంత విస్తృతంగా నల్ల కవులు రాసిన కవిత్వం వ్యాపించలేదు. అట్లా అని నీగ్రోలు రాసిన కవిత్వం రాశిలోనూ, వాసిలోనూ తక్కువేమీ కాదు.

1746 - 1949 వరకు లాంగ్స్టన్ హ్యూగ్స్, అర్నా బోంటెంప్స్‌లు రాసిన 'ది పొయెట్రీ ఆఫ్ ది నీగ్రో' అన్న కవితా సంకలనం ఒక్కటే ప్రచురింపబడింది. 1962లో రోజీ ఇ. పూల్ ప్రచురించిన 'బియాండ్ ది బ్లూస్' అన్న కవితా సంకలనం సమగ్రమైందిగా పరిగణింపబడింది.

ఇమాము అమీరి బరక, లారీ నీల్‌లు ప్రచురించిన 'బ్లాక్ ఫైర్'లో చాలామంది యువకవుల కవితలున్నాయి. కానీ రాబర్ట్ హైడెన్, గ్వెండలిన్ బ్రూక్స్‌లకు ఇందులో చోటు దొరకలేదు. డాన్ ఎల్.లీ, ఎథెరిడ్జ్ నైట్‌లను కూడా మరచిపోయారు. క్లారెన్స్ మేజర్ 'ది న్యూ బ్లాక్ పొయెట్రీ'లో చాలామంది కవుల కవితలున్నాయి. కానీ కవుల ఒక్కొక్క కవితనే ప్రచురించారు. బర్డ్ షుమన్ 'నైన్ బ్లాక్ పొయెట్స్'లో లోతైన కవితలున్నాయి. కానీ సంఖ్యాపరిమితి వల్ల ఎక్కువమంది కవితల్ని ఆస్వాదించే వీలు లేదు. ఆడమ్ మిల్లర్ 'డైస్' లేక 'బ్లాక్ బోన్స్' కేవలం 'వెస్ట్ కోస్ట్' కవులకే పరిమితమైంది. ఏ విధంగా చూసినా (ఇప్పుడు మనం పరిశీలించబోయే) డడ్లీ రండల్ సంపాదకత్వంలో వెలువడిన 'బ్లాక్ పొయెట్స్' అన్న కవితా సంకలనమే సాధికారతను, సమగ్రతను సంతరించుకున్నది.

ఈ సంకలనంలో బ్లాక్ అమెరికన్ల కవితలు పూర్తి స్థాయి సామర్థ్యాన్ని ప్రదర్శించాయి. ప్రస్తుత ఆధునిక కవిత్వం మూలాలు జానపద సాహిత్యంలోనే వున్నాయి గనుక ఈ కవితా సంకలనం జానపద కవిత్వంతోనే ప్రారంభమైంది. మౌఖిక సంప్రదాయానికి చెందిన జానపద కవిత్వం నేటి లిఖిత సంప్రదాయ కవిత్వానికి ప్రేరణ కావడం వల్ల కూడా జానపద కవిత్వానికి ఇందులో ప్రాధాన్యమివ్వబడింది. ఇందులో భాగంగానే బల్లాడ్ (Ballad) కవిత్వం కూడా పరిచయం చేయబడింది.

ఇంతకు ముందు నిర్లక్ష్యం చేయబడిన నూతన దృక్కోణాలతో, లోతైన భావాలు గల కవితల్ని ఇందులో చేర్చారు. ధిక్కార స్వరంతో తిరుగుబాటు కవిత్వం రాసిన కవులు ఆ తరువాత అంతర్ముఖులై తమను తాము ప్రశ్నించుకున్న కవిత్వానిక్కూడా దీనిలో ప్రాతినిధ్యం వుంది. మొదట నిరీశ్వరవాదాన్ని ఆశ్రయించి తరువాత క్యాథలిక్ మతానుయాయులైన కవులు కూడా ఇందులో వున్నారు. జాతిపరంగా, కుటుంబ పరంగా రాసిన కవిత్వమే కాక ఉన్నత స్థాయి ప్రేమ కవిత్వం కూడా యీ సంకలనాన్ని అలంకరించింది. కళ కళ కోసమే అని మొదట నమ్మిన వారు కూడా తరువాత పోరాట పటిమతో కవిత్వం రాసిన కవులు చాలామంది యీ సంకలనంలో వున్నారు.

తొలినాళ్ళలో నల్ల కవులు, తెల్ల పాఠకుల మెప్పు కోసం తెల్ల కవుల్ని అనుకరించారు. ఆ క్రమంలో కొందరు పోప్, డ్రైడెన్‌ల ప్రభావానికి లోనయ్యారు. పాశ్చాత్య కవులు సమకాలీన కవితా రీతుల్ని క్రితం కన్నా సొగసైన శైలిలో వర్ణించడం వల్ల నల్లకవులు వాళ్ళను ఆదర్శంగా తీసుకున్నారు. కొందరు వర్డ్స్‌వర్త్, మిల్టన్‌ల మార్గంలో సానెట్లు రాశారు. దురుసుతనంతో, జాతి విద్వేషంతో రగులుతున్న కొందర్ని తెల్లకవుల కవిత్వం ప్రభావితం చేసింది. నీగ్రో భాష, ఆచారాలు, సంప్రదాయాలను అంటిపెట్టుకున్న కొందరు నల్ల కవులు తెల్లవారి ప్రభావంతో కొత్త భావ

చిత్రాలు, ప్రతీకలు, ఊహలు, మొదలైన ఆధునిక పరిణామా లను గమనిస్తూ మార్పును ఆహ్వానించారు. పునరుజ్జీవనానంతర కవులు కొందరు టి.ఎస్. ఇలియట్, హార్ట్ క్రేన్, ఎజ్రాపౌండ్ మొదలైన వారి టెక్నిక్‌నే సొంతం చేసుకుంటూనే జానపద కవితా సామగ్రిని ఉపయోగించుకుంటూ తమ కవిత్వాన్ని తెల్ల కవిత్వానికి సమాంతరంగా నిలిపారు.

1960 – 70లలోని కవులు – పునరుజ్జీవనానంతర కవుల కన్నా ముందు నిలిచే ప్రయత్నం చేశారు. క్రితం ఆదర్శంగా తీసుకున్న తెల్ల కవుల రీతుల్ని వీరు తిరస్కరించారు. తమ కవిత్వ అభివ్యక్తికి కొత్త మార్గాలను అన్వేషించారు. బాధ్యతాయుతమైన అధికారులే చట్టాన్ని అతిక్రమించడం, చట్టబద్ధమైన హత్యలు చేయడం మొదలైన సంఘటనల్ని చూసిన కవులు ఇలాంటి సమాజంతో మనం ఎందుకు కలిసి వుండాలి? అని తమను తాము ప్రశ్నించుకున్నారు. తెల్ల సమాజం నుండి వెలివేయబడటం, తెల్ల కవిత్వం నుండి, వాటి విలువల నుండి దూరం కావడానికి కారణభూతమైంది. అందుచేతనే జానపద సాహిత్యం వైపు, వీధుల్లోని జనసమూహం వైపు, జాజ్ సంగీతం వైపు, నీగ్రోల భాష వైపు నల్లకవులు దృష్టి సారించారు. దానివల్ల తమ మూలాలు తెలుసుకోవచ్చునన్న భావన కూడా అటువైపు మొగ్గడానికి కారణమైంది. తెల్లకవుల సాహిత్యం నుండి, విమర్శకుల నుండి పొందిన విముక్తి, ఒక కొత్త నల్ల సాహిత్యం – తమ సొంత సాహిత్యం – సృజించడానికి స్వేచ్ఛను ప్రసాదించింది.

అంత వరకూ వున్న భాషను మార్చడానికి, తమ సొంత భాష చుట్టూ కవిత్వాన్ని తిప్పడానికి పదాలలో అంతర్నిహితంగా వున్న అర్థాలను వెలుగులోకి తేవడానికి నల్లకవులు గొప్ప కృషి చేశారు. అంతవరకూ నీచమైనదిగా, అశ్లీలమైనదిగా (మురికి) భావింపబడుతున్న బ్లాక్ అన్న పదం ఈ గతి క్రమంలో సొగసైనది, సగర్వమైనది అన్న అర్థంలో ప్రయుక్తమైంది. ఈ పరిణామ క్రమంలో నల్లకవులు తమ విస్తృత జీవితానుభవాలకు అక్షర రూపం యిచ్చారు యీ సంకలనంలో.

దీనిలో ఫోక్ సెక్యులర్స్,

* * *

**పనిగట్టుకొని ఏడు వారాల సొమ్ములు అలంకరించు కున్న కవిత కాదు యిది. సన్నపోగారు పనితనం కూడా యిందులో లేదు. ఉన్నదల్లా కేవలం జీవితం. జీవితమే అన్నిటికీ ప్రమాణం అని నమ్మిన వాళ్ళు నీగ్రోలు. అందుకే కవిత్వంలో జీవించారు.**



* * *

స్పిరిచ్యువల్స్, లిటరరీ పొయెట్రీ – మళ్ళీ దీనిలో ఫోర్ రన్నర్స్, హార్లెమ్ రినైజాన్స్, పోస్ట్ రినైజాన్స్, ది నైన్టీన్ సిక్స్‌టీన్ అన్న అధ్యాయాలున్నాయి. వీటిలోంచి మచ్చుకు కొన్ని కవితల్ని పరిశీలించుదాం.

నిజమైన కవిత్వం అంటే ప్రజలకు చెందిన జానపద కవిత్వమే. నీగ్రోల జానపద కవిత్వ భాషలోని డిక్షన్, మాండలిక యాస, వ్యావహారిక సరళి, రైమ్, రిథమ్, ప్రాంతీయత, నేటివిటీ విలక్షణంగా వుంటాయి. జీవద్భాషలో రాసిన యీ కవిత్వం మౌఖిక సంప్రదాయానికి చెందింది. నేటి లిఖిత సంప్రదాయ సాహిత్య మూలాలు జానపద సాహిత్యంలోనే నిక్షిప్తమై వున్నాయి. అందుకే వారి జానపద సాహిత్యం నేటికీ సజీవంగా వుంది.

కవిత్వంలోకి వెళ్ళితే...

'మేం గోధుమలను పండిస్తాం. వాళ్ళు మాకు మొక్కజొన్న లిస్తారు. మేం రొట్టెలు కాలుస్తాం. వాళ్ళు మాకు మూడు చెక్కలు యిస్తారు. మేం తోలు వలిచి మాంసం యిస్తాం. వాళ్ళు మాకు తోళ్ళు యిస్తారు. మేం భోజనం సమకూరుస్తాం. వాళ్ళు మాకు పాచిపోయింది యిస్తారు. వాళ్ళు మమ్మల్ని చూసే విధానం యిది. మేం పాత్రల్ని శుభ్రం చేస్తాం. వాళ్ళు కాసింత సారాయి యిస్తారు. 'నిగ్గర్'కు ఆ మాత్రం చాలు అంటారు.' – ఫ్రెడరిక్ డగ్లస్ రాసిన 'వుయ్ రెయిజ్ ది వీట్' అన్న కవితలోని సారాంశం యిది.

పని గట్టుకొని ఏడు వారాల సొమ్ములు అలంకరించుకున్న కవిత కాదు యిది. సన్నపోగారు పనితనం కూడా యిందులో లేదు. ఉన్నదల్లా కేవలం జీవితం. జీవితమే అన్నిటికీ ప్రమాణం అని నమ్మిన వాళ్ళు నీగ్రోలు. అందుకే కవిత్వంలో జీవించారు.

'బ్లాక్ పోయెట్, వైట్ క్రిటిక్' అన్నది ఒక మినీ కవిత. డడ్లీ రండల్ రాశాడు. వాస్తవికతను ప్రతిబింబించే సాహిత్యాన్ని శ్వేతజాతి కాల్పనిక కవులు మెచ్చరు. విమర్శకులు ప్రోత్సహించరు. పైగా నీగ్రోలది తక్కువ స్థాయి కవిత్వమని యీసడిస్తారు.

'స్వాతంత్ర్యం, హత్యలు వంటి వివాదాస్పద అంశాల మీద కవిత్వం రాయొద్దని, సార్వజనీనమైన, సార్వకాలికమైన – మనిషి తల, గుర్రం శరీరం గల పురాణ జంతువులలాంటి ప్రతీకలతో కవిత్వం రాయండని ఒక విమర్శకుడు సలహా యిస్తాడు.' ఇదీ ఆ మినీ కవితలోని భావం. హాస్యాస్పదమైన యిలాంటి తప్పుడు సలహాలనిచ్చే విమర్శకుల్ని యీ సంకలనంలోని చాలామంది నల్లకవులు ఎండగట్టారు.

'స్వేచ్ఛా భూమి అని గొప్పలు చెప్పుకునే నీ అమెరికా – రక్తసిక్త, నేర, తప్పిదపు భూమి గురించి నేను పాట ఎత్తుకుంటాను. నీగ్రో భూమి నుండి అతణ్ణి ముక్కలు చేసి పారేసేందుకు అనేక ముఠాలు బయలుదేరాయి. అతని శ్రమను శోధించేందుకు బలప్రయోగం చేస్తున్నారు. అతని నెత్తురుతో తడిసిన పైర్లను చెరబట్టుతున్నారు. నియంత శిక్షాదండం ముందు భయంతో తలవంచవలసి వస్తున్నది. సమస్త మానవజాతికి వారసత్వంగా ప్రకృతి ప్రసాదించిన సమస్త హక్కుల్ని హరిస్తున్నారు. అల్పుడైన నియంత కనుసన్నలకు కట్టుబడవలసి వస్తున్నది' అంటూ అమెరికా పైశాచిక అణచివేతను 'ఫ్రమ్ అమెరికా' అన్న కవితలో జేమ్స్ ఎమ్. విట్‌ఫీల్డ్ తీవ్రంగా నిరసిస్తున్నాడు.

ఫ్రాన్సిస్ ఇ.డబ్ల్యు. హార్పర్ రాసిన 'ది స్లేవ్ ఆక్షన్' అన్న కవితలో బానిస వ్యాపారం ఎంత దుర్మార్గమైందో – బానిసలుగా అమ్మబడుతున్న ఆఫ్రికన్ల కన్నీటి గాథలు ఎంత దయనీయమైనవో బలంగా చిత్రీకరింపబడింది.

'వ్యాపారం మొదలైంది. రక్షణలేని తనంతో, వ్యథతో, నిస్పృహతో, వూపిరి కూడా

ఆడనివ్వని కన్నెపిల్లల ఏడ్పులు వారి మనోవేదనను, నిస్సహాయతను తెలియజేస్తున్నాయి. తమ ప్రియమైన సంతానం సంతలో పశువుల్లా అమ్ముడుబోవడం – ఆ పిల్లలు ఆపుకోలేక పెడుతున్న కేకలు – పిల్లల్ని బంగారానికి వస్తు మార్పిడి చేయడం – అన్నీ సజల నయనాలతో చూస్తున్నారు తల్లులు. భయాన్ని కప్పుకొని, నిజాయితీతో, నిండు ప్రేమతో తమ భర్తల వైపు కన్నార్పకుండా చూసే స్త్రీల మనోవేదనను ఎవరూ వర్ణించలేరు, చిత్రించలేరు. ఆ రంగును కలిగి వుండటమే నేరమై, అసహాయ స్థితిలో కుంగిపోతున్న పిల్లలతో – దుఃఖిత సమూహంలో కలిసిపోతున్నారు పురుషులు....” అంటూ కన్యలు, స్త్రీ పురుషులు, పిల్లలు ప్రాణంలేని మట్టిబొమ్మలుగా బానిస వ్యాపారంలో అమ్ముడుపోవడాన్ని హృదయవిదారకంగా చిత్రించాడు కవి.

‘బరీ మి ఇన్ ఫ్రీలాండ్’ అన్న కవిత కూడా యితనిదే. బానిసల వర్ణనాతీత బాధలను గొప్ప భావుకతతో రచించిన కవిత యిది. లోతైన మైదానంలో గానీ, ఎత్తయిన కొండ మీద గాని – “నువ్వు ఎక్కడ కోరుకుంటే అక్కడ నాకో సమాధిని నిర్మించు. కాని ఎక్కడ మనుషులు బానిసలై వుండో అక్కడ మాత్రమే నిర్మించు. వణికిపోతున్న బానిస పాదాల సవ్వడి వింటే మాత్రం నేను సమాధిలో ప్రశాంతంగా విశ్రాంతి తీసుకోలేను. నా నిశ్శబ్ద సమాధి మీద ఒక్క బానిస నీడ పడినా అది భయంకరమైన చీకటై ముసురుకుంటుంది. దుర్భర నిస్పృహతో ఒక తల్లి పెట్టే కేకలు గాలిలో శపించినట్టు వుంటుంది. ఆమె రక్తాన్ని తాగే భీతావహ కొరడా దెబ్బలు చూసినా – తల్లి గూటి నుండి దూరం చేయబడి వణికిపోతున్న పావురంలా – ఆమె రొమ్ము నుండి లాగి వేయబడిన పసిపాపను చూసినా నేను సమాధిలో నిదురించలేను. వేటకుక్కలకు ఎరగా వేయబడిన మనుషుల్ని చూసినా, పుండ్లతో రసి కారుతున్న శరీరాలకు సంకెళ్ళు తగిలించినా నేను వణికిపోతాను... బానిసలు లేని దేశంలో నన్ను సమాధి చేయండి” అంటూ అత్యంత విషాద సన్నివేశాలను గద్గద స్వరంతో వివరిస్తాడు కవి.

క్లాడ్ మెకే రాసిన ‘ఇఫ్ వుయ్ మస్ట్ డై’ అన్న కవిత స్వల్ప పరిమాణంలో వున్నా అనల్ప గుణం కలది. ‘మనం ఒకవేళ చావవలసి వస్తే వేటాడి అవమానకరంగా కొట్టంలో

***

**“నువ్వు ఎక్కడ కోరుకుంటే అక్కడ నాకో సమాధిని నిర్మించు. కాని ఎక్కడ మనుషులు బానిసలై వుండో అక్కడ మాత్రమే నిర్మించు. వణికిపోతున్న బానిస పాదాల సవ్వడి వింటే మాత్రం నేను సమాధిలో ప్రశాంతంగా విశ్రాంతి తీసుకోలేను. నా నిశ్శబ్ద సమాధి మీద ఒక్క బానిస నీడ పడినా అది భయంకరమైన చీకటై ముసురుకుంటుంది.**



***

వుంచబడిన పందుల్లా కాదు. మనం తప్పక చావవలసి వస్తే ఉన్నతంగా మరణిద్దాం. మన రక్తం వృథాగా స్రవించవద్దు. రాక్షసులనైనా సరే ధైర్యంగా ధిక్కరిద్దాం. చచ్చినా మనల్ని గౌరవించేట్టు బలవంతం చేద్దాం. వాళ్ళు వేయి దెబ్బలు కొడితే మనం ఒక్కటే – చావు దెబ్బ కొడదాం. తప్పకుండా మరణిద్దాం.... కాని పోరాడుతూ మరణిద్దాం’ అని నీగ్రోల ఆత్మగౌరవాన్ని యినుమడింపచేసే మంచి కవితను భావావేశంతో రాశాడు క్లాడ్ మెకే.

‘ది నీగ్రోస్ ట్రాజెడీ’ అన్న యింకో కవితలో... ‘నీగ్రో విషాదం నన్ను బరువైన ఇనుప సంకెళ్ళలా చుట్టుకుంటుంది. నేను నీగ్రో గాయాన్ని మాన్పాలని కోరుకుంటున్నాను. ఎందుకంటే అతని తీవ్రమైన నొప్పి నాకు మాత్రమే తెలుసు. కేవలం ముళ్ళ కిరీటం ధరించిన నీగ్రో మాత్రమే – శ్వేత జాతీయుడు కాదు – అతని సామర్థ్యం అర్థం చేసుకోగలడు. రాజనీతిజ్ఞులు, ప్రపంచమంతా చాలా బాగుంది అని మొత్తుకుంటున్నారు. నీగ్రో పకపకా నవ్వి వీళ్ళకు జ్ఞానం ప్రసాదించు ప్రభూ! అని దేవుణ్ణి ప్రార్థిస్తాడు...’ అంటూ నీగ్రోల విషాదాన్ని కంట తడిపెట్టించేట్టు అక్షరీకరించాడు మెకే.

‘వార్నింగ్’ అన్న లాంగ్‌స్టన్ హ్యూగ్ మినీ కవిత నీగ్రోల స్వభావాన్ని విప్పిచెప్పుతుంది. ‘నీగ్రోలు మధుర హృదయం గలవారు, నెమ్మదస్తులు, సాధు స్వభావం కలవారు. వినయ విధేయతలు కలవారు. కాని వాళ్ళు మనసు మార్చుకునే రోజు గురించి జాగ్రత్త!’ అని హెచ్చరిస్తాడు హ్యూగో.

అర్నా బోన్ టెంపస రాసిన ‘ఎ బ్లాక్ మనీ టాక్స్ ఆఫ్ రీపింగ్’ అన్నది సొగసైన శిల్పం గల కవిత... ‘నీటి పక్కనే నేను విత్తనాలు నాటాను. విత్తనాలను గాలి కాని, కోళ్ళు కాని తవ్వి పారేస్తాయన్న నా మనసులోని భయం వల్ల లోతుగా విత్తాను. ఉత్పత్తి సరిగా లేని యీ రుతువుకు వ్యతిరేకంగా భద్రంగా నాటాను. కెనడా నుండి మెక్సికో వరకు చాళ్ళలో విత్తనాలు వెదజల్లాను. నా చేతనైంది, నేను చూపెట్టదలచింది కోతలో చూపిస్తాను...

నేను ఏం నాటానో! పండ్ల తోటలు ఏం ఫలసాయమిచ్చాయో! నా సోదరులు, కుమారులు తొడిమలు, వేళ్ళు పోగు చేసుకుంటున్నారు. ఆశ్చర్యమేమిటంటే – నా చిన్నారి పిల్లలకు చేదు ఫలాలు తినిపించకపోయినా – వాళ్ళు విత్తనాలు నాటకపోయినా – చేలలో పరిగేరు కుంటున్నారు....’ అంటూ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం నీగ్రోలలో విప్లవ బీజాలు నాటడాన్ని ప్రతీకాత్మకంగా కవిత్వీకరించాడు హ్యూగ్.

‘అన్సెస్టర్’ అన్నది ఒక విశిష్ట కవిత. ఈ సంకలనం సంపాదకుడు డడ్లీ రండల్ దీన్ని రాశాడు. ‘మన పూర్వీకులు ఎల్లప్పుడూ రాజులుగానో, యువరాజులుగానో ఎందుకు భావింపబడ్డారు? వాళ్ళు సామాన్యులు కారు ఎందువల్ల? నా పూర్వీకుడు దొరలకు సంబంధించిన పందుల గుడిసెలలోని పందులను కాసేవాడు. పందులతో పాటు అతడూ బురదలోనే పడుకునేవాడు. అయినా సరే – గత వైభవ కాలపు జానపద కథల్లో మహారాజులనో, యువరాజులనో ఊహించుకున్నట్లు – నా పూర్వీకుడంటే నాకెంతో గర్వం’ అని కవి తన పూర్వీకుల అట్టడుగు జీవితాన్ని సిగ్గుపడకుండా, నిజాయితీగా, సగర్వంగా చెప్పుకుంటున్నాడు. ఎటువంటి భేషజమూ లేని, అతిశయమూ లేని ఆత్మాభిమానం ఎవరికైనా వన్నె తెస్తుంది.

‘మా విషాదం...’ నుండో మన విషాదం నుండో కవిత్వం పుడుతుంది తప్ప అస్పష్టత వల్లనో, అలంకారాల వల్లనో, వల్లమాలిన ప్రతీకల వల్లనో, వస్తువును మింగే శిల్పం వల్లనో కవిత్వం పుట్టదు. ఆ విషయాన్నే రే దరెమ్ తన కవిత ‘ఐ నో ఐయామ్ నాట్ సఫిషియెంట్లీ అబ్స్క్యూర్’లో బలంగా చెప్పాడు.

'విమర్శకుల్ని సంతోషపెట్టడానికి నేను తగిన 'అస్పష్ట' కవిని కాను. నిజాయితీ లేనివాణ్ణి కాను. ఊహలు నానుండి పారిపోతాయి. సామూహిక నరబలి మీద కప్పేందుకు సరసమైన, మృదు పదజాలం నా వద్ద లేదు. న్యాయ విచారణ లేకుండా శిక్షింపబడుతున్న వారికి పరిమళాలు వెదజల్లే పదాలంటే ఏమిటో తెలుస్తాయా? పాలిపోయిన, అలసిపోయిన, కలలుగనే, నాగరీకులైన కవులారా! రండి. కొద్దిపాటి డబ్బుల కోసం శ్వేత జాతీయుని ఇంట్లో నీగ్రో స్త్రీ పేగులు అవిసిపోయేట్టు శ్రమిస్తున్నది. ఒక నల్లని బాలుడు – మృత్యువుతో మరీ నల్లనైనవాడు – అతి శీతలమైన కొరియా బురదలో తలవాల్చి వున్నాడు. మీరు ఉత్సాహభరితమైన కుదుపుల నృత్యం చేసుకుంటూ రండి. ఆ బాలుడు ఎందుకు జీవించలేకపోయాడో వివరించండి. మీ విశిష్ట, అసంతృప్త పదాలతో ఆ విషాద మాధుర్యాన్ని కొంచెం దీర్ఘాలు తీస్తూ, కొంచెం మూలుగుతూ తిరగరాయండి. ఎక్కువ రాయొద్దు. తిరుగుబాటు అసలే వద్దు. విప్లవ కవులు రసాస్వాదన ఎరుగని వారు. మీరు మధురానుభూతులను మాత్రమే – చాలా క్లిష్టమైన వాటినే – పలవరిస్తారు. శిశిర రుతువులో చెట్టుమీంచి ఒక ఆకు వేలాడటాన్నే మీరు చూస్తారు. నేను మాత్రం అక్కడ ఒక శవాన్ని చూస్తాను' అంటూ సమకాలీన వాస్తవిక సమస్యల నుండి పారిపోయి కళ కళ కోసమే నంటూ కాల్పిన లోకాల్లో విహరిస్తూ, అలంకారాలని, శిల్ప మని, క్లిష్టాన్వయంతో అస్పష్ట కవిత్వం రాసే కవులకు వ్యంగ్యంతో చురుకంటిస్తున్నాడు రే డరెమ్.

గ్వెండలిన్ బ్రూక్స్ 'ది మదర్' అన్న కవితను అమ్మంత అమృత హృదయంతో రాసింది. 'నా పసి కూనల్లారా! ఈ అబార్షన్ వల్ల నేను మిమ్మల్ని మరచిపోవద్దు... మీరు జన్మ పొందకపోవడమన్న స్థితిని పొందడం మరచిపోకండి... ఈ గాలి గొంతులో చంపబడిన మీ స్వరాలు ఆలకిస్తున్నాను. నా స్తన్యం గ్రోలని ముద్దుల పాపల్ని తలచుకొని, కలత నుండి మనకబారిన కన్నీటితో తేరుకుంటున్నాను. ముద్దుల పాపలూ! ఒకవేళ నేను పాపం చేస్తే – మీ అదృష్టాన్ని, గమ్యం చేరని మీ అసంపూర్తి బతుకుల్ని నేను లాగిపారేస్తే – మీ పుటకలను, పేర్లను, బోసినవ్వుల్ని, మీ చిన్నారి కన్నీళ్ళను, మీ ఆటపాటలను, కృత్రిమ కాళ్ళను, మురిపాలను, మీ కోలాహలాన్ని, మీ పెళ్ళిళ్ళను, బాధలను, మరణాలను – నేను దొంగిలిస్తే, మీ తొలి శ్వాసను విషమయం చేస్తే – నన్ను నమ్మండి... నా అజాగ్రత్తలో కూడా నేను జాగ్రత్తపడ్డ తల్లిని!' అంటూ గర్భస్రావం చేయించుకున్న తల్లి మనసును ఆర్ద్రంగా ఆవిష్కరించింది బ్రూక్స్.

నవోమీ మడ్‌గెట్ మృదు స్వభావం గల మరొక కవయిత్రి. 'ది రేస్ క్వొశ్చన్' అన్న కవితను ఆమె మార్దవంగా, రసార్ద్రంగా రాసింది. 'నా కన్నీటి బిందువులను ముత్యాల్లా గుచ్చి నీ మెడలో అలంకరిస్తే నీకు సంతోషమేనా? పాత కార్ఖానాలో నా చేతులు అంతు లేకుండా శ్రమించడమే నీకు యిష్టమా? నువ్వు వీటినే కావాలని కోరుకుంటే గాఢంగా వరచుకుంటున్న నీడలో నిరీక్షించు. పిడుగును పట్టుకోవడానికి అప్రమత్తంగా వుండు. మొదట నీ అంతులేని డిమాండ్లను విసిరి పారేయ్. నీ ఆకలిని నా రక్తంతో తీర్చలేను. నా బాధల రత్నాలు పొదిగిన కిరీటంతో నీ నగ్నత్వాన్ని అలంకరించలేను' అంటూ శ్వేత జాతీయుల దుర్మార్గం పట్ల తనకున్న తిరస్కార భావాన్ని కవయిత్రి మెత్తగా, కవితాత్మకంగా తెలిపింది.

'ఇమాము అమీరి బరక' ది తీవ్ర స్వరం. 'బ్లాక్ ఆర్ట్' అన్న అతని కవితలో అది స్పష్టమవుతుంది. 'పండ్లలా, వృక్షాల్లా కవిత్వం ప్రయోజనకారి కాకపోతే అది ఉత్త చెత్త అవుతుంది. మేం రక్త మాంసాలున్న పదాలను కోరుకుంటున్నాం. నిన్ను నిన్నుగా ప్రేమించే కవితలు కావాలి. మల్లయోధునిలా శ్వాసించే కవులు కావాలి. తమ మెదళ్ళు ఎర్ర 'జెల్లీ'లై ఎలిజెబెత్ టైలర్ తొడల మధ్య అతుక్కుపోయే వ్యభిచారుల, సంకరజాతి వాళ్ళ మొహాల్ని తారుతో పూసే నల్ల కవితలు కావాలి.

రాజకీయ హత్యలు చేయగలిగే, తుపాకులు పేల్చగలిగే కవితలు కావాలి. చిట్టడవుల్ని గల్లీల సందులకు తెచ్చేందుకు పోరాడే కవితలు కావాలి. ఇటాలియన్లకు, యూరోపియన్లకు మాదక ద్రవ్యాలు అమ్మే కవిత్వం మానేయండి...

వేం నల్లకవిత కావాలని కోరుకుంటున్నాం. నల్ల ప్రపంచాన్ని కూడా. ఈ ప్రపంచం ఒక నల్ల కవిత కావాలి. నల్ల ప్రజలంతా మౌనంగా గానీ, బిగ్గరగా గానీ ఆ కవితను చదవాలి' అంటూ వీరావేశంతో తన కసిని యీ కవితలో ప్రదర్శించాడు ఇమాము. కవితలో అక్కడక్కడా కొన్ని పదాలు దిగంబరంగా కనిపిస్తాయి. అయితే శృంగారేచ్ఛతోనో, ఉల్లాసం కోసమో అశ్లీలం ఆ రాయలేదు కవి. తరతరాల తమ బానిసత్వం నుండి, క్రూరమైన అణచివేత నుండి పుట్టిన కోపాగ్ని నగ్న పదాలను ప్రజ్వలించింది.

ఈ సంకలనంలోని వైవిధ్య కవితల్లో నీగ్రోల అనుభవాలు, అనుభూతులు, ఆలోచనలు, జ్ఞాపకాలు, ఆశ నిరాశలు, కలలు, కష్టాలు, కన్నీళ్ళు, అలజడులు, ఆందోళనలు, అసంతృప్తి, అశాంతి, కసి, ప్రేమ, ద్వేషం, ఆగ్రహం – తమ జీవితంలోని సమస్త భావావేశాలు సమర్థవంతంగా, కవితాత్మకంగా ప్రతిఫలించాయి.

*

***

**వేం నల్లకవిత కావాలని కోరుకుంటున్నాం. నల్ల ప్రపంచాన్ని కూడా. ఈ ప్రపంచం ఒక నల్ల కవిత కావాలి. నల్ల ప్రజలంతా మౌనంగా గానీ, బిగ్గరగా గానీ ఆ కవితను చదవాలి' అంటూ వీరావేశంతో తన కసిని యీ కవితలో ప్రదర్శించాడు ఇమాము.**



***

# జ్ఞాపకం



**జి. విజయలక్ష్మి**

ఎన్నో పోగొట్టుకుంటా
ఎందర్నో పోగొట్టుకుంటాం
కొన్ని తెలిసీ
కొన్ని తెలీక
కొందర్ని బ్రతికుండగా మర్చిపోయి
మరణించినాక గుర్తు తెచ్చుకుని
ఏమీ తెలీనితనం నుంచి
అన్నీ తెల్సినతనం వరకు
విలువైనవీ, వెలకట్టలేనివీ
ఎన్నో పోగొట్టుకుంటాం
ఓ మంచి స్నేహం కోసం
శిరసు వంచి బరువుమోస్తాం
స్నేహాన్ని పునాది చేసి
నమ్మకపు భవనాన్ని కట్టుకుంటాం
నిష్కల్మషమైన ప్రేమను
నిజాయితీగా పెంచుకుంటాం
నాటకానికి జీవితానికి
తేడా తెలిసీ తెలీక
రంగస్థలంపై చప్పట్లు మోగుతాయి
కన్నీళ్ళు రాలతాయి
కరచాలనాలు వీడిపోతాయి
ఏది నిజం కాదో ఎంతకీ అర్థం కాదు
ఏదీ నిజం కాదనుకున్నపుడే
అన్నీ అర్థమవుతాయి
అంతా నిజమనుకున్నపుడే
ఏవీ అర్థంకావు
శరీరం ధ్వంసమవుతుంది
ఆత్మ అక్షరమవుతుంది
అనుబంధం అనుభూతమవుతుంది
కాలమనే అంధకారంలో
జ్ఞాపకం కాంతికిరణమవుతుంది
ఎన్నింటినో పోగొట్టుకుంటాం
ఎందర్నో పోగొట్టుకుంటాం
జ్ఞాపకాన్ని గుండె అరలో భద్రంగా దాచుకుంటాం

---

# దరఖాస్తు

**- కెంగార మోహన్**

పరుగెత్తే కాలంలో
అంతా కొత్తగా కనిపిస్తుంది
ఊహించినదీ ఆశించినదీ ఏదీ లేదు;
గ్లోబల్ సర్పం
గగనంలో కుబుసం వదిలి
విశ్వాన్ని కాలనాగై కాటేస్తుంది
మనిషి జీవితాన్ని
మార్కెట్ నియంతలా శాసిస్తోంది
యువత మెదళ్ళకు
ఆధునికత చెదలు పట్టింది
ఉరికొయ్యలు అన్నదాత
ఆఖరి అడ్రసులవుతున్నాయి
విజ్ఞానం వెర్రితలలు వేస్తూ కార్పొరేట్
విషకౌగిట్లో బందీ అయింది.
పంచభూతాలను మించి
ప్రపంచీకరణ
ఆరోభూతమైంది.
సామ్రాజ్యవాద పోకడలు
చరిత్రను నెత్తుటి
సిరాతో లిఖిస్తున్నాయి.
మనిషి ఊపిరి తీసే
పేటెంట్ కావాలని
పెత్తందారీ దేశాలు
దరఖాస్తు చేశాయి

# కలాన్ని మోసేవాడు



- గరిమెళ్ళ నాగేశ్వరరావు

"గజానికొక్క బ్రాందీ షాపు గాంధీగారి దేశంలో"
తిట్టుకుంటోన్నది తిలక్ అయ్యుండొచ్చు
"పదండి మందుకు.... పదండి తోసుకు...
పదండి పోదాం సందుల్లోకీ..."
పగిలిన సీసా చేతపట్టుకు తరుముతోన్నది
శ్రీశ్రీ కాకపోవచ్చు.

"దేహమును ప్రేమించుమన్నా
మంచియన్నది త్రుంచుమన్నా
ఒట్టి మాటలు దంచి కొట్టీ
ఓట్లనన్నీ కొల్లగొట్టోయ్..."
చెవులు గట్టిగా మూసుకు, నాలుకని
తెగనరుక్కుంటోన్నది కచ్చితంగా... గురజాడే!
కలం పట్టుకు కవన వనంలో తిరిగేందుకు ముందు
కవిమిత్రమా... కాస్త జాగ్రత్త!

ఇప్పుడు అడుగడుగునా పులిరాజాల కోసం
కండోముల తోరణాలతో వెలసిన స్వాగత ద్వారాలను
సిగ్గుపడుతూ దాటాల్సి రావచ్చు.
జీవాన్ని పీక్కు తింటోన్న గుంటనక్కల మధ్యలోంచి
సజీవచ్ఛవంలా నువ్వు నడవాల్సి రావచ్చు
వేలెంటైన్ని తిరిగి పుట్టించే వెర్రి యాతనలో
యవ్వనాన్ని విసిరేసుకుంటున్న గువ్వలజంట మధ్య నుంచి
గుట్టుగా తప్పుకోవటం తప్పకపోవచ్చు

ఇల్లూడ్చి అరిగిపోయిన చీపురుకట్టలా ఓ అమ్మ
తన వాళ్ళ కోసం వెలిగి వెలిగి సగం కాలిన క్రొవ్వొత్తిలా
ఓ నాన్న....
బిక్కుబిక్కుమంటూ దిక్కుమాలిన పక్షుల్లా
దిగులుపడే దృశ్యాన్ని చూడాల్సి రావచ్చు
పది రూపాయల కోసం పదకొండోసారి నలిగే
పాడు దేహం... నీ గుండెని నిలువునా పిండేయవచ్చు.
నువ్వు గొంతెత్తి గట్టిగా పిలిచినా
పలికేందుకెవ్వరూ... లేరిక్కడ...
ఇల్లాళ్ళనందరినీ ఛానెళ్ల తాళ్లేసి
ఇంటింటా ఇడియట్ బాక్సులకి కట్టిపడేశారు
అశ్లీల రసగుళికలందిస్తూ యువతరాన్ని
నిర్వీర్యం చేసే పని నిర్విఘ్నంగా సాగిపోతోంది
మేధావులు మెదడుకి రెండు రెక్కల నతుక్కొని
వలని ప్రేమించే వలస పిట్టలై ఎగిరిపోయారు

కొంచెం కన్నీళ్ళు...
ఇంకొంచెం కష్టాలు...
కొన్ని నిష్టూరాలూ...
మరికొన్ని ఆర్తనాదాలూ...
కట్టకట్టుకు నీ వెంటపడటం తప్పకపోవచ్చు
నీలాంటివాడినే... నిజం నాకు తెలుసు.
గుండె లోపల నిత్యం సుడి గుండాలు రగులుతున్నా
కెరటాల చేతులు చాచి కేరింతలు కొట్టేందుకు
నేను సాగరాన్ని కానుకదా?
ఒక్క కన్నీటి చుక్కకే కదిలిపోయి
వెల్లువెత్తే అప్రతిహత అక్షర ప్రవాహాన్ని
నిజాన్ని నిజమనీ...
అబద్దాన్ని నిజంగా అబద్ధమనీ...
వెల్లడించాల్సిన కలం కదలికలో
కనిపించని ప్రతిబంధమేదో అడ్డుపడ్డపుడల్లా
గర్భస్థ మృతశిశువుని మోస్తోన్న తల్లిలా
తల్లడిల్లిన కలం సిరా అశృవులను స్రవిస్తుంది
అసంతృప్తిని సహనంతో దహనం చేసేందుకు శ్రమించినా
అంతరంగం లోపల కొలువు తీరిన న్యాయస్థానం
దోషిగా నిలబెట్టి నిలువునా నిలదీస్తుంది
చైతన్యం గొంతు నొక్కిన నేరానికి
మరణశిక్షని మించిన నరకయాతనని
యావజ్జీవం...విధిస్తుంది.
మిత్రమా... కలాన్ని మోయడం
కాలాన్ని మోసినంత సులువు కాదు... నిజం!!

# తృష్ణ

- జ్వాలాముఖి



ఘటానికో మఠం
మఠానికో పీఠం
పీఠానికో శఠగోపం
అనేది ఆధ్యాత్మిక పాఠం

జీవాత్మకూ పరమాత్మకూ
వితండ విభేదం ద్వైతం
పరమాత్మకూ జీవాత్మకూ
అఖండ అభేదం అద్వైతం

పరమాత్మ మౌనం అర్థాంగీకారం
జీవాత్మ ఎప్పుడూ పరాధీనం
అంతా జగన్నాటక కల్లోలం
నాంది లేదు ప్రస్తావన రాదు

వికృత విష్కంభంలో రుద్రాక్ష పిల్లి
అంతా మాయ అతీత ఛాయ
భజగోవిందం భజగోవిందం మూఢమతే
నహి నహి రక్షతి కాషాయాంబర భాషా వేషం
ఆశ్రమ వాసం మాయామర్మం విశేషం సశేషం
కలిసి వచ్చిన కంచి గరుడ సేవ అస్త్ర నైవేద్యం

దుఃఖానికి మూలం మాంసల తృష్ణ
తృష్ణకు హేతువు జీవనతత్వం
తత్వ విహారం పరకాయ ప్రవేశం
కామకోటి లీల అగాధం జగన్నాథం

సన్యాసి సుఖి సంసారి దుఃఖి
ఇహ సంసారే బహుదుస్తారే
పాహి మురారే కాషాయ వికారే
భజగోవిందం భజమూఢమతే

---

# ఘోష



సాగుతూ సాగుతున్న నావమీద
ఏకాంత ప్రళయం
గతులు తప్పిన రాత్రుల్నిండా
నిద్రపోనివ్వని పీడకలలు
ఎప్పటెప్పటివో పేగుల్ని మెలితిప్పే జ్ఞాపకాలు
సాగిపోతున్న కాలం ఆగిపోతున్న దిగ్భ్రాంతి
తెగిపోతున్న బంధాను బంధాల మధ్య
ఎదుగుతున్న సుడిగుండాలు
పరిమళం వీడిన పుష్పం
పనికిరాని తోవ
చెదబట్టిన నావ
అర్థంలేని గమ్యం
క్షణక్షణమూ చెవుల రింగుమని
మార్మోగుతున్న మృత్యుఘోష
నిజం నిర్ధారించబడ్డ రాత్రిలో
తరిగిపోతున్న నిండు చందమామ
రోజురోజుకీ చెరిగిపోతున్న వెన్నెల

దగ్గరవుతున్న అమావాస్య
బతుకు బండిపై
వొదులుకోలేని వాత్సల్యం
సాయం సంధ్య చీకటిలో
తెలిసీ తెలియని వెతుకులాట
కాలం చుట్టూ ఎవరో అల్లిన మాయ వల
మూసిన కన్నుల్లోంచి
శాస్త్రాస్త్రాలతో దూసుకుపోతున్న శత్రువులు
ఏడుపులూ పెడబొబ్బల్తో
ఎంతకీ తరగని కాలం
కలల్నిండా చీకటి అంతర్భాగాలు
అంతు తెలియని అగాధాలు
నరాల్నిండా ఉత్కంఠ
డప్పులు మోగిస్తున్న శ్మశానంలో
ఎవరు రాస్తారిలా
చిరునామాలు తలక్రిందులుగా...

**(మృత్యువు ముందు నిర్ధారించబడిన అభాగ్యుల కోసం)**

**- మంచికంటి**



# ఒక విధ్వంసక సంస్కృతి - అనేక సంస్కృతుల విధ్వంసం

నిన్ను చూసి సిగ్గుపడుతున్నాను -
నీ చరిత్రని చూసి సిగ్గుపడుతున్నాను -
నిజం చెప్పిన వాళ్ళని నిర్జించగలంగాని
నిజాన్ని నిర్జించలేమన్న నిజం తెలుసుకోలేని
నీ మూర్ఖత్వానికి సిగ్గుపడుతున్నాను -
విధ్వంసంలో పుట్టిన నీకు విధ్వంసం తప్ప
విషయమేమీ అర్థం కాదు గదా!
వేలాది రెడ్ ఇండియన్ల ఊచకోతలో ఊపిరి పోసుకున్న విశృంఖల
విధ్వంసక జననం కదా!
లక్షలాది ఆఫ్రికన్ బానిసల స్వేద బిందువుల్తో
శ్వేత సౌధాల్ని నిర్మించుకున్న అరాచక సంస్కృతి కదా!
మానవ సంస్కృతి పురుడు పోసుకున్న
మెసపుటోమియా నేలకు
విశ్వమానవ సౌభ్రాతృత్వ బౌద్ధ సంస్కృతి జీవగడ్డ
సింధులోయకు
సంస్కృతి నేర్పుతున్నానని ప్రగల్భాలు పలుకుతున్న
నీ మూర్ఖత్వానికి సిగ్గుపడ్తున్నాను -
హిరోషిమా, నాగసాకి
చిలీ గ్రెనెడా లావోస్ కాంబోడియా కొసావో
క్యూబా వియత్నాం ఆఫ్ఘనిస్తాన్
ఎన్నెన్ని దేశాల చిత్రపటాల మీద రక్తపు కళ్లాపి చల్లావు -
ఎన్నెన్ని దేశాల ప్రజల రక్తమాంసాల్ని
డాలర్లుగా వొల్చుకున్నావు
నీ అమానవీయ ప్రపంచ గూండాగిరీకి అసహ్యపడ్తున్నాను -
హాలీవుడ్ జేమ్స్‌బాండ్ కథలెన్నయినా చెప్పు
అధినేత అహంకారనో
ఆయుధాలు దాచాడనో
కారణాలేమైనా చెప్పు
కథ చమురుదేనని మనకు తెలుసు -
ఇరాకీ గాలం మీద నీ డాలర్ చేప
గిలగిల్లాడుతున్నందుకేనని తెలుసు -
సద్దాం మీద నువ్వు చేస్తున్న యుద్ధానికి ఆగ్రహిస్తున్నాను -
రాజులు హితమైనారు
రాజ్యాలు పతనమైనవి
అలెగ్జాండర్ హిట్లర్ ముస్సోలీలవని
చరిత్ర చెత్త కుప్పల్లో విసిరేసింది
ఇప్పుడు చరిత్రని చూసి గర్వపడ్తున్నాను -
ప్రపంచ ప్రజల చరిత్రని చూసి గర్వపడ్తున్నాను -
వెన్నెముకల్లేని తాబేదారు ప్రభుత్వాల మెడలు వంచి
వర్తమాన చరిత్ర చత్రం మీద నిటారుగా నిలబడ్డ ప్రజల చేతుల్లో
ప్రపంచ పోలీసు పతనపు భవిష్యత్ దృశ్యాన్ని చూసి గర్వపడ్తున్నాను

**- డాక్టర్ కె. లింగారెడ్డి.**

---

# ఆమె కథ



వాళ్లిద్దరూ
ప్రేమైక జంట
వారిది అన్యోన్య దాంపత్యం
అవును మరి-
అతడు అనుమతించిన వనాల్లోనే
విరబూసి పరిమళించే పూదోట ఆమె
అతడు స్వరపరిచిన బాణీలోనే
రాగమాధురి ఆలపించే కోకిల ఆమె
అతడి కనుసన్నల సీమలలోనే
నర్తించే కదలికల మయూరి ఆమె
అతడు తూచిన కొలమానాల మేరకు
ప్రసరించే ప్రేమానురాగం ఆమెది
ఆమె ప్రపంచమంతా అతనొక్కడే
ఇదంతా
అనివార్యంగా అనితరంగా సాగితేనే
వాళ్ళిద్దరూ ఓ ఆదర్శజంట
నిజంగా -
అతడి హృదయ వైశాల్యమెంతో
ఆమె కన్నా బాగా
మరింకెవరికి తెల్సు!
జీవితమంతా
అతడిచ్చిన ఓ పదెకరాల పరిధిలోనే
ఆమె బ్రతుకు వ్యవసాయం
ఇది ఒక్క 'ఆమె' కథ కాదు
ఎందరో 'ఆమె'ల కథ

**- హిమజ**

# ఒకే పంట

**చిమ్మ చీకటి**

ఆ చీకట్లో అతను మురిక్కాలవ వంతెన దగ్గరే గంటల తరబడి దాగి ఉన్నాడు. మురికి నీటిలో అతని ధోవతి అంచు తడుస్తోంది. చెప్పులు తీసి తన దగ్గరున్న తాడుతో నడుంకి కట్టుకున్నాడు. పాదాలంతా మురికి, మట్టిమయం. దగ్గర్లోని గోధుమ పంట నుంచి వస్తున్న గోధుమాసన అతన్ని కట్టిపడేస్తోంది.

## గుల్జార్



ఆ పంటలే అతన్ని పెంచాయి. అతను, అతని తోటివారూ పంటలు పండించారు. "ఈ పంటలు వేసింది మేము. నీరు పెట్టింది మేము. రక్తం ధారపోశాం. కానీ వాటిని ఠాకూర్ ఒక్కటే వేయించుకు తింటున్నాడు. మేమెలా భరిస్తాం." అతని మాటలు తోటి రైతుల్ని ఎంతగా ఆవేశపర్చాయో బాగా గుర్తుంది. నగరంలో కార్మిక నాయకునిగా అతనెలా మాట్లాడిందీ బాగా గుర్తు.

నగరంలో ఆ కార్మిక నాయకునికి అతన్ని వాళ్ళన్నయ్యే పరిచయం చేశాడు. "నువ్వొక్కడివీ ఏమీ సాధించలేవు. ఇతరులను నీ దారంట తేలేకపోతే జమిందారు గోధుమ కంకి కాల్చుకుతిన్నట్లు నిన్నూ తినేస్తాడు. అంచేత రైతులందర్నీ కూడగట్టుకో. అప్పుడే నీ భూమిని దక్కించుకోగలుగుతావు. అసలు జమిందారీ విధానం పోయి చాలాకాలమైంది." హితబోధ చేశాడు. "కానీ ఈ విషయాలన్నీ వాళ్ళకు ఎలా వివరించాలి. నువ్వయితే చట్టం గురించి వాళ్ళకు వివరించగలుగుతావు. నా అవసరం ఉందనిపిస్తే తెలియజేయి. నా పర్యటనలో మీ వూరు వైపుగానే వెళ్తోంటాను. అతని అన్న కూడా సహాయంగా ఉంటానన్నాడు. అతని తండ్రి గనుక భూమిని కౌలుకి ఇవ్వకుండా ఉంటే ఇలా నగరంలో మిల్లులో పనిచేయాల్సి వచ్చేది కాదన్నాడు. "ఈ భూమిని సాధించనీ, మళ్లీ మన పల్లెకే తిరిగి వచ్చేస్తాను" అని అన్న హామీ ఇచ్చాడు. అదే ఉత్సాహం, అదే ఊపుతో అతను పల్లెకు తిరిగి వచ్చాడు. అందరితో మాట్లాడటం, చర్చించడం మొదలుపెట్టాడు. ఒక యూనియన్ ఒక పార్టీ అవసరమని, అందరికీ నచ్చచెప్పాడు. అతని సంభాషణ ఊళ్ళో ఎందర్నో దగ్గరికి చేర్చింది. ఎంతో ఉత్సాహంతో విన్నారు. కానీ అదంతా అతని ఎదుటనే... ఒక్కసారి అతను వెనుదిరిగి వెళ్ళగానే అంతా మళ్లీ భయాందోళనల్లో పడి పిరికితనంతో పనుల్లోకి వెళ్ళేవారు. ఒకటి, రెండుసార్లయితే తోటి రైతుల ముందే తన్నారు. ఒకసారి ఏకంగా చెట్టుకి తలకిందులుగా వేలాడగట్టి చింతబరికెతో వీపు చిట్లగొట్టారు. అతన్ని అసలా మార్గాన్నే వదిలేయమని భార్యాపిల్లలూ ప్రాధేయపడ్డారు. కానీ అతను స్థిరచిత్తంతో తన పంథాలోనే కొనసాగాడు. అతని కార్యక్రమాలు ఆ ఒక్క గ్రామానికే పరిమితం కాలేదు. చుట్టుప్రక్కల

గ్రామాల్లో రైతాంగాన్ని ఆలోచింపచేశాయి. అతను ఎక్కడ సభ పెట్టినా తండోపతండాలుగా జనం రావడం మొదలైంది. కానీ వెనుతిరగ్గానే అంతా పిరికివాళ్ళలా మళ్ళీ అదే పనుల్లోకి వెళ్ళే వారు. చొక్కా జేబులో ఒక హిందీ దినపత్రికను మడతపెట్టుకోవడం అతని ఓ ప్రత్యేకతగా మారింది. తమ పోరాటంలో తాము ఒంటరి కాదని రైతాంగానికి ప్రబోధించేవాడు. "మన హక్కుల కోసం, ఒక రాజకీయ పార్టీ కూడా ఉద్యమిస్తోంది భయపడకండి."

మురికి కాలవ దగ్గర వాసన భరించలేక అతను అపుడపుడూ కొద్దిగా రోడ్డు మీదకు వచ్చి పైరుగాలిని గుండెల నిండా పీల్చుకుంటున్నాడు. పట్టణం వెళ్ళగానే ముందు పాండేజీని కలవాలని అనుకున్నాడు. పట్టణంలో తన అన్న అడ్రస్‌తో పాండేజీకి ఉత్తరం కూడా రాశాడు. కొన్ని నెలల తర్వాత అతని అన్న దగ్గర్నుండీ సమాధానం వచ్చింది. పాండేజీ ఊళ్ళో లేడని రాగానే అతనికి ఆ ఉత్తరం అందజేస్తానని, పాండేజీ తన పర్యటనలో తన గ్రామానికి వస్తాడని భావించాడు. అలాగని గ్రామంలో అందరికీ చెప్పాడు. "అందరూ సిద్ధంకండి. పాండేజీ రాగానే కూడలి దగ్గర సమావేశం జరుగుతుంది. అపుడు చూస్తారు ఠాకూర్ హర్నామ్ సింగ్ గతి ఏమవుతుందో! పాండేజీ పోరాటాన్నే కాదు, న్యాయసంబంధ విషయాల్నీ చర్చిస్తారు. అయితే ఆ సమావేశానికి పనివాళ్ళు వాళ్ళంతట వాళ్లుగా వెళ్లడానికి నిశ్చయించుకొనకపోయినా ఆ విషయాన్ని చర్చించుకోవడంలో తప్పులేదని మాత్రం నమ్మారు. అదీ చాలా రహస్యంగా మాట్లాడుకున్నారు.



పాండేజీ చాలా ఆలస్యంగా వస్తారని తెలిసింది. ఈ వార్త ఠాకూర్‌కి ఎవరు చేరవేశారో భగవంతుడికే తెలియాలి. ఫలితం ఏమంటే అతన్ని పొల్లాల్లోనే పట్టుకుని ఠాకూర్ ఎదుటే నిలబెట్టారు. నాయకుడి పేరు చెప్పగానే ఠాకూర్‌కి వళ్లు మండింది. అంతే వెర్రి కోపంతో చెప్పు తీసి మొహం పగలగొట్టాడు.

"కమ్యూనిస్టు సాలా! వెళ్ళి నోరెత్తకుండా పొలం పనిచేయి. లేకపోతే నీ ఇల్లూ, భూమీ నీకు దక్కదు జాగ్రత్త!" ఈ హెచ్చరికలు అతన్ని తన పంథా నుండి తప్పించలేదు.

ఒకరోజు లోకూ కూతుర్ని ఠాకూర్ కొడుకు అవమానించాడు. హవేలీకి వెళ్ళి ఠాకూర్‌తో ఆమె తండ్రి గోడుపెట్టుకోను ఒక్కరు తోడు రాలేదు. కానీ లోకూ తండ్రి తనని రమ్మనమని చూడగానే హవేలీకి లోకూతో అతను బయలుదేరాడు. అక్కడికి లోకూతో వెళ్ళినతన్ని చొక్కా పట్టుకుని "వీళ్ళు నీకేమైనా చుట్టాలా... సాలే! మళ్ళీ కనిపించావో కాళ్ళు చేతులు నరికేస్తా... వెళ్ళు, నీ మొహం నాకు చూపించకు" అంటూనే బలంగా అతని డొక్కల్లో కాలితో తన్నాడు. అంతే... అతను మెట్ల మీంచి దొర్లి దొర్లి బాధతో లుంగజుట్టుకుపోయాడు. చివరికి లోకూయే అతన్ని ఎలాగో ఇంటికి తీసుకురాగలిగాడు.

ఈ సంఘటనతో లోకూ కొడుకులు ఇద్దరూ ఠాకూర్ దగ్గర పనికి వెళ్ళడం మానేశారు. తిరుగుబాటుకి సమయం ఆసన్నమైంది. ఇక ఇప్పుడు అతను ఒంటరి కాదు. మరో ఇద్దరి మద్దతూ లభించింది. ముగ్గురు సభ్యులతో ఒక కూటమి ఏర్పాటయింది.

మానభంగానికి గురైన మూడవరోజునే లోకూ కూతురు ఊరు బావిలో దూకి ఆత్మహత్య చేసుకుంది. ఈ సంఘటన ఆ గ్రామ ప్రజల్ని వణికించింది. ఇలాంటి సంఘటనలు గతంలోనూ ప్రజల్ని భయభ్రాంతులకి గురిచేశాయి. కానీ ప్రతీ పర్యాయం కూలీలు చలిమంట కాచుకుంటూ వారిలో వారు చర్చించుకుని మండిపడ్డారే కానీ ఏమీ చేయలేకపోయారు. ఈ పర్యాయం ఇరవై మంది దివిటీలతో ఆ రాత్రి హవేలీ ముందు చేరారు. 'హర్నాంసింగ్ ముర్దాబాద్' అంటూ గట్టిగా నినాదాలు చేశారు. కానీ హవేలీ నుంచి ఎలాంటి ప్రతిస్పందనా లేదు. నినాదాలు వినగానే ఠాకూర్ తుపాకీ పట్టి మేడపైకిగానీ వరండాలోకి గానీ వస్తాడని అంతా అనుకున్నారు. కానీ అలా జరగలేదు. తమ రాకకీ, నినాదాలకీ భయపడ్డాడనీ వాళ్లంతా భావించారు. తెల్లారే వరకు అదే ధైర్యంతో వున్నారు. కానీ ఎండెక్కగానే పోలీసులు వచ్చారు. అంతే వీళ్లు నీరసించారు. పోలీసులు అతన్ని ఒక్కడినే పట్టుకెళ్ళారు. ప్రశ్నించాలని చెబుతూ చచ్చేట్టు కొట్టారు. అతను మాత్రం మరెవరి పేరూ బయటపెట్టలేదు. 'ఈ సంఘటనలో గ్రామస్తులు అంతా వున్నారు. అందర్నీ అరెస్టు చేయండి' అనే అన్నాడు.

అతన్ని పది రోజుల పాటు లాకప్‌లో పెట్టారు. ఆ పదిరోజుల్లో అతని ధైర్యసాహసాలు చుట్టుప్రక్కల గ్రామాల్లో వ్యాపించాయి. పదిరోజుల తర్వాత అతన్ని వదిలేశారు. అతను గ్రామానికి తిరిగి వచ్చాడు. అతని ఇల్లు కూలిపోయింది. భూమి అతనిది కాకుండా పోయిందనీ తెలిసింది. అయితే అదంతా బందిపోటు దాస్‌సింగ్ ముఠా చేసినట్లు పోలీస్ స్టేషన్‌లో రిపోర్టు ఇచ్చినట్లు తెలిసింది. అతని భార్యాపిల్లలు హరిదాస్ ఇంట్లో తలదాచుకుని తర్వాత గుట్టుచప్పుడు కాకుండా నగరంలో తన అన్న దగ్గరికి వెళ్ళారనీ తెలుసుకున్నాడు.

అతను గ్రామంలోకి వచ్చిన రాత్రే ఇల్లు తగలబెట్టారు. చీకటి మాటున అతను మూడు కోసులు నడిచాడు. నెమ్మదిగా రైల్వే స్టేషన్ చేరాడు. అక్కడ అతని కోసం ఠాకూర్ మనుషులు వుండటం గమనించాడు. వాళ్ళ కన్నుగప్పి రైల్వే పట్టాల అవతలగా వున్న మురికి కాలవ గట్టునే పరుగెట్టి, పరుగెట్టి ఆఖరికి ఈ వంతెన చేరి దాని మాటున దాగాడు. అర్ధరాత్రి ఇటుగా వెళ్లే గూడ్సు రైలు ఈ వంతెన దగ్గర కాస్త నెమ్మదిగా వెళ్తుందని తెలుసు అతనికి.

రైలు వస్తున్న శబ్దం వినగానే వంతెన కింద నుంచీ లేచి పైకి వచ్చాడు. దూరంగా వస్తున్న రైలు ఒక పెట్టి తలుపుల్లేకుండా వుండటం గమనించాడు. దగ్గరికి రాగానే ఆ పెట్టి ఇనప ఊచని పట్టి వేలాడాడు. మరుక్షణం అతను ఆ పెట్టెలోకి దూకగలిగాడు. అలా పెట్టెలోకి పడగానే అతని పక్కటెముకలు విరిగేలా తుపాకి మడమ తగిలింది.

"సాలె... ఎవడ్రా నువ్వు. ఈ పెట్టెలోకి ఎలా వచ్చావ్?"

"గూఢచారివా?... పోలీస్ కుక్కవా?" అడిగాడు మరొకడు.

వాళ్లెవరో ప్రత్యేకించి చెప్పక్కర్లేదు. ఆ ప్రాంతం బందిపోట్ల రాజ్యమని అందరికీ తెలిసిందే. అతను వాళ్ళని కళ్లారా చూడటం ఇప్పుడే.

"నేను బీద ప్రయాణికుడిని, టిక్కెట్టు లేదు. నగరం చేరాలి."

అతను నిజమే చెబుతున్నాడని గ్రహించి నాయకుడు ఒక తుపాకీని అతని నుంచీ తొలగించాడు. ఒకల్లిద్దరు అదే పెట్టెలో ఒక మూల కల్లు తాగుతున్నారు. నాయకుడు అతని దగ్గరికి వచ్చి పరిశీలనగా చూశాడు. ఒక్కక్షణం తర్వాత "చాలా నీరసంగా, అలిసిపోయినట్టున్నావు. తినడానికేమైనా వుందా?" అని అడిగాడు.

అతని దగ్గర్నుండి సమాధానం రాలేదు. మరో నిమిషం ఆగి.

"ఇలారా... ఇక్కడ సర్దార్ దగ్గరగా కూచో" అని గద్దించాడు.

భయం భయంగా చూశాడు. నెమ్మదిగా అవతలికి కదిలాడు. లేచి నుంచోవడానికి ఓపికలేనంత నీరసంగా వున్నాడు. తువ్వాలుతో చుట్టిన మూట సర్దార్ అతనికి చూపించాడు. దాన్నుంచి వస్తున్న మంచి వాసన అతన్ని ఆకట్టుకుంది.

"ఇందులో పరోటాలు, చట్నీ వున్నాయ్...రా... తిను" ఆదేశించాడు సర్దార్.

సర్దార్ కొంత శాంతంగా చూసి నెమ్మదిగా మాట్లాడాడు అతనితో. ఆ మూటని అందుకున్నాడు. చేతులు ఒణుకుతున్నాయి. పరోటాలు చల్లగా వున్నాయి కానీ ఇపుడే చేసినట్టున్నాయి. అతను నెమ్మదిగా ఒకటి తిన్నాడు. కాస్త ఆకలి తీరి, ఓపిక వస్తున్నట్లు అనిపించింది. అది గమనించి సర్దార్

"తిను. ఇంకా వున్నాయి... పచ్చడి నంచుకో..." పరోటాలు అందించాడు.

రైఫిల్‌తో అవతలగా వున్న ఓ బందిపోటు దగ్గర కొన్ని ఉల్లిపాయలు ఉన్నాయి. సర్దార్ అతన్ని చూపించి.

"వెళ్ళి ఉల్లిపాయలు తెచ్చుకో... ఇందులో బాగుంటుంది" అన్నాడు.

అతనికి కొంచెం భయం పోయింది. ధైర్యంగా తినడం మొదలెట్టాడు.

"ఇపుడు చెప్పు. నిజంగా ఎక్కడికి వెళ్తున్నావో?" సర్దార్ ప్రశ్నించాడు.

"షిండోరా... అక్కడ నుంచీ బస్సు పట్టుకుంటాను."

"పిచ్చోడిలా వున్నావ్. షిండోరాకి చేరేనరికి మధ్యాహ్నమవుతుంది." అన్నాడు సర్దార్ అనుమానంగా చూస్తూ.

"సరే.. నువ్వు ఎక్కడి నుండి వస్తున్నావ్? ... ఈ జిల్లా గ్రామం నుంచేనా?" అడిగాడు.

అతను తింటూ అవునన్నట్లు తలూపాడు.

"ఎపుడన్నా సర్దార్ దాస్‌సింగ్ పేరు విన్నావా?" ఒకడు అడిగాడు.

అతను ఆశ్చర్యపడి తినడం ఆపి

"దాస్ సింగ్! బందిపోటేనా?!" అడిగాడు.

"ఆ.. అదే నేనడిగింది" అతనికి దగ్గరగా కూర్చున్న మరో బందిపోటు అన్నాడు.

"అతన్ని పట్టిస్తే యాభైవేల రూపాయల బహుమతి ఇస్తామని ప్రకటనలూ వున్నాయి" ఈసారి సర్దారే అతనితో చెప్పడం మొదలెట్టాడు.

"నేను నీ గ్రామానికి చెందినవాడినే. నా కూతుర్ని ఇప్పటి ఠాకూర్ తండ్రి నా ఎదుటే మానభంగం చేశాడు."

కొంతసేపు అంతా మౌనంగా వుండిపోయారు.

"వాడి ఇంట్లో జొరబడి గొడ్డలితో తల నరికాను" అంటూ సర్దార్ కోపంతో కసిగా ఉమ్మేశాడు. "మళ్లీ ఇపుడు వాడి కొడుకులు అదే దారిలో వున్నారట. మాతో ఎవరో చెప్పారు. ధనిరామ్ అనేవాడు మరికొందరు అతనిపై పగ దీర్చుకోనున్నారట." సర్దార్ మళ్ళీ ఉమ్మేశాడు. అతనికి ఠాకూర్ కుటుంబంపై వున్న ద్వేషం చల్లారలేదు. ఇంకా ఇలా చెప్పాడు.

"వాడొక్కడే కలిసి నినాదాలతో పగ ఎలా తీర్చుకుంటాడు. పిరికి వెధవ. నాలా ధైర్యంగా చేయెత్తాలి. పిరికిపంద. వాడి వల్ల ఏమీ కాదు. పైగా చట్టాన్నే మారుస్తాడట. అంత సులభమా!"

రైలు ఒక చోట వేగం తగ్గనారంభించింది. సర్దార్ లేచి నుంచున్నాడు.

"ఏయ్... తిన్నంత తిని మిగతావి పారేయ్... మా గురించి ఎవరికైనా చెప్పావో... జాగ్రత్త" అని హెచ్చరించాడు.

"మనం పెద్ద వంతెన దగ్గరికి చేరుతున్నాం... సిద్ధంకండి..." అంటూ ముఠాని హెచ్చరించాడు సర్దార్.

రైల్లోంచి దూకబోతూ సర్దార్ అతని మరోసారి హెచ్చరించాడు.

మొదటిసారిగా ధనిరామ్ ధైర్యంగా నిలవగలిగాడు. లేచి నుంచున్నాడు.

"నువ్వేం ఆలోచించకు సర్దార్... నువ్వు నా గ్రామానికి చెందిన వాడివే. మనం ఒక పంట పెంచి తిన్నవాళ్లమే"... అన్నాడు ధనిరామ్.

మరో నిమిషంలో అతని తోటి ముగ్గురూ రైల్లోంచి దూకారు. రైలు కదిలిపోతుంది. వాళ్లు చీకటిలోకి పారిపోయారు. చీకట్లో దూసుకుపోతున్న రైల్లో తలుపుల్లేని ఆ పెట్టెలోంచి ధనిరామ్ ఆ చీకట్లోకి చూస్తుండిపోయాడు.

**స్వేచ్ఛానువాదం : టి. లలితప్రసాద్**

# "నక్షత్రాలు"

- ఎ.ఎ. నాగేంద్ర



కలాన్ని పట్టా
కాగితంపై
అక్షరాలు నక్షత్రాలై
మెరిశాయి

దించి
వెళ్ళిపోయింది
నిన్నటి కాలం
జ్ఞాపకాల్ని

కరువు
వెంటపడింది
వర్షాన్ని పిలిచా
పారిపోయింది

నిన్న వున్న వ్యక్తి
నేడు అదృశ్యం
నిరంతరం వుండనీదు
ఎవరినీ ప్రకృతి

స్వారీ చేస్తున్నాయి
పుస్తకాలు
పిల్లల వీపుపై ఎక్కి

కలం
ఆలోచనలను తోడింది
కవిత్వం పుట్టింది

ఉదయం
సైన్నును నిద్రలేపింది
ఘోరమైన సునామి

అడ్డుగోడయి లేచింది
గొడుగు
వానకు, నాకు

సిగ్గుపడుతోంది
…సపోయానని మరోసారి
ఓటు

అసెంబ్లీని అడుగుతోంది
…ర్పులు ఎప్పుడని
అరణ్యం

నీడ
శత్రువుని తాకింది
తుపాకీ మేల్కొంది

అక్షరం అయివుంటే
ఎంత బాగుండు
అందరి మస్తిష్కంలో
వుండేవాణ్ణి

# పద్మవ్యూహం

- మాల్యశ్రీ



జానపదం జనానిది
పద్యనాదం పాలకులది
రెండూ రెండు మార్గాలు!

బరువుల గూడ్సు బళ్లు
కాన్వెంటు
పిల్లలు!

డాలర్ల గుడ్లు పెట్టాలి
అందుకే తమ పిల్లలకి
కాన్వెంట్ కోళ్ల ఫారాలు!

పడుగు పేక
చేనేతకారునికి
పద్మవ్యూహం!

ఒకనికి ఊరట
మరొకనికి బాసట
ఇంకొకనికి మత్తు - మదం!

వాడు కవి గాదు - కపి
కనిపించదు - వినిపించదు
విచిత్ర జీవి!

చేనేత కాదు
చేను దున్నేవాడు
చివరి దాకా మిగలరు!

బంధకవిత్వం
ద్ర బంధ కవిది
సుత్తి కవిత్వం సుఖవాదిది!

# "జోన్ ఆఫ్ ఆర్క్"

## (ZONE OF ARC)



**"Where the mind is without Fear"**

**రవీంద్రనాథ్ ఠాగూర్ గీతం నీ నాలుకమీద ఎప్పుడూ ఆడుతూనే ఉంటుంది. కాని ఠాగూర్ సంబోధించిన ప్రభువుపై నీకు నమ్మకం లేదు...**

**కాలువ మల్లయ్య**

ఎక్కడయితే మనిషి నిర్భయంగా, సగర్వంగా తలెత్తుకొని తిరుగగలడో అలాంటి సమాజాన్ని కలగంటున్నావు నువ్వు... మనిషి... మనిషే మహనీయుడని నమ్ముతావు నువ్వు... ఆ మనిషే "Where the mind is without Fear" పరిస్థితులు లేకుండా చేస్తున్నాడని నమ్ముతున్నావు... ఈ భూగోళాన్ని, విశ్వాన్ని స్వర్గధామం చేసేవాడయినా, నరకప్రాయంగా మార్చేవాడయినా మనిషేనని గాఢంగా నమ్ముతున్నావు నువ్వు... మనిషే అభివృద్ధికీ, వినాశనానికీ కారణం కావడం బాధాకరంగానే ఉంది నీకు...

పోనీ... పోనీ... పోతే పోనీ ఎవడెక్కడకు పోతే నీకేంటి అనుకుంటూ ఉండలేవు నువ్వు – నీ హృదయం జ్వలిస్తూనే ఉంటుంది... సమాజం ఎటు దిక్కు పయనిస్తుందని ఆవేదన చెందుతూనే వుంటుంది. మనిషి కోసం అన్వేషిస్తూనే ఉంటుంది. మనిషెక్కడయినా సగర్వంగా, భయం లేకుండా తలెత్తుకొని తిరుగుతున్నాడా అని వెతుకుతూనే వుంటుంది. భయం... భయం... ఎక్కడ చూసినా భయం... ఉద్రిక్తత... ఆందోళన... రక్తపాతం... హింస... పగలు... ద్వేషాలు చూసి నువ్వాందోళన చెందుతూనే వుంటావు... ద్వేషం పునాదులపైనే సమాజం... సిద్ధాంతాలు... మతాలు నిర్మితమయ్యాయేమోనని నీ అనుమానం... వాటి కోసం నిరంతరం ఆలోచన, అన్వేషణ చేస్తూనే వున్నావు.. ఇంతకీ ఎవడు బలవంతుడు? మొండివాడే బలవంతుడా అని భయానికి గురవుతున్నావు... మానవతను మించిన మంచితనముందా...? అనీ అన్వేషిస్తున్నావు.

ఆలోచిస్తున్నావు నువ్వు... ప్రపంచం బాధే నీ బాధగా ఆలోచనా పరంపరలో కూరుకుపోతున్నావు... ఒక్క విమానం ఢీ కొట్టడంతో పేకమేడల్లా కుప్పకూలిపోయిన అంతస్తుల భవనాల దృశ్యాలు.. పగ, ప్రతీకార చర్యలతో ఒకరినొకరు నరుక్కుంటున్న సంఘటనలు... చంపుడు పందాలతో ఆనందాన్నానుభవిస్తున్న ఘోర దృశ్యాలు.. ఒక్క మనిషి కోసం అతి ప్రాచీన చరిత్ర గల దేశాన్ని స్మశాన వాటికగా మార్చిన అమానుషత్వం – ఒక్క వ్యక్తిపై ద్వేషంతో వేలాదిమందిని బలి తీసుకొని దేశాన్నే మరుభూమిగా మార్చిన ఘోర దృశ్యాలు... ప్రపంచమంతటా ఉద్రిక్తత చోటు చేసుకున్న సంఘటనలు.. హీట్ అండ్ రూయిన్... ద్వేషించు.. నాశనం చేయ్... ద్వేషం పునాదుల మీద నిర్మితమవుతున్న ప్రపంచ సౌధం...

అభివృద్ధి... అభివృద్ధంటే ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి నీకు – అభివృద్ధి పేరు మీద జరుగుతున్న వినాశనం నీకు అంతుపట్టకుండా ఉంది... ప్లాస్టిక్ సంతతి... నిన్ను ఆవేదనకు గురి చేస్తున్న ప్లాస్టిక్ సంతతి పెరుగుదల... నీ మెదడే ఓ ఆలోచనల పుట్ట... నిరంతరం నువ్వు ఆలోచిస్తూనే ఉన్నావు – గ్లోబునంతటినీ నాశనం చేసే దుర్మార్గాన్ని తిట్టుకుంటున్నావు... ఈ ఆలోచనా పరంపర

నీ కోసం కానేకాదు... నమ్ముతావు నువ్వు... అర్బనైజేషన్ అంటే సుఖవాంఛ... గ్రామీణీకరణం అంటే ప్రకృతీకరణం అని నమ్ముతావు... ప్రకృతినే ప్రేమిస్తావు... ప్రకృతిలో తాదాత్మ్యం పొంది బతకడాన్ని ఇష్టపడతావు... నమ్ముతున్నావు నువ్వు... ప్రపంచమంతా సుఖవాంఛ దిక్కు పరుగెత్తడమే ఈ అనర్థాలన్నిటికీ కారణాలని నమ్ముతున్నావు... కాని నీ మాట వినేదెవరు..? నిన్నర్థం చేసుకునేదెవరు...? నీ ఆవేదన అరణ్య రోదనమే అవుతుందని బాధ పడుతున్నావు నువ్వు... సమాజం వినాశనం దిక్కు పయనిస్తుండటాన్ని చూస్తూ ఆవేదన చెందుతున్నావు.

ప్రపంచం బాధ నీ బాధగా పరిగణిస్తావు నువ్వు. పల్లంతే, ప్రకృతంటే హృదయానికి హత్తుకుంటావు... అలాంటి నిన్ను ఈ జనారణ్యంలో పడేశాడు నీ కొడుకు... హైదరాబాద్ మహానగరం నీకు జనారణ్యంలాగే కనబడుతుంది. లక్షలాది జనాలున్నా పక్కింట్లో ఉంటున్న వాళ్లెవరో కూడా తెలియని పరిస్థితి... విపరీతమైన జనంతో, ప్రపంచీకరణ విష సంస్కృతి ప్రభావంలో హైదరాబాద్ నీకు అక్టోపస్‌లా కనబడుతుంది. ఒకప్పుడు హైదరాబాద్‌కు వస్తే నీకెంతో హాయిగా అనిపించేది... సమతుల్య వాతావరణంతో చల్లగా ఉండేది... ఇపుడు నీకీ వాతవరణమేం నచ్చడం లేదు. భూమాతపై భారాన్ని పెంచుతూ ఆకాశాన్నంటే బంగ్లాలు... కడుపులో గడ్డల్లా ఫ్లైఓవర్లు నీకు సంతోషం కలిగించడం లేదు. గ్రామీణ స్వభావాన్ని కోల్పోతున్న మహానగర పరిసర ప్రాంతాలు... ప్లాస్టిక్ సంతికి, దళారీలకు కాసులు కురిపించే రియల్ ఎస్టేట్ వ్యాపారాలు నీకు వేదనను కలిగిస్తున్నాయి. నిరంతరం వినిపించే రణగొణ ధ్వనులు నీ చెవులకు విందు చేయడం లేదు... చూస్తున్నావు నువ్వు... నీ కొడుకు నీ కోసం కేటాయించిన గదిలో కూచొని కిటికీలోంచి బయటకు చూస్తూనే వున్నావు. మిరమిట్లు గొలిపే మహానగరం నీకు అందమైన మహానగరంలా కనబడటం లేదు. ప్రకృతి, స్వాభావికత విధ్వంసమై ఎంత మిరమిట్లు గొలిపే విధంగా వున్నా నీకది అసహజంగానే కనబడుతుంది. ఇలాంటి మహానగరాలను చూస్తుంటే నీకు భయమేస్తుంది. అందుకు నీ కారణాలు నీకున్నాయి. పెదవులపై నవ్వులకు, కృత్రిమత్వాలకు, మోసాలకు, ద్వేషాలకు, సుఖవాంఛా తత్వానికి నిలయాలైన మహానగరాల్లో నీకు విధ్వంసమే కనబడుతుంది. ఓ దిక్కు ఆకాశహర్మ్యాలున్న అన్ని భోగాలను అనుభవిస్తూ జీవించే సుఖోపజీవులు... మరో దిక్కు మురికి కాలువల పక్కన, చెత్త కుండీల దగ్గర, చెట్టు నీడయేనా లేక కుక్కలతో, పందులతో సమానంగా జీవించే బాధోపహతులు.. అయినా ఈ మహానగరాలకు తండోపతండాలుగా వలసలు వచ్చే జీవులు... వాళ్ళపై నీకు అపారమైన సానుభూతి...

నువ్విక్కడికి రానన్నావు... నీ కొడుకే తీసుకొచ్చాడు... అదుగో... నీ రక్తం పంచుకుపుట్టిన నీ కొడుకు నీ గది దిక్కు వస్తున్నట్టున్నాడు... ముఖంపై నవ్వు పులుముకుంటున్నావు నువ్వు... నీలో జరుగుతున్న సంఘర్షణను తెలియకుండా జాగ్రత్త పడుతున్నావు. ఈ ప్రవాహంలో కొట్టుకుపోతున్నాడన్నమాటే కాని నీ కొడుక్కు నువ్వంటే ప్రాణం... ఈ కాలంలో అలాంటి



కొడుకుండటం నీ అదృష్టమే... ఊర్నుంచి నిన్ను రమ్మన్నాడు అరుణ్... నువ్వు రానన్నావు... నీ కొడుకు అంతటితో వదిలిపెట్టలేదు...

''నాన్నా..! ఇది మన ఊరే కావచ్చు.. మీరు పుట్టి పెరిగిన స్థలమే కావచ్చు. కాని మీరిక్కడ ఒంటరిగా ఉండేం చేస్తారు. నాతో వస్తే మీ ఇష్టమున్నన్ని రోజులు పిల్లలతో హాయిగా గడిపి రావచ్చు..

"నాకక్కడేం తోచదు అరుణ్... నేను రాను..." అన్నావు నువ్వు. "నాన్నా! ఇంతకాలం ఉద్యోగరీత్యా ఇక్కడుండాల్సిన అవసరముంది. ప్రధానోపాధ్యాయుడిగా పదవీ విరమణ పొందీ మూడేండ్లు దాటింది. ఇక్కడుండి చేసేదేముంది..? నేను పిల్లలంతా అక్కడుంటే మీరిక్కడ ఒంటరిగా ఉండటమెందుకునాన్నా..! మీరు కేవలం ఉపాధ్యాయులు మాత్రమే కాదు. సామాజిక అవగాహనున్న రచయితలు. మీకు నగరాలంటే ఇష్టం లేక పోవచ్చు. కాని సమాజంలో వస్తున్న మార్పులు మీకు తెలియనివి కాదు. మీ భావాల కనుగుణంగానే సమాజ పరిణామం జరగాలనెక్కడుంది?

"అంటే మాత్రం జరుగుతుందా...? కాని నా బాధ నాది.. ఎందుకో కాని నాకు హైదరాబాద్ లాంటి నగరానికొస్తే ఊపిరాడనట్టుంటుంది... నగరం అంటే నాగరికత అనే అర్థం... ఉంటే ఉండొచ్చు... కాని, నగరాల్లో నాకెందుకో అశాశ్వతత్వం కనబడుతుంది. అసలు సిసలైన నాగరికత, సంస్కృతీ కేంద్రాలు గ్రామాల... గ్రామాలకున్న శాశ్వతత్వం నగరాలకు లేదు..."

"కావచ్చు నాన్నా... కాని మనమేం చేయగలం? పరిణామాలను ఆపగలమా?"

"సమాజ గమనం సుఖవాంఛ దిక్కే సాగుతుండటం వల్ల విధ్వంసం దిక్కు పయనిస్తున్నట్లనిపిస్తుంది.... ఈ విధ్వంసం ఇలాగే కొనసాగితే మనిషి మనుగడే ప్రశ్నార్థకమవుతుంది..."

"నాన్నా...! ప్రతి సమాజంలోనూ మంచి, చెడూ రెండూ ఉంటాయి. అభివృద్ధి, విధ్వంసం, మంచి చెడులను నిర్ణయించడంలో ఎవరి కొలమానాలు వారికున్నాయి.. మీరు విధ్వంసమనుకున్నదే చాలామందికి అభివృద్ధిగా కనబడుతుంది... కాదనగలరా?"

"ప్రతి వస్తువూ మార్కెట్ సరుకు కావడం అభివృద్ధా..?పిడికెడు నీళ్ళకు కూడా ఖరీదు కట్టడం ఎలాంటి అభివృద్ధి...?

ఆది మానవులకు పుట్టిన స్థలాలై ఉండీ ప్రకృతి సంపదతో అలరించే ఆఫ్రికన్ దేశాలు వెనుకబడిన దేశాలెందుకవుతాయి..?

"నాన్నా..! మీ అంత లోతుగా నేను సమాజాన్ని చదివిన వాణ్ణి కాను... మీలాగా ఆదర్శాల్లో జీవిస్తున్నవాణ్ణి కాదు. కాని నా మట్టుకు నేను నా నుంచి అయినంత వరకు విలువలను కాపాడుతూ కనీసంగా విధ్వంసం చేయకుండా బతకాలనుకుంటున్నవాణ్ణి – మీరు పెంచిన పెంపకం వల్ల కావచ్చు నేనీ ప్రవాహంలో కొట్టుకు పోతున్నా. కొంతయినా నన్ను నేను కాపాడుకుంటున్నాను... నాన్నా..! ఈ వాదాలన్నీ వద్దు. మీరు నాతోనే రావాలంతే...

నేను పెరిగి పెద్దయి ప్రయోజకుణ్ణయ్యే వరకు మీరు నాకు తండ్రి. మీరిప్పుడు వృద్ధులయ్యారు కాబట్టి నేను మీకు తండ్రినవుతాను. మిమ్మల్ని నా పిల్లల్లో ఒకడిగా చూసుకుంటాను. నేనిప్పుడు తండ్రిని కాబట్టి నేను చెప్పినట్టు వినాలి... కనీసం కొద్ది రోజుల కొరకైనా మీరు నాతో రావాలి..."

అరుణ్ మాటకు నువ్వు గొడగొడా ఏడ్చావు... అతనితో హైదరాబాద్ రాక

తప్పులేదు నీకు..."

అదిగో... నీ గదిలోకి నీ కొడుకొస్తున్నాడు... నీ ముఖంలో జరుగుతున్న మార్పులను వసిగడ్తాడు.. మార్చుకుంటున్నావు... నీ ముఖకవళికలను మార్చుకుంటున్నావు... నీ ముఖంలోకి చిరునవ్వును తెచ్చుకుంటున్నావు... అయినా నటన నీకు సాధ్యం కావడం లేదు...

నీ గదిలోకి రానే వచ్చాడు అరుణ్...

"ఇక్కడ ఒంటరిగా ఏం చేస్తున్నావు నాన్నా...? ముందు గదిలో కొచ్చి కూర్చోండి. టి.వి.నో, కంప్యూటరో పెడ్తాను..." అన్నాడు.

"వద్దు అరుణ్...! వాటి కంటే వార్తా పత్రికలే నయం... పత్రిక తిరగేసినా, టివి పెట్టినా కనబడేవేంటి..? ఒకర్నొకరు చంపుకోవడాలు, తిట్టుకోవడాలు.. హింస... ప్రతి హింస... పరస్పర హరణోద్యోగం.. ఎవర్నెవరు చంపుతున్నారో, ఎందుకు చంపుతున్నారో ఒకర్నొకరు ఎందుకు తిట్టుకుంటున్నారో అర్ధమై చావదు.. ఎందులోనయినా ఉండేవివే కదా..." అన్నావు నువ్వు...

"నాన్నా...! ఈ రోజు ఉగాది కదా...! తెలుగు సంవత్సరాది..! పండగ వంటలు తయారవుతున్నాయి. ముందు గదిలో కొచ్చి కూర్చుంటే పిల్లలతో గడపవచ్చు..

అరుణేదో చెబుతున్నాడు... నీ ఆలోచనలో నువ్వున్నావు.. ఈ రోజు ఉగాదంటే నమ్మబుద్ధి కావడం లేదు..

ఉగాదంటే..? వసంతాగమనం... వసంతాగమనాన్ని సూచించే చిహ్నాలు..? కోకిల కిలకిలా రావాలేవి..? చెట్లు చిగిర్చి పూలు పూచిందెక్కడ...? పక్షుల అరుపులేవి..? చెట్ల మీద కూర్చుని అరిచే కోకిలలు... కో అంటే కో అంటూ కోకిలలతో సమానంగా అరిచే పిల్లలు... తెల్లవారేముందు వినిపించే కోడికూతలు.. తెల్లవారడాన్ని సూచిస్తూ పక్షుల అరుపులు... కాకుల కాకారవాలు... ఎక్కడా ఒక్క పక్షి అరుపు కూడా వినబడకుండానే వసంతం ప్రవేశించిందా..? అంటే..? వసంతం మౌనంగానే ప్రవేశిస్తుందా...? మౌన వసంతాగమనమా ఇది...? అమెరికన్ సామాజిక శాస్త్రవేత్త కార్సోల్ చెప్పినట్లు ఇక మౌన వసంతాలే వస్తాయా? వసంతం వచ్చినట్లు కూడా తెలియకపోవడమేంటి..?

ఆలోచిస్తూనే ఉన్నావు నువ్వు...

నీ ముఖం వాడిపోయినట్లయింది...

"ఏంటి నాన్నా..! మాట్లాడరేంటి?" అన్నాడు అరుణ్ మళ్ళీ...

"ఈ రోజు ఉగాదంటే నమ్మబుద్ధి కావడం లేదు అరుణ్... వసంతం ఎక్కడైనా, ఎన్నడైనా ఇంత మౌనంగా ప్రవేశిస్తుందా..?

అన్నావు నువ్వు....

"నాన్నా..? మీరు భావుకులు... ప్రకృతిని ప్రేమించేవారు... ఇక్కడ ఉగాది ఆగమనం మాత్రమే కాదు.. ఏ పండుగ వస్తున్నట్టు తెలియదు... అమావాస్య, పౌర్ణమిలను తెలుసుకోవడం కూడా కష్టమే. క్యాలెండర్ చూస్తే తప్ప పండుగలు తెలియవు... లేదా ఆఫీసుకు సెలవైతే పండగ జ్ఞాపకం వస్తుంది... పండగయితే మాత్రం చేసేదేముంది...? పిండివంటలు చేసుకొనో, కొనుక్కునో తినడమే కదా...! ఉగాది రాక తెలియులేదంటున్నారు మీరు.. ఇక్కడ



చెట్లెక్కడున్నాయి. పక్షులు కూచొని పాటలు పాడుకోవడానికి..."

అరుణ్ దిక్కు ప్రశంసాపూర్వకంగా చూశావు నువ్వు...

"ఇక్కడ మాట వదిలిపెట్టు... గ్రామాల్లో కూడా దాదాపు ఇదే పరిస్థితుంది... ఇండ్లముందరున్న చెట్లు పోయాయి. పక్షులూ చాలా తక్కువయ్యాయి. కష్టమే అవుతుంది... దసరా రోజు గరుత్మంతుడు, పాలపిట్టలను చూడటానికి చాలా కష్టపడాల్సి వస్తుంది..." అన్నావు నువ్వు..

నీ కొడుకేం మాట్లాడలేదు.... మీ ఇద్దరి మధ్య కొద్ది క్షణాలు నిశ్శబ్దమే రాజ్యమేలింది. ఇంతలో నీ కోడలు నీ గది దగ్గరికొచ్చి నిల్చుంది...

"నాన్నా..! అంతా భయం.. భయం..! బతుకు భయం... ఒత్తిడి... పక్షులకు కూడా భయమేనేమో...?

"పట్టుకొని వేటాడుతుంటే భయం కాక మరేంటండీ... అయినా పక్షుల కోసం రంధిపడేది మీరే ననుకుంటా..." అని నవ్వింది నీ కోడలు.

"ఆc...ఆc... అన్నాడు అరుణ్ ఏమనాలో తోచక.."

"మామయ్యా...! మీరు స్నానం చేశారు కదా...! బూరెలు, ఉగాది పచ్చడివీ తయారయ్యాయి... ముందు గదిలో కొచ్చి కూర్చుంటే అందరూ కలిసి తినొచ్చు..."

ఆ మాటలకు నోరు తెరిచావు నువ్వు...

బేకరీ వంటల సంస్కృతి విశృంఖల విహారం చేస్తూ దేశీయ వంటలు కనబడటం అరుదైన మహానగరంలో నీ కోడలు అంత కష్టపడి బూరెలు చేసి ఉండదని నీ నిశ్చితాభిప్రాయం..

"సుశీలా...! శెనగపప్పు ఉడకబెట్టడం, బెల్లం, గోధుమపిండితో పనులు... బూరెలు చేయడం శ్రమతో కూడుకున్న పనే.. ఇంత శ్రమపడి బూరెలెప్పుడు చేశావు నువ్వు..? ఈ పనులన్నీ చేసిన దాఖలాలేవీ కనబడటం లేదు. నాకు..."

అన్నావు నువ్వు..

"అంత కష్టపడి వాటిని చేయడమెందుకు మామయ్యా...! ఇప్పుడన్నీ తయారయినవే దొరుకుతున్నాయి... బూరెలు బేకరీ నుంచి తెప్పించాను... ఉగాది పచ్చడి మాత్రం చేశాను... ఈ పండగ స్పెషల్ పచ్చడే కదా...! నిజానికి బేకరీల్లో మనం ఇంట్లో చేసుకున్నదానికంటే బాగా చేస్తారు..."

కోడలు మాటలకు నీ ముఖం వాడిపోయినట్టయింది... వాటిని తినాలనిపించడం లేదు... నీ భార్య, మీ అమ్మ గంటల కొద్దీ చకినాలు, గారెలు, బూరెలు చేస్తే ఇష్టమున్నన్ని తినడం జ్ఞాపకం వచ్చి నీ హృదయం భారమయింది...

నువ్వేం మాట్లాడలేదు...

"మామయ్యా..! ఇప్పుడు చకినాలు, గారెలు లాంటివి కూడా అన్ని కాలాల్లో బేకరీల్లో... స్వీట్ హౌస్‌లో దొరుకుతున్నాయి... చకినాలు తినడానికి సంక్రాంతి, బూరెలు తినడానికి ఉగాది పండగ రావలసిన అవసరం లేదు... ఎప్పుడూ దొరుకుతాయి..." అంది.

"హైదరాబాద్‌లో ఎండల్లా" అన్నావు నువ్వు.

నీ కొడుకూ, కోడలూ నవ్వారు...

వాళ్ళతో పాటు ముందు గదిలో కొచ్చావు నువ్వు... ఆ గదిలో నీ ఇద్దరు మనుమలు ఉన్నారు. అందరూ కలిసి మాట్లాడుకుంటూ ఉగాది పచ్చడి, బూరెలు

తిన్నారు... సుశీల వంటగదిలోకి వెళ్ళిపోయింది...

"నాన్నా...! పిల్లలతో మాట్లాడుతూ గడపండి... వాళ్లేమైనా ప్రశ్నలడిగితే జవాబులు చెప్పండి..." అన్నాడు నీ కొడుకు...

"నీ పిల్లలు చదివేది పెద్ద పెద్ద ఇంగ్లీషు మీడియం చదువులు... వాళ్ళు ఇంజనీర్ కొడుకులు... పల్లెటూరి బడిపంతుల్ని నేను వాళ్ళకేం చెప్పగలను...?" అన్నావు నువ్వు...

"మీరే కదా నాన్నా నన్ను ఇంజనీరింగ్ చదివించింది. ఇక్కడి, ఇప్పటి పరిస్థితులను బట్టి ఇంగ్లీష్ మీడియంలో వేశాను. కాని వాళ్ళకు తెలుగు బాగా వచ్చు. మీ కొచ్చిన ఇంగ్లీషు ముందు ఎంత ఇంగ్లీషు మీడియమైనా వాళ్ళకొచ్చిందెంత..? మీరు వాళ్ళడిగే ఏ ప్రశ్నకైనా సమాధానం చెప్పగలరు.."

నీ కొడుకు పొగడ్త నీకానందంగానే ఉంది...

"తాతయ్యా..! తాతయ్యా...!"

ఏదో అడగబోయారు పిల్లలు..

"చొప్పదంటు ప్రశ్నలతో తాతయ్యను విసిగించకండి... సబ్జెక్టుకు సంబంధించి ఏదైనా అనుమానం ఉంటేనే అడగండి..."

"నాన్నా...! ఈ రోజు ఉగాది పండుగ... పండగ నాడు కూడా చదువు చదువని చంపుకు తింటున్నావు... ఈ రోజయినా ఆడుకోనివ్వవేంటి..?"

నీ బలం చూసుకొని పిల్లలిలా మాట్లాడుతున్నందుకు అరుణ్‌కు నవ్వొచ్చింది...

"పరీక్షలున్నాయి కదా? అలా అన్నాను. సరే... మీ ఇష్టం... కొద్దిసేపు చదువుకోండి.. లేదా తాతయ్యతో గడపండి..."

నీ మనుమల ముఖాలు వెలిగాయి...

"తాతయ్యా...! మీరెప్పుడూ ఇక్కడే ఉండాలి... మీరిక్కడుంటే చదువు చదువని చంపుక తినడం తక్కువవుతుంది..."

పిల్లల మాటలకు నీ కళ్ళు చెమర్చుతున్నాయి... పోటీ పేరు మీద బాల్యానికి దూరమవుతున్న తరాన్ని చూస్తుంటే నీ గుండెలను పిండినట్టవుతుంది..."

కొడుకులు లేని వారలకు కూరిమి బిడ్డవు మాతృహీనులౌ బుడతలకెల్ల తల్లివయి పోషణ చేయుము..." అని నువ్వు చదువుకున్న చిన్ననాటి పదాలను జ్ఞాపకం చేసుకున్నావు...

'మరీ పిల్లలకు చెబుతున్నవేంటి..?'

పోటీ పేరు మీద బాల్యాన్ని మసి చేయడమేనా...

నీ మనసు బాధతో మూలుగుతుంది.

"అఖిల్, నిఖిల్... మీరు చదువుతున్న విషయాలేంటి..?"

"ఇంకేం ఉంటాయి తాతయ్యా..! మ్యాథ్స్, సైన్స్... ఇవే బాగా చదువుతాం... ఆ తర్వాత ఇంగ్లీషు... అప్పుడప్పుడు తెలుగు, సోషల్ చదువుతాము... పరీక్షలప్పుడు మాత్రమే హిందీ..."

వాళ్ళు జవాబు చెప్పిన తీరు నీకు నవ్వు తెప్పించింది...

"మీ జవాబు వింటుంటే నా చిన్నతనంలో జరిగిన ఓ సంఘటన జ్ఞాపకం వస్తుంది."

"చెప్పండి తాతయ్యా...!"

"మీరు చెప్పితే బాగా ఉంటుంది.."



'భూమి ఎలా ఉంటుంది...?'

"గుండ్రంగా ఉంటుందని చెప్పాడు మాస్టారు."

"ఇదే ప్రశ్న పాఠశాలల ఇన్‌స్పెక్టర్ అధికారి ఓ విద్యార్థినడిగాడు..."

"అతడేం జవాబు చెప్పాడు తాతయ్యా..."

"భూమి వారంలో ఐదు రోజులు గుండ్రంగా ఉంటుంది. శనివారం నాడు మాత్రం బల్లపరుపుగా ఉంటుంది. ఆదివారం ఎలా ఉంటుందో తెలియదు. ఇదీ ఆ బాబు చెప్పిన జవాబు. ఆ జవాబుకు ఇన్‌స్పెక్టర్‌తో సహా అందరూ నవ్వారు..."

నీ మాటలు కిలకిలా నవ్వారు నీ మనుమలు.

"ఆ తర్వాతేమయింది తాతయ్యా...!"

"ఇలా ఎవరు చెప్పారు మీకు అన్నారు ఇన్‌స్పెక్టర్... మా సైన్స్ సారు సర్ అన్నాడు విద్యార్థి... అక్కడే ఉన్న సైన్సు సార్ దిక్కు చూశారు ఇన్‌స్పెక్టర్..; నేనిలా చెప్పలేదు సార్ అని మొత్తుకుంటున్నాడు ఆ సార్... నేనెప్పుడలా చెప్పాను అని అడిగాడు..."

"ఓ విద్యార్థి లేచి నిల్చున్నాడు..."

"చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంది తాతయ్యా..! చెప్పండి..."

"ఆ విద్యార్థి చెప్పడం ప్రారంభించాడు... సార్.. సైన్స్ సారు ఇలా చెప్పింది నిజమే... పిల్లలూ... భూమి, ఇదుగో నేను ఉపయోగించే నశ్యం డబ్బీలా ఉంటుంది... నశ్యం డబ్బా ఎలా ఉంటుందో తెలుసు కదా అని చాలాసార్లు చెప్పాడు. మాకు అదే మెదడ్లో నిలిచిపోయింది. మా సారు సోమవారం నుండి శుక్రవారం వరకు గుండ్రంగా ఉంటే నశ్యం డబ్బా తీసుకొస్తారు... శనివారం నాడు చదరంగా వుండే నశ్యం డబ్బా తీసుకొస్తారు.. ఆదివారం సెలవు కదా..! ఎలాంటి నశ్యం డబ్బా వాడతారో తెలియదు. అందుకే రాజేశం ఇలా జవాబు చెప్పాడు..

ఆ మాటలకు ఇన్‌స్పెక్టర్‌తో సహా అందరూ పకపకా నవ్వారు... మీరు చెప్పిన జవాబు కూడా అలాగే ఉంది... రోజూ సైన్స్, మాథ్స్, అప్పుడప్పుడు మిగతా సబ్జెక్టులు... పరీక్షలప్పుడు మాత్రం హిందీ చదువుతారు... అంతేనా..!" అని నవ్వావు నువ్వు...

"అంతేకద తాతయ్యా...! సైన్సు, మాథ్స్ బాగా వస్తేనే కదా పెద్ద చదువులు చదవడానికి వీలయ్యేది.. మిగతా సబ్జెక్టుల కోసం సమయాన్ని వృథా చేయొద్దంటారు మా సార్లు... అయినా మేం అన్ని సబ్జెక్టులూ చదువుతాం... సైన్స్, మాథ్స్‌కు ఎక్కువ సమయమిస్తాం..."

"సరే చదువుకోండ్రి..." అన్నావు నువ్వు...

కాలాలు మూడు... వర్షాకాలం.. శీతాకాలం.. ఎండాకాలం... రుతువులు ఆరు.. వసంత రుతువు, గ్రీష్మ రుతువు, వర్ష రుతువు, శరదృతువు, హేమంత రుతువు, శిశిర రుతువు అని ఇంగ్లీషులో చదువుతున్నారు వాళ్ళు...

నువ్వు వింటూ కూర్చున్నావు –

"తాతయ్యా..! ఓ చిన్న అనుమానం..."

"అదేంటో చెప్పు...!"

"నువ్వే చదువుతున్నావు కదా...! వర్షాకాలం, చలికాలం, ఎండాకాలం అని..."

"అంటేంది తాతయ్యా..."

"వర్షాకాలంలో వానలు కురుస్తాయి... వర్షాలు లేకుంటే పంటలు పండవు కదా...! వానాకాలంలో కురిసిన వర్షం నీరు అన్ని కాలాల్లో పంటలు పండటానికి,

జీవరాశులు బతకడానికి ఉపయోగపడతాయి. ఎండాకాలంలో ఎండలెక్కువగా ఉంటాయి.. శీతాకాలంలో చలి ఉంటుంది. ఆయా కాలాల్లో ఆ వాతావరణానికి అనుకూలమైన పండ్లు, పంటలు, ఇతరాలు పండుతాయి. మూడు కాలాలూ అవసరమే... మూడు కాలాలు సరిగ్గా ఉంటే వాతావరణం సమతుల్యంగా ఉంటుంది..."

"మీ కాలంలో ఇవన్నీ జరిగేవా..?"

"కొంచెం అటూ ఇటూగా జరిగేవే...!"

"తప్పు తాతయ్యా...! కాలాలు మూడు అనడం తప్పు.. మేమయితే వర్షాకాలంలోనూ ఎండలనే చూస్తున్నాం... చలికాలంలోనూ ఎండలే.. వర్షాన్ని చూడటం చాలా అరుదు... చలిని అనుభవిస్తున్నదీ తక్కువే... మీ కాలంలో కాలాలు మూడేమో కాని ఇప్పుడయితే కావు... ఇప్పుడున్నది ఒకటే కాలం... అదే ఎండాకాలం... కాదంటావా తాతయ్యా.."

ఆ మాటలకు ఆశ్చర్యంతో నోరు తెరిచావు నువ్వు...

సమృద్ధిగా వర్షాలు... చెంబుతో ముంచుకోవడానికి వీలయ్యేంత పైపైకి ఉండే బావుల్లో నీళ్లు... వానలో నానుతూ వరుగెత్తుకొచ్చే గొల్లబోయిలు... వ్యవసాయదారులు... పశువులను గాసే పిల్లలు. నాగండ్లకు పోయినోల్లు నవ్వుకుంటచ్చిరి... గుంటుకులకు పోయినోల్లు గుద్దుకుంటాచ్చిరి.. వానచ్చురో అంటూ కప్పతల్లాటలు.. వానలు కొంచెం ఆలస్యమైతే వానదేవుని పాటలు... విరాటపర్వం కథ చెప్పడాలు... హరికథలు... అయ్యవార్ల కథలు... బొంతుమని ధ్వని చేస్తూ మత్తడి దుముకడాలు.. మత్తడి కింద కూచొని వీపు మీద నీల్లు పడుతుండగా స్నానాలు.. వరదకు ఎదురెక్కుతూ చేపలు... గాలం వేస్తూ, వలలు విసురుతూ చేపలు పట్టేవాళ్లు... ఎన్నో విషయాలు కళ్ళ ముందు వదిలి నీ హృదయం బరువెక్కుతుంది...

చలికాలం... సంక్రాంతి సమయంలో ఎముకలు కొరికే చలి... ఆ చలిలో చకినాలకు పిండి దంచే స్త్రీలు.. ఉదయం చేల్లలో కెళితే గడ్డ మీద మంచు బిందువులు... శనగ కర్రలపై తళతళా మెరుస్తూ నీటి బొట్లు... శనక్కాయలను తింటుంటే నోటికి పుల్లపుల్లగా తగిలే మంచు రేణువులు... ఎండాకాలం వస్తే ముంజలు.. మామిడిపండ్లు.. చెలమల్లో నీళ్లు... చల్ల... అంబలి.. ఈత పండ్లు... ఏ కాలంలో ఆ కాలానికి సంబంధించిన రుతువుల ప్రవేశం... మేమున్నామంటూ ప్రవేశించే రుతుపవనాలు... నీ చిన్నతనం కళ్ళముందు కదలాడి కనుగుడ్ల నిండా నీళ్ళూరుతున్నాయి...

నీ కొడుకు చిన్నతనంలో ఇవన్నీ అనుభవించాడు.. నీ మనుమలు ఇప్పటికీ దూరంగా కృత్రిమత్వంలో.... నీ మనుమల దిక్కు జాలిగా చూస్తున్నావు... ఎన్నో మార్పులకు సాక్షీభూతంగా నిలచిన నువ్వు అందులోని మంచి చెడ్డలను ఎలా బేరీజు వేసుకోవాలో నిర్ణయించుకోలేక నిస్సహాయంగా చూస్తున్నావు...

"ఏంటి తాతయ్యా..! మా ప్రశ్నలకు జవాబు చెప్పకుండా ఏదో ఆలోచిస్తున్నావు..."

ఈ లోకంలో కొచ్చావు నువ్వు...

"మీ నాన్న ఇంజనీర్ కదా..! ఈ ప్రశ్నకు జవాబు చెప్పమని మీ నాన్ననే అడగండి..." అన్నావు నువ్వు...

"నాన్నా..! మీ నిష్టూరం నా కర్థం కాకపోలేదు.



నాన్నా! కాలాలు గతి తప్పుతున్నాయి... రుతువులూ అంతే... అసలు వర్షాన్ని చూడటమే అపురూపమవుతుంది. రుతుపవనాలతో వచ్చే వానలు కరువయ్యాయి. సముద్రంలో వాయుగుండాలు వస్తే తప్ప వర్షాలు పడటం లేదు... ఇదంతా ఎలా ఉన్నదంటే ఉన్నది ఒక్కటే ఎండాకాలం... అప్పుడప్పుడు వర్షాలు పడితే పడును. లేకుంటే లేదు. చలియును అంతే అని చదువుకునే పరిస్థితులొస్తున్నాయి. ఈ విషయాన్ని పసివాళ్ళు కూడా పట్టుకున్నారు..." అన్నాడు అరుణ్.

అతని దిక్కు అదోలా చూశావు నువ్వు...

"నెలకు మూడు వానలు కురవాలిరా.. బంగారు వంటలూ పండాలిరా..." అనే కాలం పోయింది. మరి వీటన్నిటికీ కారణం ఏంటి?" అన్నాను.

"నాన్నా...! వీటన్నిటికీ మేమే, మా తరమో కారణమన్నట్లు మాట్లాడుతున్నారు మీరు... కాలాలు గతి తప్పడానికి ముఖ్య కారణం ప్రకృతి విధ్వంసమన్న విషయం మీకు తెలియంది కాదు..."

"మరా విధ్వంసానికి కారకులెవరు...?"

నువ్వంటే అపార ప్రేమాభిమానాలున్న అరుణ్ నిన్ను ఎదిరించి మాట్లాడటానికి వెనకా ముందవుతున్నాడు.

"కారణమెవరంటే ఏం చెప్పగలం..? అయినా మనమేం చెయ్యగలమో చెప్పండి... ఏటికి ఎదురీదటం సాధ్యమా...? ప్రపంచ వ్యాప్తంగా అనేక రంగాల్లో జరుగుతున్న అభివృద్ధిని కాదనగలమా...? దాంతో కొంత విధ్వంసమూ జరగవచ్చు..."

అరుణ్ మాటలతో నీ తల గిర్రున తిరుగుతుంది. వినాశనాన్ని, విధ్వంసాన్ని అభివృద్ధిగా ముద్రవేయడం నీకు నచ్చని అంశం...

"ఏదిరా అభివృద్ధి...? ఈ భూగోళంపై జీవరాశుల మనుగడను ప్రశ్నార్థకం చేయడం అభివృద్ధా...? ఓజోన్ పొరకు తూట్లు పొడవటం అభివృద్ధా..? మానవాంశ తుత్తునియలై మనిషి రూపాయి రూపాయి అంటూ దేబిరించడం అభివృద్ధా...? మనిషి యంత్రంగా మారుతూ తాత్కాలిక సుఖాల మోజులో పడటం వెనుక శాశ్వత కష్టాలను కొని తెచ్చుకోవడం లేదా...?" అన్నావు నువ్వు కోపంగా...

నీ కొడుకు ముఖం మాడ్చుకున్నాడు...

"నాన్నా..! మీరు విషయాన్ని ఒక్క కోణంలోంచే చూస్తున్నారు.. శాస్త్ర సాంకేతిక రంగాల్లో జరిగిన ఈ అద్భుతమైన పురోగతిని అభివృద్ధి కాదంటారా? ప్రపంచంలో ఏమూలన జరుగుతున్న విషయాన్నయినా ఇంట్లో కూచొని చూడగలుగుతున్నాం కదా...!"

"అదే సమయంలో హాయిగా కూచొని మీటనొక్కి సర్వం భస్మీపటలం చేయగలుగుతున్నాం... అమానవీయ సంస్కృతిని, భావజాలాన్ని మనిషి మెదడ్లోకి ఇంజెక్టు చేసి మసే చేస్తున్నాం.....!"

"మరి మీరనేదేంటి నాన్నా...! ఇదంతా వృథాయేనంటారా...? ఇంత శాస్త్ర సాంకేతిక ప్రగతి వట్టిదేనా...?"

పందొమ్మిది వందల అరవైల వరకు వివిధ రంగాల్లో జరిగిన అభివృద్ధిలో మానవాంశుండేది... మానవజాతి... ఇతర జీవరాశుల మనుగడ కోసం దోహదం చేసేదే నిజమైన అభివృద్ధి. ఖచ్చితంగా విభజన రేఖ గీయడం సాధ్యం కాకపోవచ్చు కాని ఆ తర్వాత జరిగింది సుఖవాంఛను పెంపొందించేదిగా, ఆధిపత్య భావాలను పెంచేదిగా ఉంది...

వనరుల విధ్వంసం... ప్రకృతి వినాశనం గుణింతాలుగా సాగుతుంది. అభివృద్ధనేది కూడికగా సాగాలి కాని గుణింతాలయితే చాలా ప్రమాదం... జమలోనయితే జీరో చేరినా పోయేదేం లేదు... గుణింతంలో జీరో చేరితే ఉన్నదంతా జీరో అవుతుంది కదా...!"

అవునన్నట్టు తలూపాడు తప్ప నీ కొడుకేం మాట్లాడలేదు...

"తాతయ్యా...! ఇంతవరకు ఎప్పుడూ విన్లేదు.. ఈ మధ్యనే వచ్చింది కదా సునామీ... అందేంటి తాతయ్యా...!"

ఆ ప్రశ్నతో నీ హృదయమంతా వడిపెట్టినట్టయింది... వార్తా పత్రికల్లో, ప్రసార సాధనాల్లో చూసిన ఆ దృశ్యాలు నీ కళ్ళ ముందు కదిలి మనసంతా కకావికలైంది.

కళ్ళు మూసుకున్నావు నువ్వు – ఆ భయంకర దృశ్యాలు జ్ఞాపకం వస్తేనే నీ మనసంతా అల్లకల్లోలమవుతుంది... అయినా పిల్లలడిగిన ప్రశ్నకు జవాబు చెప్పక తప్పలేదు నీకు...

"సునామీ అంటే సముద్ర భూకంపం... సముద్రంలో చెలరేగే అల్లకల్లోలం ఎంతో పెద్ద ఎత్తున సముద్రంలో సంభవించిన ఈ భూకంపం వల్ల సముద్రం ఉప్పొంగి అపారమైన నష్టం కలిగింది. ఇదొక విలయం...."

"అందుక్కారణం ఏమంటారు తాతయ్యా...!"

"ప్రకృతి సిద్ధంగా వచ్చే పరిణామాలు కొన్నన్న మాట నిజమే. కాని మనిషి సముద్రాల్ని కూడా వదలకుండా అందులో చేసిన అణు ప్రయోగాలు, భారీ విస్ఫోటనాలు – సముద్రాల్ని కూడా కలుషితం చేయటం... ఇవన్నీ ఒక విధంగా మనిషి స్వయంకృతాపరాధమే..."

అలాగా తాతయ్యా...! అంటే...? సైన్సు మనిషికి నష్టం కూడా చేస్తుందన్నమాట..."

"అవును... అది రెండు దిక్కులా పదునున్న కత్తిలాంటిది... ఎలా ఉపయోగించుకుంటే అలా ఉపయోగపడుతుంది..."

అన్నాడు నీ కొడుకు అరుణ్.

"సరేకాని అఖిల్... నిఖిల్...! మీరు ప్రధానంగా సైన్సు, మ్యాథ్స్‌లోనే చదువుతున్నారు కదా...! భవిష్యత్‌లో ఏమవుదామని మీ ఉద్దేశ్యాలు...?" అన్నావు నువ్వు...

పిల్లలు కొంచెం ఇరకాటంలో పడ్డారు...

కొద్ది క్షణాలాలోచించారు...

"నాకు గొప్ప సైంటిస్ట్ కావాలనుంది..."

"నేను గొప్ప కంప్యూటర్ ఇంజనీరునవుతా..."

నీ మనుమల మాటల్లో నీకు కొత్తదనమేం కనపళ్ళేందు... ఈ తరం పిల్లల్లాగే వాళ్ళూ చెప్పారు...

"మీరు ఈ రంగంలోనే ఎందుకు పోవాలనుకుంటున్నారు..?"

"బాగా డబ్బు సంపాదించవచ్చు..."

"అమెరికాకు పోయి సంపాదించుకోవచ్చు..."

ఈ మాటల్లోనూ కొత్తేం కనపళ్ళేందు నీకు...

"మీరనుకుంటున్న సైన్సు ఎవరి కుపయోగపడుతుందో తెలుసా...?"



నీ మాటలకు తెల్లమొహాలు వేశారు పిల్లలు...

"నోబుల్ గూర్చి చదువుకున్నారా మీరు..."

"చదువుకున్నాం తాతయ్యా... ఆయన పూర్తి పేరు సర్ ఆల్ఫ్రెడ్ నోబుల్. ఆయన పేరు మీద పెట్టిందే నోబుల్ బహుమతి. ప్రపంచంలోనే అత్యున్నత బహుమతి అది... మన దేశంలో మొట్టమొదటి నోబుల్ బహుమతి విజేత రవీంద్రనాథ్ ఠాకూర్..."

"అది సరే కాని ఆ బహుమతినెందుకు పెట్టారో తెలుసా?" అన్నావు నువ్వు...

"తెలియదు..."

"స్వీడన్‌కు చెందిన గొప్ప విద్యావేత్త నోబుల్... గొప్ప సైంటిస్ట్... ప్రపంచంలోనే మొట్టమొదటిసారిగా పేలుడు పదార్థాన్ని కనుగొన్నాడు... దాంతో కోట్ల కొద్ది డబ్బు సంపాదించాడు.. కాని, ఆతడు బతికున్న కాలంలోనే తాను కనిపెట్టిన పదార్థం ఎంత వినాశనానికి కారణమవుతుందో కళ్ళారా చూశాడు.. అప్పటికే అది ప్రపంచం సొత్తయి అతని చేతులు దాటిపోయింది. ఈ పేలుడు పదార్థాలే భవిష్యత్‌లో ప్రపంచ వినాశనానికి దోహదం చేస్తాయేమోనన్న భయం అతన్ని పట్టుకుంది. అతనిలో పశ్చాత్తాపం మొదలైంది. తాను కనిపెట్టిన పదార్థం మానవాళి మంచి మాటను పక్కనపెట్టి వినాశనానికి ఉపయోగపడటం నోబుల్‌కు బాధ కలిగించింది. తన పాపానికి కొంతైనా ప్రాయశ్చిత్తం చేసుకోవాలనుకున్నాడు... ఆ ఆవిష్కరణతో వచ్చిన కోట్లాది డబ్బుతో ఒక ట్రస్ట్ ఏర్పాటు చేశాడు... ఆ డబ్బుపై వచ్చే కోట్లాది రూపాయల వడ్డీని ప్రపంచవ్యాప్తంగా వివిధ రంగాల్లో కృషి చేసిన వారికి బహుమతి రూపంలో ఇవ్వడం మొదలుపెట్టాడు... అలా ఏర్పాటు చేయబడ్డవే నోబుల్ శాంతి బహుమతి... నోబుల్ సాహిత్య బహుమతి... నోబుల్ అర్థికశాస్త్ర బహుమతి... ఇతర వివిధ రంగాల్లో ఏర్పరచిన బహుమతులు... మన దేశంలో ఇంతవరకు ఏడుగురికే బహుమతులొచ్చాయి..."

నోబుల్ బహుమతి గురించి వివరించావు నువ్వు... నీ దిక్కు ఆరాధనా పూర్వకంగా చూస్తున్నారు నీ మనుమలు...

"నోబుల్ లాంటి మహనీయుడు కనిపెట్టిందే అంత నష్టం చేసింది కదా నాన్నా...! మరయితే సైన్సులో ఎలాంటి ఆవిష్కరణలు కావాలంటారు?

"మానవజాతి పురోగమనం కోసం ఉపయోగపడే విధంగా ఉండాలి సైన్సు... ఏ ఆవిష్కరణయినా మానవాళి, ఇతర జీవరాశుల మంచి మనుగడ కోసం ఉపయోగపడాలి కాని పశ్చాత్తాపపడేదిగా ఉండకూడదు. నోబుల్ పశ్చాత్తాప పడ్డట్టుగా ఏ సైంటిస్టూ పశ్చాత్తాపపడకూడదు. అయితే అంతకంటే ఎన్నో రెట్టెక్కువ నష్టం కలిగించే ఆవిష్కరణలు చేస్తూ కూడా, సమాజంపై విషాన్ని చిమ్ముతూ కూడా నోబుల్‌లా నయినా వెనక్కి తిరిగి చూసుకున్న వాళ్ళిప్పుడు లేకపోవడం ఆందోళన కలిగించే విషయం. వివిధ రకాల విస్ఫోటన సామగ్రి, బాంబులు, భయంకర యుద్ధ సామగ్రి, మీటనొక్కితే భస్మీపటలమయ్యే పరికరాలు ఆవిష్కరిస్తూ ఎవరూ పశ్చాత్తాపపడటం లేదు. అందుకే ప్రపంచవ్యాప్తంగా ఇంత ఉద్రిక్తత..." అన్నావు నువ్వు.

సూది కిందపడ్డా వినబడేంత నిశ్శబ్దంగా వింటున్నారందరూ...

"మరయితే తాతయ్యా...! సైన్సు ఎలా ఉండాలి...?"

"మనిషికి కూడు గుడ్డ నీడ నిచ్చే దిశగా సైంటిఫిక్ డెవలప్‌మెంట్ జరగాలి... ఆరోగ్యాన్నిచ్చే, ఆయువును పెంచే మానవజాతి, ఇతర జీవరాశుల మనుగడను శాశ్వతంగా ఉంచే దిశగా సైన్సు పరిశోధనలు సాగాలి... ప్రపంచవ్యాప్తంగా శాంతిని పెంపొందించడానికి సైన్సు ఉపయోగపడాలి కాని భయాన్ని పెంచడానికి కాదు... ఒక పక్క లక్షలాది టన్నుల ఆహార నిలవలుంటే మరోపక్క ఆకలి, మాల్ న్యూట్రిషన్ ఛాయలుంటే శాంతెక్కడుంటుంది..? సైన్సు అభివృద్ధికి అర్థమేంటి..? అందుకే సైన్సు విథ్ హ్యూమన్‌టచ్ కావాలి... ఆర్థిక శాస్త్రంలో నోబుల్ అవార్డు గ్రహీత అమర్త్యసేన్ ఏమన్నాడో తెలుసా..? సంపాదనలోనూ మానవాంశ ఉండాలన్నాడు..."

నీ మాటలతో వాళ్ళు విశేషంగా ప్రభావితమయ్యారన్న విషయం వాళ్ళ ముఖాలు చూస్తుంటే నీ కర్థమవుతూనే ఉంది...

"నాన్నా..! మీరనేవన్నీ సత్యాలే కావచ్చు.. కాని మీరనే ప్రకృతి రక్షణ, ప్రకృతి సిద్ధ జీవితం, పంటలు, నిరాడంబరత లాంటివన్నీ ఈ ప్రవాహంలో సాధ్యమా..? పోతే పెరుగుతున్న జనాభా అవసరాలు, వస్తూత్పత్తి అవసరాలు మీరనే ప్రకృతి సిద్ధ పద్ధతిలో ఉత్పత్తి వల్ల సాధ్యమవుతుందా..? అలాంటపుడు ప్రకృతి విధ్వంసం, వనరుల విధ్వంసం తప్పదు కదా...!" అన్నాడు నీ కొడుకు.

"మరి మేమేం చేయాలి తాతయ్యా...!"

ఎవరు ప్రోత్సహించ మంటున్నారో... వినిమయ సంస్కృతిని... ఎందుకు వనరులన్నీ ధ్వంసం చేస్తూ విపరీతంగా వస్తూత్పత్తి చేయడం..? ఇందులో ప్రజల అవసరాల కోసమే తినేదెంతవరకుంది...! రోజుకు లక్షలాది టన్నుల ఇంధనాన్ని ఎందుకు తగలేయడం...? ఎందుకు వాతావరణాన్ని విషవాయువులతో నింపడం..? అన్నాహజారే మాడల్ భూమిని రసాయనాల తినివేతకు గురిచేయకుండా పంటలు పండించడం సాధ్యం కాదా...? పండిస్తున్న వాళ్ళు లేరా...? రోజూ పెట్రోలును కాల్చడం ద్వారా ఎంత కార్బన్ మోనాక్సైడ్ వాతావరణంలో ప్రవేశిస్తుంది? వీటన్నిటి వెనకున్నదేంటి...?

నీలో నువ్వు గొణుక్కుంటున్నావు... కాని అవన్నీ చెప్పాలనిపించలేదు నీకు...

"వీటన్నిటి వెనకున్నదీ సుఖవాంఛ... మూలాల్ని మరిచిపోవడం... ఏదో సుఖమో.. ఏది అభివృద్ధో నిర్వచించుకోవడంలో ఉన్న కొలమానాలు..." అన్నాను నువ్వు...

"తాతయ్యా...! మీరు ఇంతవరకు చాలా విషయాలు చెప్పారు... మీరు చెప్పిన మాటలన్నీ అర్థం కాకున్నా మీరేంటో అర్థమయ్యారు... మరి రేపు మమ్మల్నేం చెయ్యమంటారు తాతయ్యా...! ఏంకమ్మంటారు...?"

నీ మనుమల దిక్కు ప్రశంసాదృక్కులతో చూస్తున్నావు నువ్వు... నీ కొడుకు కోడలు కూడా నువ్వు చెప్పబోయే మాటలను వినడానికి కుతూహలపడుతున్నారు...



నువ్వాలోచిస్తున్నావు... ఇంతలో నీ కొడుకుననే అన్నాడు.

"నాన్నా...! పిల్లలపై బాల్యంలో పడ్డ ప్రభావం శాశ్వతంగా ఉంటుంది. ఈ అమానవీయ ప్రవాహ ప్రభావంలో కొట్టుకుపోకుండా కొంతవరకైనా నన్ను నేను కాపాడుకుంటానికి నా బాల్యమే కారణం... మీ మనుమలకు మీరేం చెబుతారో చెప్పండి..."

"నా అంచనా ప్రకారమైతే ప్రపంచం రోజురోజుకూ ప్రమాదవుటంచు దిక్కు పయనిస్తుంది. మీరు ఏ రంగంలో స్థిరపడ్డా ఆ రంగంలో ప్రపంచానికి 'జోన్ ఆఫ్ ఆర్క్' నిర్మించే దిశగా మీ కృషి కొనసాగాలి. అదే నేటి అత్యవసరం..." అన్నావు నువ్వు...

నీ మాటలు సరిగా వాళ్ళ కర్థమయినట్టు లేవు...

"అంటే ఏంటి తాతయ్యా...?"

జోన్ ఆఫ్ ఆర్క్ టు లాండ్ - ఓజోన్ పొర నాశనం కాకుండా... సముద్రం కలుషితం కాకుండా ... భూగోళం బుగ్గికాకుండా...

జోన్ ఆఫ్ ఆర్క్ టు హిస్టరీ... మనిషిని మనిషిగా చూసే వ్యవస్థ కోసం... మానవతా పరిమళం విరజిమ్మడం కోసం...

జోన్ ఆఫ్ ఆర్క్ ఇన్ ఫైనాన్స్... సంపాదనలోనూ మానవాంశ ఉండటం -

జోన్ ఆఫ్ ఆర్క్ ఇన్ ఫిలాసఫీ... ద్వేషం పునాదులపై పయనిస్తున్న సమాజాన్ని ప్రేమ పునాదుల పైకి మళ్ళించడం.. సుఖవాంఛ నుండిసేవా భావం వైపు...

ఇంకా... ఇంకా....

ప్లాస్టిక్ సంతతి నుండి మట్టి సంతతికి...

ఇంకా... ఇంకా... నీలో చాలాకాలంగా జరుగుతున్న అంతర్మథనంలోంచి వెలువడుతున్న భావాలను బయటకు అనాలా వద్దా అని మదనపడుతున్నావు... కాని వాటిని నీలోనే ఉంచుకోవడం సాధ్యం కావడం లేదు - నీ అంతర్మధనాన్ని బయటపెట్టాను...

వాళ్ళంతా ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచారు...

కొద్దిసేపటివరకెవరేం మాట్లాడలేదు.

"అదెలా... సాధ్యం తాతయ్యా...!"

'ఎన్విరాన్‌మెంట్ వితవుట్ పొల్యూషన్

మేక్స్ ఎర్త్ ఆజ్ హెవెన్...

ఎర్నింగ్స్ విత్ హ్యూమన్‌టచ్

బ్రింగ్స్ సోషియల్ హార్మనీ

సైన్స్ విత్ హ్యూమన్ టచ్

బ్రింగ్స్ గ్లోబల్ హార్మొనీ

ఫిలాసఫీ విత్ హ్యూమన్ టచ్

మేక్స్ ది యునివర్స్ వితవుట్ ఫియర్...

ఇంకా... ఇంకా... ఇలాంటివెన్నో...

వీటన్నిటి సమ్మేళనమే విశ్వానికి జోన్ ఆఫ్ ఆర్క్ (Zone of Arc) అవుతుంది..."

అన్నావు నువ్వు...

ఇప్పుడు నీ హృదయభారం కొంచెం తగ్గినట్టయింది.

"జోన్ ఆఫ్ ఆర్క్ అంటే అర్థమేమిటి తాతయ్యా...!"

"రక్షణ స్థలం..." *




మిథునం
శ్రీ రమణ
వెల : రు.50







నేనూ మా అమ్మ    3 అబద్ధాలు
డాక్టర్ ఎం. హరికిషన్
వెల : రు.10    వెల : రు.15




మూగరాగం
Poetry for justice
సూరిశెట్టి జ్యోతీశ్వరరావు
వెల : రు. 10




మహా మేధావి, మార్క్సిస్టు భాష్యకారుడు
డాక్టర్ కె.బి. కృష్ణ
టి. రవిచంద్
వెల : రు.15




చప్రలు
చలపాక ప్రకాష్
వెల : రు.15




ఆంధ్ర బౌద్ధ భాష్యకారుడు
ప్రొఫెసర్ పి. లక్ష్మీనరసు (వ్యాసావళి)
టి. రవిచంద్
వెల : రు.30




దళిత తాత్త్వికుడు
డాక్టర్ దార్ల
వెంకటేశ్వరరావు
వెల : రు.10




మీ రాజ్యం మీరేలండి
బండి
నారాయణస్వామి
వెల : రు.45




ప్రశ్నించే జ్ఞాపకం
డాక్టర్
శాంతినారాయణ
వెల : రు.6




తత్త్వ విచార
సంశోధన
వేములపల్లి
గోపాలకృష్ణమూర్తి
వెల : రు.100




SHADES
Dr Lanka Siva
Rama Prasad
Price : Rs. 150/-




లోపలి దీపం
దాట్ల
దేవదానం రాజు
వెల : రు.50

# వెలి



ఊరంతా సిమ్మ సీకటి.. టైం పది గొడ్తుండొచ్చు. పల్లెటూరు గావట్కె పొద్దంత కూలి నాలి జేసిన జనం ఏదో గింత కడ్పుల పడేస్కోని జల్దినే పంతరు... మల్ల కోడి గుయ్యంగ తీసి పన్లకు బొయ్యేదాయె... గప్పుడే ఆకిరి బస్సొచ్చినట్టుంది ఏలూర్కి పని మీద బొయ్యొచ్చేటోల్లు ఇండ్లు జేర్తుంద్రు...

పిట్టల శ్రీనివాస్

సీకట్ల గాల్లని ఎర్కబట్టక కుక్కలు మొర్గుతున్నై... గప్పటిదాకా గక్కరు గక్కడ కూడ్న పోరగాల్లు ముచ్చట్లు సాలిచ్చి ఇండ్ల బాట పడ్తుంద్రు... మాగి కాలమాయె జల్దిన పొద్దూక్తది... గందుకే పదిగొట్టంగనే ఊరంత సడిసప్పుడు లేకుంటయింది. గక్కడ గక్కడ మొర్గుతున్న కుక్కల సప్పుడు... కియ్‌మని కీసురాల్ల సప్పుడు.. పొలాల తాన బెక బెక సప్పుడు దప్ప...

గా ఊర్ల కొసకు ఓ దిక్కుంగ మాదిగోల్లిండ్లు... గక్కడి పోరగాల్లంత గల్సి "అంబేద్కర్ నగర్" అని పేరు బెట్కుంద్రు... ఏ సర్కారొచ్చినా తీరొక్క పదకాలంటరు గానీ గీ వాడకట్టు ఎప్పుడన్న గట్వంటి సౌలత్‌లకి నోసుకోలే... గప్పుడెప్పుడో జన్మభూవప్పుడు మట్టి రోడ్డేస్తె మొన్నటి ఆనకాలాన్కి మట్టంత గొట్కపోయి కంకరదేల్తె... ఎవని ఇంటి ముందల్ది అల్లు ఎదుర్కుంద్రు... పోయిన తడ్వ ఎలచ్చన్లప్పుడు కరెంట్ తంబా లేసింద్రు... మల్ల గిటాంకల్లొచ్చినోడు లేడు, వైర్లు బిగిచ్చినోడు లేడు... గీ వాడకట్ల అంత కూలి నాల్జేస్కుంటోల్లే గావట్కి గింత పుర్సత్ జేస్కోని గీటి సుద్ది పట్టించ్కుంటోడే లేడు... గంతో గింతో సద్వుకున్నోల్లుంటే ఉన్న పొలం పుట్ర అమ్ముకోని పట్నంల జేరింద్రు... గాడ అన్ని వోదానెంట వోటి కమ్మల గుడ్సెలు.. కవేలిండ్లు... జరంత చెయ్యాడి నోడు సిమిటి రేకులేసుకుంద్రు... గట్టనే కడదాకబోతే ఇండ్లకు దూరంగా ఇసిరేసి నట్టు సింతా సెట్టు... దాని పక్కెంటనే పాడుపడ్డ బాయి... ఎన్కట గాబాయి ఏ కాలమనకుంట ఊరి జనాల రూపదీర్సేది.. గట్టోటిది ఓనాడు సాతాని పంతులు పెండ్లం గా బాయిల దున్కి సచ్చింది... గది దయ్యమైందని ఊరంత పుకార్లు లేసినై... సీకటైందంటే గటాంకల్ల బోతందుకు మంచి మంచోల్లు జనికేది... గట్టాటి బాయి తాన ఓ దిక్కు సిన్న కమ్మల గుడ్సేసుకొని కలో గంజో సంపాచ్చుంట కొడ్కును బత్కిచ్చుంటుంది జానకమ్మ... గాడు చిన్న బల్లె నాల్లో తర్గతి సద్వుతుండు... దినాం ఒడంది ఉర్కుర్కి బొయ్యేటోడు నిన్న బడ్నించి ఒచ్చిన కాంచి రంది వెట్ట బట్టిండు... "అమ్మా... నాకు నాయిన లేడా...? నాయిన ఎవరు...? యాడుండటు?... బల్లె సోపతి గాల్ల అమ్మ నాయినలు" గాలికి పుట్నోడని నా సోపతి జెయ్యనిస్తలేరు". అందర్కి నాయినలుంద్రు... నాకెందుకు లేడు చెప్పు...?" అమాయకంగా ఆడేసిన పెశ్నలు గుండెల్ల శూలాలు దిగినట్టు దిగినై జానకమ్మకు... "నువ్వు పండుకో కొడ్క... పొద్గాల జెప్త..." అని పోరన్ని వొల్లెకు దీసుకోని జోకొట్టి పండవెట్టింది.... గా మాటలు తల్సుకున్న కొద్ది మతిల పుర్గు తొల్సినట్లైతుంది.... "పశిపోరడు గీ వశ్శిల గాన్కి ఏమని జెబ్బును...? గాన్కి ఎట్ల జెప్తె సమజైతది...?

గీ లోకం పాడుగాను... గీ లోకం మీన దుమ్మెత్తి పొయ్య... గిన్నాల్లు నన్ను పొడ్సుకు తిన్నది... గిప్పుడు గీ పశిపోరనెంట బడ్డరు..." చెక్క మీద ఎల్లుతున్న గుడ్డి దీపం దిక్కు సూస్కుంటు జర్గింది యాద్జేసుకుంటుంటె గుండెను పిస్కినట్లైలుంది... తెల్వకుంటనే కండ్లెంట కాల్వలు పొంగుతున్నై...

× × ×

"జానకమ్మ తల్లిది కొప్పోలు.... తండ్రి పెద్దులుది గుర్రంపోడు... నాయిన తర్వన ఎవలు లేకపోటాల్కి ఇల్లరికమొచ్చి మస్కూరి పన్జేస్కుంట బత్కేటోడు... గీల్లమ్మ గిట్ల ఒకతే బిడ్డ... జానకమ్మకు ఆర్నెల్లప్పుడు తల్లి బాలింత రోగమొచ్చి సచ్చిపోయింది. మల్ల మనువు జేస్కుంటె... మారు తల్లి జానకమ్మను సరిగా సాకుతదో లేదోని మల్ల పెండ్లి మాటెత్తతలే పెద్దులు... తల్లిపోయిన కాంచి అమ్మమ్మ రెక్కల కిందనే పెర్గింది జానకమ్మ... ఏడో తర్గతిల ఉండంగ పొయ్యిల కట్టెల కనిపోయి పాము గర్సి సచ్చింది ముసల్ది... గట్ల సద్వు నడిమిట్లనే బందుబెట్టి... ఇంట్ల పనుల్జేస్కుంట అయ్యకు సాయంగుండేది....

గా వాడకట్ల పస్తు ఇల్లు ఎంకన్నది... అమ్మ నాయినలకు ఒక్కడే కొడ్కు.. జానకమ్మకు వొర్సకు మామైతడు... అటిటు జానకమ్మ కన్న రెండు మూడేండ్లు పెద్ద... పెద్ద బల్లె సద్వేటోడు గాని గార్వంగ పెర్గి. అమ్మ నాయిన భయం జెప్పక... ఎప్పుడు బడి ఎగ్గొట్టి సోపతి గాల్లని ఎంటేసుకోని... ఎంగిలి బీడీలు తాగుకుంట... బుగ్గ బాయిల ఈత గొట్కుంట తిర్గేది... ఎవలన్న సార్లు గల్సి "మీ వోడు బల్లెకు సక్కరంగొస్తలేడని" గాల్ల నాయిన చెవులేస్తె... రెండు, మూడు దినాలు "మన్ను దిన్న పామోలె" ఉండి... పాత మర్పు గాంగనే ఎప్పటోలిగానే తిర్గేది... గిట్ల కాలం గడుస్తనే ఉంది...

జానకమ్మోల్ల నాయిన మస్కూరి గావట్టి పనిమీద బడి ఒక్కో పాలి యాలకు బువ్వకు రాకపోటాల్కి... సద్ది పట్కోని పోతున్న జానకమ్మకు యాన్నో ఓతాన గల్సి పల్కరిచ్చేది ఎంకన్న... యాడికి బోతున్నవని అడిగి...''ఆడిపోరివి ఎంత దూరమని పోతవ్...? యాడుండని పోతవ్...? నేను దెవులాడి సైకిలు మీన దీస్పొస్త పో" అని తిర్గి తిర్గి పెద్దుల్ని దీస్కొచ్చి ఇంటి తాన దింపేది...

గట్ల ఎంకన్న మంచితనాన్కి సంబూరమయ్యేది జానకమ్మకు... గిట్లనే గా పని గీ పనిల సాయం జేసుట్ల... తెల్వకుంటనే మన్సు ఎంకన్న దిక్కు గుంజవట్టింది జానకమ్మకు... గీ కొనకు ఈల్లిల్లు... గా కొసకు ఎంకన్నోల్లిల్లైనా ఎప్పుడు ఎంకన్న కండ్ల ముందల మెదుల్తున్నట్టే అన్పిచ్చేది... ఎప్పుడూ గా జాసల్నే ఉండేది... ఎంకన్నకు మాత్రం గిట్టాటి పనులు దెల్వక పోయేది... ఎప్పుడు బడి ఎగ్గొట్టి ఊరు మీన బలాదూర్ దిర్గుడు తప్ప... గట్ల తిర్గి... తిర్గి పదో తర్గతిల ఫేలయిండు...

రెండు మూడేండ్లు గడ్సినై... ఒక్క కొడ్కు గావట్టి.. అమ్మ...నాయిన పెద్ద మన్సులైనా ఏదో శాతనైన కాడ్కి కూలి నాలి జేసి ఎంకన్నను సాదుకునేది. గీడు మాత్రం ఏ పని జెయ్యకుంట... చిల్లర గాల్లని జమచేసి



గాన్ని గీన్ని బెదిరిచ్చుడు షురు జేసిండు... గింతల్నే ఎలచ్చన్లొచ్చి గావూరి పటేలు రాజిరెడ్డి బావ ధర్మారెడ్డి ఎంఎల్ఎగా నిలవడ్డడు... ఊరూర్ల గిట్టాటి పనిపాటలేని పోరల్ని జమజేసి పైసలు, మందు అల్వాటు జేసింద్రు... ఎంకన్నకు రెండు జోడల కొత్త బట్టలు గుట్టిచ్చి... గాల్లింట్లనే పార్టీ ఆఫీసు దెర్పిచ్చింద్రు... ఎచ్చు లెక్వ ఎంకన్న గా బాజతంత నెత్తినేస్కోని పెచారం జేసుడు... పోరగాల్లని ఎంటేసుకొని ఆట... పాటలు... గిట్ల ఎలచ్చన్లు దగ్గరబడ్డయి.

ఓనాడు రాజిరెడ్డి పటేలు ఎంఎల్ఎగ నిలవడే ధర్మారెడ్డిని, కొడుకు విక్రంరెడ్డి (చిన్న పటేలు)ని దీస్కోని ఎంకన్న ఇంట్లున్న పార్టీ ఆఫీసు కొచ్చిండు... వచ్చే వచ్చుటమే ధర్మారెడ్డి ఎంకన్నను దగ్గర్కి దీస్కొని భుజం మీద చెయ్యేసేటాల్కి... 'విమాన మోలిగ గాలిల దేల్తున్నటన్పిచ్చింది ఎంకన్నకు... గా మాట గీ మాట మాట్లాడుతున్నంక ఎంకన్నని పక్కకు దీస్కపోయిండు... రాజిరెడ్డిని పిల్సి జర ఎంకన్నకు గా ఇసయాలన్ని జెప్పని పక్కకు బోయిండు. రూపాల కట్ట దీసి ఎంకన్న చేతుల బెట్టిండు రాజిరెడ్డి... "గౌండ్ల మారిగాని తాన సార మాట్లాడిన... రేపు రాతిరికి సీప్ లిక్కర్ దిగుతది... నేను బావెంట బోత కావట్ట గీ సన్న పటేలు నాయంటుంటడు... ఏదన్న అవునరముంటె గీని తాన దీస్కో... మనోల్లందర్కి మస్తుగ కుషి జేపియ్యి... ఎన్ని తిప్పలు బడన్నా బావను గెల్పిచ్చుకోవాలె..." గాలి పంపులోని కొట్టినట్టు గ్యాస్ కొడ్తుండు రాజిరెడ్డి... గట్లనే... భరోసిచ్చిండు ఎంకన్న...

తెల్లర్తె ఎలచ్చన్లు గా నాత్రి సోపతి గాల్లను, కులపోల్లను బిల్సి "మన పటేలు దేవునసంటోడు... మనమడ్గితే ఏమన్నా జేస్తడు... మన ఓట్లు బైటికి బోవద్దు.. పటేలు బాజతంత నా చేతుల్నే బెట్టిండు... ఎవనికేం గావాల్నో గది దాగుంద్రి... సాలకపోతే మల్లదెప్పిద్దాం... పెగ్గెలు కొడ్తుండు ఎంకన్న...

గొల్ల యవ్వారం మీన ఎప్పట్నుంచో ఓ కన్నేసిన మాజీ సర్పంచి లక్ష్మారెడ్డి పోలీసోలకి పిరాదిచ్చిండు... గప్పుడే రాజిరెడ్డొచ్చి గట్ల ఊరు దాటుతుండంగనే... పోలీసోల్లొచ్చి ఎంకన్న ఇంట్ల ఉన్న సర్కు సామానంత జప్తు జేస్కోని ఇంటికి సీల్ ఏసింద్రు... గాడున్న పోరగాల్లందర్ని కచ్చీర్కి బట్కపోయింద్రు... గీ ఇసయం తతీత పోరగాల్ల అమ్మ నాయినలు ధర్మారెడ్డి, రాజిరెడ్డిలకు ఫోన్ ఇచ్చింద్రు... "గిప్పుడు మేం రంగంల దిగితే శానా గోలైతది... గిట్ల ఎలచ్చన్లు అయిపోంగనే గట్లొచ్చి ఇడ్పిస్త... మీరేం ఫికర్ జెయ్యకుంద్రి..." గిందంతగా లక్ష్మారెడ్డిగాడు మనల్ని ఇర్కుల బెట్టా నీకె చేసిన పని... గాల్ల పార్టీకి ఒక్క ఓటు గిన్క పోవొద్దు..." గాల్లు గెలిస్తె మన పోరగాల్లు జైలు పాలైతారని... జరంత ధైర్యం... జరంత భయం నూరి పోసింద్రు...

ఎలచ్చన్లయిపోయినై ధర్మారెడ్డి గెల్సిండు... ఊర్లకొచ్చి అందర్ని కల్సిండు... "మీ పోరగాల్ల బాజతి నాకొదులుంద్రి... ఎల్లుండి పట్నంల ప్రమాణ స్వీకారమై పోంగనే హోంమంత్రితోని మట్లాడి కేసు లేకుంట చేపిస్తనని నమ్మ బల్కిండు... గట్లనే

హోంమంత్రితోని మాట్లాడిండు...

"కేసును కుదియ్యొచ్చు... గానీ మొత్తాన్కి మొత్తం ఎత్తేస్తే ప్రతిపక్షమోల్లు ఊర్కోరండి... ఇప్పుడిప్పుడే గదా అధికారంలోకొచ్చింది... ఇప్పుడే వివాదాల్లో ఇర్కుంటే ఎలా...? జవాబిచ్చిండు హోంమంత్రి...

కేసు మీదేస్కోటాన్కి ఏ పోరగాని అమ్మ నాయినా ఒప్పుకోలే... "నీకు ఓట్లేసి గెల్పిచ్చింది గిందుకేనా" అని ఖిలాఫ్ దీసింద్రు... ఎస్ఐతోని మాట్లాడిండు ధర్మారెడ్డి... ఇసయం జెప్పిండు..." ఇల్లు ఎంకన్నది కావట్టి... ఎంకన్న మీద కేస్ బుక్ చేసి వేరే పేర్లు దీసెయ్యొచ్చని" చెప్పిండు ఎస్ఐ... ఎట్లనో గట్ల మాయమాటలు చెప్పి జైలుకి దోలింద్రు ఎంకన్నని...

ఇల్లుకు సీలు బడుట్ల బజారు పాలైంద్రు ఎంకన్న అమ్మనాయినలు... ఒక్కగానొక్క కొడ్కు జైలు పాలైటాల్కి పికరు బట్టి కాలం జేసిండు ముసులోడు... దినా తెల్లక తోల్గినే ముసల్ది సుద్దాగ కాలం జేసింది...

జైలు కెల్లి బైటవడ్డ కాంచి రాజిరెడ్డింట చెంచాగిరి జెయ్యబట్టిండు ఎంకన్న... కద్దరు బట్టలు తొడ్గుడు షురు జేసిండు. కేసు అయిపొయ్యేదాక ఇల్లు సీలు దియ్యరు గావట్కి... యాన్నో బండుకునేది... గప్పుడు గప్పుడొచ్చి కమిటి హాల్ల బండుకునేది. గప్పుడు జానకమ్మ గింత బువ్వ దీస్క పొయ్యి పెట్టేది... ఎంకన్న బట్టలు.. లెవలు సూసి "గీనకి పెండ్లమయితే బాగుండు'' అన్పిచ్చేది జానకమ్మకు...

ఓనాడు... నాయిన పిల్సుకరమ్మడని చెప్పనీక కమిటీ హాలు కాదికొచ్చిండు చిన్న పటేలు... గప్పుడే ఎంకన్నకి బువ్వ దెచ్చిన జానకమ్మ కండ్ల పడ్డది. నిండుగ లంగ, జాకిట్ల మోరం గడ్డోలున్న జానకమ్మని సూడంగనే దిమ్మెర బోయిండు సిన్న పటేలు... "దీన్ని ఎట్లనన్న ఏస్కోవాలే" మదిల అనుకుంట టైం కోసం ఎదురు సూడ బట్టిండు...

ఎంకన్నని పిల్చుకొచ్చిన కొడ్కుని ఇంట్లకు బొమ్మని ముందలింట్ల కుసుంద్రు ఇద్దరు.. "అరేయ్ ఎంకన్నా... గా లక్ష్మారెడ్డిగాడు శానా శానా నఖురాలు చేస్తున్నాడు గప్పుడు కేసు బెట్టి నిన్ను జైలు పాలు చేసి... రేపు నీకేదన్న సీటు ఇప్పిద్దామంటె... గాడు సుత నల్లురెడ్గురు మాల, మాదిగోల్లని పోటీగ తయారుజేస్తుంద్రు... రేపు సర్పంచి ఎలచ్చన్లలో గీడుంటె మనకు శానా దెబ్బైతది... గాన్ని జర పక్కకు దప్పిస్తె మనకు జర రస్తా సాపు గుంటదిరా...

(లక్ష్మారెడ్డి లేకుంటే రాజిరెడ్డి ఎంత జెప్తె గంతనె ఆ ఊర్ల) గవి గివి చెప్కుంట ఎంకన్నని ఉసిగొల్పుతుండు రాజిరెడ్డి పటేలు.

ఆలోచన్ల వడ్డడు ఎంకన్న... "ఎప్పుడు గిట్టాటి పన్జెయ్యమైతిమి...?" కడ్పుల జరంత ఒన్కుబుట్టింది.

ఏందిరా.. సప్పుడు జెయ్యవు...? పట్నం కెల్లి ఓ నల్గుర్ని పిలిపిద్దునా...?

నేనొక్కన్ని సాలదా పటేలా..? గాని రొయ్య పానాన్కి... గా పట్నమోల్లొచ్చి చేసే&త మన విల్వేముంటది...?

గట్లయితే గా లక్ష్మారెడ్డి గాడు రేపటి బేస్తారం పొలాన్కి పిండి బస్తాలెస్తందుకు నల్గొండ బొయ్యొస్తడు... గానెంట పోయినోడు ఆటోల బస్తా లెంటొస్తడు... గప్పుడైతే ఒక్కడే



దొర్కుతడు... గానిమ్మలోల్ల బాయి గటాంకల్ల శితపాల శెట్ల గుబురుంది గదా... గాడయితే విని పక్కాగయితది... సరేనా...?

సరె... పటేలా...

తెల్లార్తె బేస్తారమనంగ ఫుల్‌బాటిల్ మందు... నల్గొండ నుంచి తెప్పిచ్చిన తల్వార్ సంచి తీసి కొడ్కుతోని పంపిండు రాజిరెడ్డి... గా సంచిల తల్వార్ సూడంగనే జరంత జన్కిండు ఎంకన్న... ఎప్పుడు కండ్ల బడదాయె... గిదెక్కడిదని ఆడిగిండు... నల్గొండల సిక్కులోల్ల తాన అసిలి కమాన్ పట్టలోని జేపిచ్చిందని ఒక్కటే ఏటుకు తలకాయ ఎగుర్తదని అటు ఇటు ఊపి సూపిచ్చిండు విక్రమ్ రెడ్డి... ఇద్దరు గల్సి మందు షురు జేసింద్రు... ఎప్పుడు కమిటి హాల్ కాడికొచ్చినా జానకమ్మ యాదికొస్తది విక్రమ్ రెడ్డికి... మందు తాగుతుంటె జానకమ్మ యాదికొచ్చి అస్సలు మత్తెక్కలేదు... గీ సీకట్ల గిప్పుడు జానకమ్మొస్తె బాగుండు... అనుకుంటుండు.. ఏదో ఆలోచనొచ్చినట్టు.... ఏందిరా... ఎంకన్న... గీ రూంల గిన్నెలు బొచ్చెలు యాడ కనబడ్తలేవ్... అన్నం యాడదింటవ్...? గిది అన్కెదప్పిన మందురా అయ్య... ఎంత దాగితే అంత అన్నం దినాలె... లేకుంటు రేపు అస్సలు శాతగాదు... మతులబు గుంజబట్టిండు... "అరే గంతే అన్కున్నావ్ సిన్నపటేలా... గీడ గిన్నెలు బొచ్చెలు లేకున్నా... మనం గీడున్నమంటె బువ్వ గదే నడ్సుకుంటొస్తది... గా పోరి లే... జానకమ్మ గది దెస్తది గిప్పుడు తొమ్మిదే అయితుంది... గియ్యాల ఒట్టి సాపలు ఒన్నదంట ఇగ పట్కొస్తది... గీ మందు... గానీసు యమ ఉంటదన్కో..." తాగిన నిసల ఉన్నయి లేనియి ఊదుతుండు ఎంకన్న....

జానకమ్మ వొస్తదని తెల్వంగనే మన్సుల కోర్కె రాజుకుంది విక్రమ్ రెడ్డికి... గిదే మంచి టైం... ఆలోచన్ల పడ్డడు... ఎంకన్నకు ఎక్వ మందు బోసి సోయిదప్పిచ్చి... తను మాత్రం జరంతనే తాగి జానకమ్మ కోసం ఎదురుసూడబట్టిండు... జానకమ్మని తల్సుకుంటుంటె ఎంటికలు నిక్కబొడుస్తున్నయి... టైం... తొమ్మిది గొట్టొచ్చు... గప్పటికే ఎవనిండ్లల్ల ఆల్లు సద్రుకుంద్రు... దూరంగా సిమ్మ సీకట్లకెల్లి ఆడ మన్సి వొస్తున్నట్టు మస్కమస్కగ కనబడ్తాల్కి... ఎప్పుడెప్పుడు పట్టు పడ్దామాని పాణం ఆగుతలేదు... పెయ్యంత కొలిమి లెక్కయ్యింది...

వొస్తనే సోయిదప్పిన ఎంకన్నను జూసి నోరెల్లబెట్టింది జానకమ్మ... ఇంకో మన్సిగూడ వున్నడని కయాల్‌లకొచ్చి సిన్న పటేల్ని సూసి పక్కకు పోబోయింది... "నువ్వెందుకు పిల్లా పోయ్యేది... నేనే బోతనా... పొద్దరించి అన్నం దిననట్టుండు... జరంత మందు దాగంగానే సోయిదప్పిండు... గాన్ని లేపి గింత అన్నం దిన్పియ్యి." బైటకి నడ్సినట్టు నడ్సి గబాల్న తలుపేసి జానకమ్మ మీద బడి మెడసుట్టున్న కండ్వ నోట్లె కుక్కి ఆగం జేసిండు..." ఎవన్కన్న జెప్తివో...? నిన్ను... మీ అయ్యను ఏం జేస్తనో సూడు... అసలే మెంటల్ లంజకొడ్కుని నేను..." గా పక్కలున్న తల్వార్సూపిచ్చి బెదిరిచ్చిండు... తన్నుకుపోయిన గద్ద సగం పొడ్సుకతిని వొదిల్న కోడిపిల్లోల్ల ఏడ్సుకుంట ఇంటి కుర్కింది జానకమ్మ... గాయాల్టికెల్లి మన్సుల గుబులు రేగబట్టింది... మన్సి అదో తీర్గ అయ్యింది.

అన్నట్టే తెల్లారి లక్ష్మారెడ్డిని కతం

జేసిండు ఎంకన్న... అమీన్ కచ్చీర్లేసి ఇర్లనూకి కేసు బెట్టింద్రు పోలీసోల్లు... జైలు పాలైండు... గప్పుడు... గప్పుడు రాజిరెడ్డి జైలుకు బొయ్యి ఎంకన్నను కల్సొచ్చేది.. తొందర్ల ఎల్లదీసే ఉపాయం జెయ్యనుంటి... ఊర్ల జరంత సల్లబడనీ... అని దాటేసేది.. గిట్ల దినాలు పొర్లుతున్నై...

ఓనాడు పొద్దు పొద్గాల వాంతి జేస్కుంది జానకమ్మ... ఒల్లంత సెమ్టలు బట్టి సల్లగయింది.. గా వూర్లనే వుండే గవురుమెంటు నర్సుతాన్కి దీస్కపోతే... కడ్పుని చెప్పంగనే గుండెల రాయిపడ్డది పెద్దులుకు... గీ ముచ్చట గాలికంటె ఉర్సుట్ల ఊరంత పాకింది... "చెడిపోయిన ముండ గంత ఉన్న లంజది పెండ్లి జేస్కుంటె గాదు... దీని తనుము పొద్గాను శినాలి లంజె... ఏశకాంతోలే తయారై గా శెడిపోయిన బాడ్కావ్ రాంగానే గా కమిటీ హోల్లకు ఇంట్లకు ఒక్కటే తిప్పులాట... గాల్లు గీల్లు ఎంకన్కి అల్వాటైందని జెప్తె నమ్మలేదే అక్క.. గిప్పుడు దీని బండారం బైటపడ్డది...

"అయినా దొంగిర్కం, లంజిర్కం ఎన్ని దినాలకైనా బైటపడేయే..." ఓ అమ్మ దెప్పి పొడ్వబట్టింది. గిట్టాటి శెడిపోయిన లంజది మా ఇండ్ల సందునుంటె మా సంసారాలు ఆగమైపోతయని... గీ సుట్టు పట్టు నుండొద్దని తతీమా అమ్మలక్కలు రందిబెట్ట సాగింద్రు... తల్కాయ కొట్టిన్నట్టయింది పెద్దులుకు...

"ఓ అమ్మలాల... మీ కాల్మొక్త... నా బిడ్డగసొంటది గాదు... దాని మీద గంతంత లావు నిందెలెయ్యకుంద్రి... బతిలాడ బట్టిండు పెద్దులు...

"అమ్మో... ఇన్నాల్లు బిడ్డ ఆనితాన పంతుంటె సప్పుడు జెయ్యక... బండారం బైటబడ్డాల్కి లంజ నాట్కాలాడుతుండు... బోకర్ బాడ్కావ్... గుసగుసలు మొదలైనయి... "నీ బిడ్డ సొక్కమైందయితే కడ్పు ఎవడు జేసిండో నల్గుట్ల జెప్పమను... మందిలకెంచి మాటలు ఇసురుతుంద్రు... సరే... ఆదివారం పంచాది బెడ్దామని పెద్ద మన్సులు ఓ మాట అనుకుంద్రు... గీ ఇసయం రాజిరెడ్డి దాంకబోయింది. గీ పంచాదిల తన గుట్టు యాడ బైటవడ్తదోని... జర్గిందంత వూనగుచ్చినట్టు తండ్రికి ఇవరిచ్చిండు విక్రంరెడ్డి... కొడ్కుని నాల్గు తిట్లు దిట్టి.. ఆలోచించుడు మొదలుబెట్టిండు రాజిరెడ్డి... ఇది ఇజ్జత్‌కీ సవాల్... ఎట్ల మరి...

ఓనాడు గాల్ల కులం నించి ఓ నల్గురు పెద్ద మన్సుల బిల్సి... "ఆ... ఏందో... గా పెద్దులు గాని బిడ్డ పంచాదంట... నేను గూడ ఓ పాలి సూసిన... ఓ పాలి ఎంకన్న కోసం కమిటాల్కు బొయ్యేటాల్కి... ఇద్దరు గండ్ల కుల్కుతుంద్రు... సరే వాకీ కులపోల్లు... వొర్సయితరు... సరేలే అని ఎన్కకొచ్చిన... ఓనాడు మాటలల్ల బెట్టి ఎంకన్ననడిగితే గదంటె పాణమని జెప్పిండు..." గాడు నాయెంట దిర్గేటోడాయె... గాని బాజతంత నేనే దీస్కోవాలె గద... మీరు గా పోర్నేం తప్పుబట్టకుంద్రి... పంచాది... గించాది... ఏమొద్దు... గా ఎంకడు జైలు కెంచి రాంగనే నేనే దగ్గరుండి పెండ్లి జేయిస్తనని" నాల్గుమాటలొదిలిండు...

గీల్లకైతే ఏదోటి జెప్పిండు... రేపు ఎంకన్నగాడు బైటకొస్తే...? నా ఇజ్జతంత కచ్ర అయితది. నా కొడ్కు బత్కు ఆగమైతది... ఎట్ల ఎన్ని రన్తలున్నయో... అన్ని తీర్లుగ



ఆలోచించబట్టిండు...

ఎట్టయితె అట్టాయె అని రాజిరెడ్డికి ఇంతకు మున్పు బాగ పశానత్ ఉన్న పోలీసోల్లకు వశలు ముట్టజెప్పి... గాన్ని పేషీకి తోల్కబొయ్యేటప్పుడు ఏ లారికిందనో నూకుంద్రని జెప్పిండు... గట్ల ఎంకన్నని సంపిచ్చి పోలీసోల్లకు ఊల్లకు బిల్పిచ్చి..." గా పోరి ఇసయం దెల్సిన కాంచి ఎంకన్న లెస్స బాదపడేది.. ఎవనెవని పక్కల్నో పండ్కోని కడ్పుదెచ్చోని నేను జేసినని నల్గట్ల జెప్పిందంట... నేను బైటికి బోయినంక గది ఎట్లయిన నా మెడకు బడ్తది..." గా మాటలు జెప్పుకుంటనే ఎదురుంగ వొస్తున్న లారి కింద కురికిండు... ఎన్ని ఇదాలుగా పయత్నం జేసినా బత్కలేదని... నల్గుట్ల నమ్మబల్కిచ్చిండు...

నెలలు నిండినై... జానకమ్మ నీల్లాడింది. మొగ పోరడు బుట్టిండు.. గప్పుడ్దాంక ఎవల కండ్ల బడకుండ ఇంట్లనే దాసిండు జానకమ్మని... కాన్పు జెయ్యనీక ఎవ్వలు ముదల్కి రాలే... గీ పోరడు బుట్నంక సుట్టుపట్టోల్ల రంది మల్ల షురువైంది.... పంచాది బెట్టి కులంల కెల్లి ఎలేస్తున్నమని తీర్మానం జేసింద్రు... గది ఇమిడిచ్కోలేక గుండె బగిలి సచ్చిండు పెద్దులు... గట్ల పచ్చి బాలింతని సూడకుంట ఎలేసింద్రు..."

× × ×

తెల్లారింది. సూరుడు కండ్లు దెర్సి లోకాన్ని సూడబట్టిండు... గా ఎండపొడ సుర్రున దగులంగనే కండ్లు నల్సుకుంట లేసిండు జానకమ్మ కొడ్కు.. గట్లనే గుడ్సె నడిమిట్లున్న గుంజకు ఆన్కోని గుడ్డి దీపం దిక్కు సూస్తున్న తల్లిని లేవబట్టిండు... ఉల్కులేదు... పల్కులేదు... గట్టిగ ఊపేటాల్కి గట్లనే కిందకి వొరిగింది జానకమ్మ... బుగులైన పోరడు బైట కుర్కి మొత్కునుడు షురు జేసిండు.

"వో అమ్మా... వోలన్న రంద్రి... మా యమ్మ లేస్తలేదు... మాయమ్మని లేపుంద్రి... జర రంద్రి... ఓ అక్కా... ఓ పెద్దమ్మా..." అందరు బైటికెల్లి అర్సుతున్న పోర్గాని దిక్కు సూడ బట్టింద్రు గాని ఓలన్న అడ్గు ముందేస్తలేరు.

"దొంగ లంజది... ఎవని కాన్నా ఈన్ని కన్నది... నడుమంత్రపు లంజ... నడుమంత్రపు శాతలు జేసి... గిన్నాల్లకు గిప్పుడు శెరమొచ్చినట్టుంది... ఏం మింగిందో..? ఏం పాడువడ్డదో...?'' అందరు గుసగుసలాడుకుంటుంద్రు...

పోరడు గుడ్సెలకు... బైటకు ఉర్కుకుంట అర్సుతనే ఉన్నాడు...

గింతల గుడ్సెల ఓ మూల ఎప్పడ్సుందో నాసుబెట్కున్న గండుపిల్లి ఎల్కను ఎంటాడి... చెక్క మీదకి దుంకి తాలకి... దీపం కిందపడి గుడ్సె అంటుకుంది... గాల్లు, గీల్లు వొచ్చి గింత మన్ను, నీల్లు సల్లెటాల్కి కాలి బొగ్గైంది జానకమ్మ... కండ్ల ముందల్నే తల్లి కాలి బొగ్గైటాల్కి దిమ్మెరపోయిండు పోరడు... గట్లనే గాడ నిల్వడి... గప్పడ్దాక తాను ఎంత మొత్కున్నా అడ్గు ముందుకెయ్యని అమ్మలక్కల దిక్కు.. గీ పాడులోకంల ఇముడలేక అగ్గిపవేశం జేసి... గీ లోకాన్ని తనే 'ఎలేసి' ఇన్ని దినాల తను దిగమింగుకున్న నిజాన్ని తనెంటే తీస్కపోయి... మశిబొగ్గోలె మిగిల్న తల్లి దిక్కు సూస్కుంట నిలబడ్డడు... గీ లోకం పోకడ దెల్వని పశి పోరడు. *

# కుల, వృత్తిపరమైన నవలా సమాలోచన



'బతుకుతాడు' నవలను విశ్లేషణ చేస్తున్న వల్లభాపురం జనార్దన, హిమజ్వాల

ప్రజాసాహిత్య వేదిక ఆధ్వర్యంలో మహబూబ్‌నగర్ లోని సుదర్శన్ ఫంక్షన్ హాలులో జూలై 17 ఉదయం నుండి సాయంత్రం దాకా "నవలా సమాలోచన" జరిగింది. తెలుగు సాహిత్య లోకంలో గత అయిదు సంవత్సరాల కాలంలో వెలువడిన అస్తిత్వవాద పర్యావరణ వాద నవలలను ఏడుగురు సాహితీ విమర్శకులు విశ్లేషణ చేస్తూ ప్రసంగించారు.

ఈ సమాలోచన తన కార్యక్రమాల్ని డాక్టర్ వల్లపురెడ్డి బుచ్చారెడ్డి ప్రారంభించారు. ఆయన మనిషికి మానవత్వం ముఖ్యమని - సంస్కారం ఆత్మ అని - సాహిత్యం వాటిని కాపాడే సాధనమని కుల వాదాలపై వచ్చిన నవలలపై సమాలోచన జరపడం కులాల్ని ప్రోత్సహించినట్టు అవుతుందేమో అని సందేహాన్ని ప్రారంభోపన్యాసంలో వెలిబుచ్చారు.

సమావేశ సమన్వయ కర్త యువ కవి కె. నవీన్ మార్బ్ చెప్పినట్లు "సామాజిక అస్తిత్వమే సామాజిక చైతన్యాన్ని నిర్ణయిస్తుందని, సమాజంలో కులం ఈనాటి వాస్తవమనీ, అందువల్ల కులాల - వృత్తుల అస్తిత్వాలపై వచ్చిన నవలలను సమాలోచన చేస్తున్నామని, కులాల్ని ప్రోత్సహించడం వేదిక ఉద్దేశ్యం కాదనీ, కుల స్పృహ కన్నా వర్గ స్పృహ ముఖ్యమనే విషయాన్ని గుర్తు చేయడమే ఈ సమాలోచన ముఖ్య ఉద్దేశ్యమన్నారు.

ముఖ్య అతిథి తెలకపల్లి రవి తెలుగు నవలా పరిణామం సమాజ పరిణామాన్ని ప్రతిబింబించిందని తెలుగు నవలా పరిణామ వికాసాలను గురించి శ్రోతలకు పరిచయం చేశారు. కందుకూరి "రాజశేఖర చరిత్ర" నవల సంఘ సంస్కరణకు సాధనమైందని, తరువాత పానుగంటి మొక్కపాటి వారి నవలలు వచ్చాయని, ఆకలి దశాబ్దంలో శ్రీశ్రీ, జయభేరి కవిత పుట్టినట్లు, అడవి బాపిరాజు నవలలు వచ్చాయని, అదే క్రమంలో చలం - రావిశాస్త్రి - రంగనాయకమ్మ - ఓల్గా లాంటి వారి కలాల నుండి అన్ని వాదాలు ప్రతిబింబాలుగా నవలలు వెలువడ్డాయని, ముఖ్యంగా తెలంగాణా సాయుధ పోరాటంపై చాలా నవలలు వచ్చాయని చెప్పారు.

ఆ తర్వాత తాజా ధోరణులను స్పృశించారు. మొదటి సెషన్ విరజాజి రామిరెడ్డి అధ్యక్షతన ప్రారంభమైంది. భూతం ముత్యాలు రచించిన దళిత నవల 'సూర'ను కోయి కోటేశ్వరరావు సమీక్షిస్తూ నవలలో సూర నవల అంబేద్కర్ ఆలోచనలను అమల్లో పెట్టిందని అంటూ దండోరా ఉద్యమం - అన్ని వామపక్ష పార్టీలు "పుండొక కాడ ఉంటే మందొకతోన పెట్టారని'' విమర్శించారని అన్నారు. భాషా సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకిస్తూ తెలుగు మాండలికాన్ని కాపాడుకోవాలన్నారు. రచయిత ప్రయోగించిన కొన్ని పదాలను కొందరు అశ్లీల పదాలు అనుకుంటారని, నిజానికవి అశ్లీల పదాలు కావని అన్నారు. అశ్లీలమనేది ఉద్దేశ్యంలో ఉంటుందని, ప్రేమతో, ఆప్యాయతతో కూడా జనం అశ్లీల పదాలు ఉపయోగిస్తారన్నారు.

తరువాత సలీం రచించిన "వెండి మేఘం" నవలను ఎస్.ఎం. ఖలీల్ విశ్లేషించారు. ఇస్లాం మతం భారతదేశంలో ప్రవేశించాక భౌతిక పరిస్థితుల వలన చాలా మార్పులకు లోనయిందని అసలు నేటి ముస్లింలంతా వెనకటి తరాలలో హిందువులే అయి వుంటారని, ముస్లింలలో చాలా వర్గాలున్నాయి కాని నవల ఎక్కువగా షియా - దూదేకుల వర్గాల్ని గురించే చర్చించడం వల్ల నవలకు సమగ్రత రాలేదని అభిప్రాయపడ్డారు. పాత్రల చిత్రణ - ప్రేమ చిత్రణ బాగుందని, అదే సందర్భంలో పాత్రలు ఎదుర్కొనే సంఘర్షణను రచయిత సమగ్రంగా చిత్రించలేదన్నారు.

మధ్యాహ్న భోజనం తర్వాత రెండవ సెషన్ ప్రారంభమైంది. ప్రముఖ కవి కోట్ల వెంకటేశ్వరరెడ్డి అధ్యక్షత వహించారు. మాదిగల జీవిత నేపథ్యంలో వచ్చిన "కక్క" నవలను జిలుకర శ్రీనివాస్ సమీక్షించారు. దీన్ని వేముల ఎల్లయ్య రచించారు. జిలుకర శ్రీనివాస్‌గారు 'కక్క'లోని కథను హృద్యంగా చెప్పి దళిత సమస్యకు పరిష్కారం మార్క్సిజంలో ఉందని, ఇది కూడా భూమి సమస్యనే చర్చించిందన్నారు.

ఆ తర్వాత రజకుల జీవిత నేపథ్యంలో జి.ఎస్. చలం రచించిన "రేవు" నవలను యువకవి పరిమళ్ సమీక్షిస్తూ నవల రజకుల జీవితాల్ని చిత్రించడంలో సఫలమైందని, శిల్పం - పాత్రల చిత్రణ అమోఘంగా ఉందని అన్నారు. అయితే పీడన అనేది కులాన్ని బట్టి కూడా రూపం మార్చుకుంటుందని - ప్రపంచీకరణ దశలో వృత్తులు నాశనమవుతున్నాయని - వృత్తులు నాశనమైనా కులం వ్యక్తిని విడిచిపెట్టడం లేదు. ఈ దేశంలో జమిలిగా కుల - వర్గ పోరాటం సాగితేనే పీడన నుండి విముక్తి దొరుకుతుందన్నారు.

అనంతరం ప్రముఖ కవి హిమజ్వాల "ది లాస్ట్ బ్రాహ్మిణ్" నవలను సమీక్షిస్తూ రాణీ శివశంకర్ రచయితగా అన్ని గందరగోళాల్ని ఇందులో సృష్టించారని - ఆధునికానంతర వాద - తార్కిక తాత్విక

జ్ఞానాన్ని పక్కకు తోసి తన యిష్టం వచ్చిన రీతిలో రచయిత రాశారని, ఇలాంటి ధోరణులను ప్రోత్సహించకూడదన్నారు. అయితే బ్రాహ్మణ జీవిత చిత్రణ కొంత వాస్తవంగా ఉందన్నారు. ఆధునికానంతర వాదం రూపంలో ఆకర్షణీయంగా ఉన్నా సారంలో పాలకుల పంచన చేరుతుందని విమర్శించారు.

పర్యావరణ నేపథ్యంలో చంద్రలత రచించిన 'దృశ్యాదృశ్యం' నవలను రవీంద్ర సమీక్షిస్తూ ఈ నవల ఆనకట్టను గురించి సమగ్రమైన రిపోర్టు ఇస్తూనే ఒక వాస్తవిక జీవిత కథను మలిచిందన్నారు. శిల్పం అద్భుతంగా ఉందని, రాజకీయాలు, కాంట్రాక్టర్లు - ఇంజనీర్ల ఇనుపత్రి కోణం సృష్టిస్తున్న విధ్వంసాన్ని ఈ నవల అద్భుతంగా చిత్రించిందన్నారు. నవల పర్యావరణ స్త్రీ వాదమనే కొత్త కోణాన్ని చూపిందన్నారు.

తరువాత (ఈడిగల) (గౌండ్ల) కల్లుగీత కార్మికుల వాస్తవిక జీవితంపై నేరెళ్ల శ్రీనివాస గౌడు రచించిన 'బతుకుతాడు' నవలను ప్రముఖ కవి, విమర్శకుడు వల్లభాపురం జనార్ధన విశ్లేషించారు. బతుకుతాడు నవలలోని కథను చెప్పి ఇందులో మూడు గౌండ్ల కుటుంబాల జీవిత గమనాన్ని బతుకు సమస్యను చూపడం జరిగిందని అన్నారు. 30 సంవత్సరాల కాలంలో కల్లు గీత కార్మికుల బతుకుల్లోని ఎగుడు దిగుడులను ప్రపంచీకరణ పరుచుకుంటున్న క్రమంలో కుల వృత్తులకు దిక్కులేకుండా పోవడాన్ని - కల్లుగీత కార్మికుల చుట్టూ అల్లుకున్న రాజకీయ వలలను కళ్ళకు కట్టినట్లు సహజంగా చిత్రించిన నవల "బతుకు తాడు" అన్నారు. "కులవృత్తులన్నీ కూడు పెట్టని కులవృత్తులే" అంటూ నవల ముగించడం సబబుగా లేదన్నారు. బతుకుతాడు బలంగా ఉండటానికి పరిష్కారాన్ని సూచనప్రాయంగా సూచిస్తూ ముగింపు చేసి ఉంటే బాగుండేదని అన్నారు.

సమాలోచన తొలి సెషన్‌కు జన జ్వాల అహ్వానం పలుకగా యువకవి ఎం.డి. ఖాజామొయినొద్దీన్ వందన సమర్పణ చేశారు. రెండవ సెషన్‌కు జావీద్ ఆహ్వానం పలుకగా కె. జయశ్రీ వందన సమర్పణతో సమాలోచన విజయవంతంగా ముగిసింది.

**- కె. నవీన్, మహబూబ్‌నగర్**

# స్పందన ఆవిష్కరణ

మే 15వ తేదీన మహబూబ్ నగర్‌లోని జెడ్‌పి మీటింగ్ హాల్‌లో 'అభినందన' సాహితీ సాంస్కృతిక సంస్థ ఆధ్వర్యంలో శ్రీ ఇరువింటి వెంకటేశ్వర శర్మ రచించిన 'స్పందన' కవితా సంపుటి ఆవిష్కరణ జరిగింది.

ప్రముఖ సినీ నటులు 'రాళ్ళపల్లి' పుస్తకాన్ని ఆవిష్కరించారు. సమాజ హితం కోసం సాహిత్యం తోడ్పడాలనీ ఉపన్యసించారు.

డాక్టర్ తెన్నేటి నాగరంజని సభకు అధ్యక్షత వహించారు. శ్రీశ్రీ, దేవరకొండ బాలగంగాధరతిలక్ వంటి వారి కవిత్వం యువ కవులకు ఏ విధంగా ప్రభావితం చేసిందో వివరించారు.

అభ్యుదయ ప్రాచ్య కళాశాల రీడర్ డాక్టర్ బి. జయరాములు పుస్తక సమీక్ష చేశారు. శ్రీ ఇరువింటి వెంకటేశ్వర శర్మ గారి 'స్పందన' కవితా సంపుటిలో అన్ని విధాలైన అంశాలపై స్పందించిన తీరును వివరించారు.

ఈ కార్యక్రమానికి జిల్లాలోని ప్రముఖ కవులు సాహిత్యాభిమానులు విచ్చేసి 'స్పందన' కవిని అభినందించారు.




'స్పందన' ఆవిష్కరణలో ఇరుపాటి వెంకటేశ్వర శర్మ,డాక్టర్ బి. జయరాములు, రాళ్ళపల్లి, డాక్టర్ తెన్నేటి నాగరంజని, సత్తూర్ రాములు గౌడ్

# భద్రాచలంలో సాహితీ స్రవంతి కార్యాలయం

భద్రాచలం డివిజన్ శాఖ కార్యాలయం ఇటీవల ప్రారంభమైంది. 'సాహితీ బంధు' మాగంటి సూర్యం దీనికి ప్రారంభోత్సవం చేశారు. సాహితీ స్రవంతి భద్రాచలం డివిజన్ అధ్యక్షులు మాల్యశ్రీ, ఉపాధ్యక్షులు టి. దుర్గాచారి, కార్యదర్శి పి. చైతన్య, గౌరవ సలహాదారు ఎన్.సిహెచ్. చక్రవర్తి, కార్యవర్గ సభ్యులు వీదుల రాంబాబు, ఊటుకూరి నాగేశ్వరరావు, స్థానిక కవయిత్రి అభినవ మొల్ల, శ్రీమతి చక్రవర్తుల లక్ష్మీనర్సమ్మ, ఇతర సాహితీ మిత్రులు, అభిమానులు హాజరయ్యారు. సాహితీపరుల సమావేశాలకు, సాహిత్య చర్చలకు, సారస్వత కార్యక్రమాల రూపకల్పనకు ఈ కార్యాలయం కేంద్రంగా, సౌకర్యంగా ఉపయోగపడుతుందని నిర్వాహకులు తెలిపారు.

# జాషువా వర్ధంతి సభలు

ఈ ఏడాది కూడా సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో రాష్ట్రంలో పలుచోట్ల జాషువా వర్ధంతి సభలు, ఆ సందర్భంగా వివిధ కార్యక్రమాలు జరిగాయి. హైదరాబాదు ట్యాంక్‌బండ్‌పై జాషువా విగ్రహానికి సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి పుష్పమాల వేసి నివాళులర్పించారు. జాషువా జీవిత సాహిత్య విశేషాలు పేర్కొన్నారు. ఇంకా స్రవంతి నగర కన్వీనర్ మోతుకూరు నరహరి, హిమజ్వాల తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. వర్షం కురుస్తున్నప్పటికీ పలువురు సాహితీ మిత్రులు పాల్గొన్నారు. ప్రజానాట్యమండలి జగన్,వెంకటరెడ్డి పాటలు పాడారు.

### ఆదోనిలో

కర్నూలుజిల్లా ఆదోని పట్టణంలో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో గుఱ్ఱం జాషువా వర్ధంతి సభ జరిగింది. ఫంక్షన్ హాలు నందు జూలై 24 ఉదయం డివిజన్ కన్వీనర్ ఎస్. భాస్కర్ అధ్యక్షతన జరిగిన సభకు ఆదోని ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల ఆంధ్ర భాషోపన్యాసకులు డాక్టర్ సంజన్న టెలికం రిటైర్డ్ సూపరింటెండెంట్ రచయిత రాఘవాచార్యులు, సాహితీ స్రవంతి జిల్లా కన్వీనర్ ఎం.పి. బసవరాజు, తెలుగు పండిట్లు రాముడు, అంతయ్యలు పాల్గొని ప్రసంగించారు.

సభకు డివిజన్ అధ్యక్షులు ఆవుల బసప్ప ప్రారంభించగా, గుఱ్ఱం జాషువా చిత్రపటానికి డాక్టర్ సంజన్న పూలమాల వేసి నివాళులు అర్పించారు. డాక్టర్ సంజన్న మాట్లాడుతూ సామాన్యుడి జీవితాన్ని, వేదనను 'గబ్బిలం' కావ్యం ద్వారా లోకానికి చాటాడన్నారు. దరిద్రుడి బాధను ఈశ్వరుడికి తెలియజేసేందుకు దూతగా గబ్బిలాన్ని ఎంచుకున్నాడన్నారు. వర్ణ వ్యవస్థకు వ్యతిరేకంగా జాషువా రచనల పరంపర కొనసాగిందన్నారు. కవి రాఘవాచార్యులు మాట్లాడుతే వేమన తర్వాత పద్య కవితకు పెద్ద పీట వేసినది జాషువా అన్నారు. కావ్యాలతో సమాజాన్ని నడిపించారని అన్నారు. టి.జి.ఎల్. పాఠశాల తెలుగు పండిట్ రాముడు మాట్లాడుతూ జాషువా దళిత జాతిని తన రచనల ద్వారా జాగృతపరచిన జాగృతకర్త అని అభివర్ణించారు. ఆయనను అణచివేయాలని ఎందరో కవులు ప్రయత్నించినా అవి ఫలించలేదన్నారు. తెలుగు పండిట్ అంతయ్య మాట్లాడుతూ 'విశ్వనరుడను నేనంటూ ప్రకటించుకున్న' కవి కేవలం దళిత కవి ఎలా అవుతాడని, అతని రచనా ధోరణి ఏ వర్గానికి అనుకూలంగా లేదని ఒక దరిద్రుడి ఆవేదనలే కవితా వస్తువులుగా స్వీకరించాడని అన్నారు. 'ఫిరదౌసి', 'ముంతాజ్ మహల్', 'క్రీస్తు చరిత్ర' తదితర రచనలే కాకుండా ఎన్నో రచనలు చేసి సాహితీ వినీలాకాశంలో ధృవతారగా వెలుగొందారన్నారు. సాహితీ స్రవంతి జిల్లా కన్వీనర్ ఎం.పి. బసవరాజు మాట్లాడుతూ సాహితీ స్రవంతి ఉద్దేశ్యాలను వివరించి, గేయాలాపన చేసి సభికులను ఆకట్టుకున్నారు. సభలో కొంతమంది కవితలను చదివి వినిపించారు. 'ఈవా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పోకెన్ ఇంగ్లీష్' డైరెక్టర్ రవికుమార్, యుటిఎఫ్ జిల్లా సహాధ్యక్షులు రామశేషయ్య తదితర వక్తలు సాహితీ స్రవంతి కార్యక్రమాలను నిర్వహించేందుకు ప్రోత్సహించి ముందుండి నడిపిస్తామన్నారు. సాహితీ స్రవంతి జిల్లా కో-కన్వీనర్ కెంగార మోహన్ వందన సమర్పణతో సభ ముగిసింది.



ఆదోనిలో జాషువా చిత్రపటానికి పూలమాల వేసి నివాళులు అర్పిస్తున్న వక్తలు




కర్నూలులో ప్రసంగిస్తున్న డాక్టర్ ఆదవాని హనుమంతప్ప, వేదికపై జంధ్యాల రఘుబాబు, డాక్టర్ బాలశౌరి, నిసార్ అహ్మద్




హైదరాబాద్‌లో జాషువా వర్ధంతి సభలో ప్రసంగిస్తున్న పార్లమెంట్ సభ్యుడు డాక్టర్ మందా జగన్నాథ్, వేదికపై (ఎడమ నుంచి) వి. చెన్నకేశవులు, బి. శివగోపాల్, తెలకపల్లి రవి, మోతుకూరి నరహరి, ఎ. సత్యభాస్కర్, డాక్టర్ అద్దేపల్లి రామ్మోహనరావు, ఎల్. ధనుంజయ

# విజయవాడలో 'వేలిముద్ర' ఆవిష్కరణ

సమకాలీన సమస్యలను ఆకళింపు చేసుకుని వాటికి పరిష్కార మార్గాన్ని ఎత్తిచూపడం వర్ధమాన రచయితల తక్షణ కర్తవ్యమని సాహితీ స్రవంతి కన్వీనరు, ప్రస్థానం ఎడిటర్ తెలకపల్లి రవి అన్నారు. కవి గుఱ్ఱం జాషువా 34వ వర్ధంతి సందర్భంగా ఆదివారం విజయవాడ బుక్ ఫెస్టివల్ సొసైటీ హాలులో సంస్మరణ సభ నిర్వహించారు. ఈ కార్యక్రమాన్ని విజయవాడ - గుంటూరు సాహితీ స్రవంతి సమాఖ్య నిర్వహించింది. ఈ సంస్మరణ సభలో ప్రధాన వక్తగా పాల్గొని రవి ప్రసంగించారు. సుకవి జీవించు ప్రజల నాల్కల మీద అన్నట్లుగా యువ రచయితలు ప్రజలకు చేరువైన కవిత్వం రాయాలని అన్నారు. జాషువా తన పద్య కావ్యంలో పేదరికం, కులవిక్షతను ఎత్తి చూపి ఆనాడే ఈ సమస్య జటిలంగా ఉందని గుర్తించి తన రచనలను సాగించారన్నారు. శ్రీ శ్రీ వర్గ స్పృహతో వచన కవితను సృష్టించి దగాపడిన తమ్ముళ్లను, తాడిత, పీడిత జనావళిని ప్రస్తావించడంలో అర్ధం ఉందని అన్నారు. 90వ దశకం నుండి నూతన ఆర్థిక విధానాలు ప్రబలడంతో పాటు స్త్రీ వాద సాహిత్యం కూడా చోటు చేసుకుందని, అయితే గురజాడ వలే జాషువా స్త్రీ వాదాన్ని వినిపించడంలో కొంచెం వెనుకడుగు వేశారని అన్నారు. వేయిపడగలు సృష్టించిన విశ్వనాథ సత్యనారాయణ కవిత్వం కాదని, ఆయనకు భిన్నంగా గురజాడను, జాషువాను ఒక పక్కకు చేర్చాల్సి ఉంటుందని చెప్పారు. ఆనాడే జాషువా దళిత వాదాన్ని తన గబ్బిలంలో ప్రస్తుతించి కుల వివక్షతకు వ్యతిరేకంగా నినదించిన మహాకవి అన్నారు. సాహితీ స్రవంతి విజయవాడ - గుంటూరు సమాఖ్య వెక్కిరించిన 'వేలి ముద్ర' పేరుతో కవితా సంకలనాన్ని తీసుకురావడం ముదావహమన్నారు.



'సాహితీ స్రవంతి' విజయవాడ - గుంటూరు శాఖలు సంయుక్తంగా వెలువరించిన "వెక్కిరించిన వేలిముద్ర" కవితా సంపుటిని ఆవిష్కరిస్తున్న సాహిత్య ప్రస్థానం ఎడిటర్ తెలకపల్లి రవి. వేదికపై కవులు అరసవిల్లి కృష్ణ, ఎస్. అశోక్‌కుమార్, ఆంధ్ర లయోలా కళాశాల తెలుగు రీడర్ గుమ్మ సాంబశివరావు

ఆంధ్ర లయోలా కళాశాల తెలుగు రీడర్ గుమ్మ సాంబశివరావు మాట్లాడుతూ మహాత్మాగాంధీ ప్రబోధించిన అహింస, శాంతి సందేశాన్ని జాషువా ఆనాడే తన కవిత్వంలో మలిచారన్నారు. 'గబ్బిలం'లో లోకపు వేదనను తన వేదనగా జాషువా మలిచి ప్రజల్ని ఆలోచింప చేయడంలో కృతకృత్యులయ్యారన్నారు. నేడు దళితులను పట్టి పీడిస్తున్న అనైక్యత మీద జాషువా ఆనాడే చెప్పారని సాంబశివరావు తనదైన శైలిలో జాషువా రాసిన పద్యాలను సభ ముందు ఉంచారు. పార్థివనామ సంవత్సరం ఉగాది సందర్భంగా సాహితీ స్రవంతి నిర్వహించి కవితా పఠనంలో వచ్చిన కవితలను 'వెక్కిరించిన వేలిముద్ర'గా సంపుటీకరించిన సంకలనాన్ని వక్తలు తెలకపల్లి రవి, గుమ్మా సాంబశివరావు ఆవిష్కరించారు. ఈ సంకలనంపై ప్రముఖ రచయిత అరసవిల్లి కృష్ణ సమీక్షించారు. సభకు రచయిత ఎస్. అశోక్‌కుమార్ అధ్యక్షత వహించగా, మరో రచయిత ఎం.వి. ఆంజనేయులు స్వాగతం పలికారు.

**- రామకృష్ణ, విజయవాడ**



# 'చప్రలు' ఆవిష్కరణ

సెప్టెంబర్ 4న ప్రకాశంజిల్లా చీమకుర్తిలో జరిగిన శతాధిక కవి సమ్మేళనం వేదికపై చలపాక ప్రకాష్ రచించిన చప్రలు పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న ప్రముఖ కవి, సంతనూతలపాడు శాసనసభ్యులు శ్రీధార సాంబయ్య.

సినీ రచయిత శ్రీ ఎం.వి.ఎస్. హరనాథరావు, యువకవి శ్రీ పొన్నూరు వేంకట శ్రీనివాసులు, ప్రకాశంజిల్లా రచయితల సంఘం అధ్యక్షులు శ్రీ బి. హనుమారెడ్డి, యువకవి చలపాక ప్రకాష్ తదితరులు ఉన్నారు.




ఎన్. అరుణ రచించిన 'పాటల చెట్టు' కవితా సంపుటిని డాక్టర్ సి. నారాయణరెడ్డి హైదరాబాద్‌లో ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో కిన్నెర కార్యదర్శి మద్దాలి రఘురాం, గుడిపాటి, ఆంధ్రప్రభ సంపాదకుడు సతీష్ చందర్, కవయిత్రి అరుణ, సభాధ్యక్షులు జింబో, ఓల్గా, డాక్టర్ అడివి సూర్యకుమారి ఉన్నారు.

# 'నానీ' ఆవిష్కరణ

కాలం కంటే కవి గొప్పవాడని, ప్రజల హృదయాల్లో కలకాలం జీవిస్తాడని, తెలుగు విశ్వవిద్యాలయం మాజీ వైస్ ఛాన్సలర్ ఆచార్య ఎన్. గోపి అన్నారు. ఆదివారం ఉదయం లయన్స్ కమ్యూనిటీ హాల్లో ఆప్కో ఆడిటర్ పి. లక్ష్మణరావు రచించిన 'నానీ' కవితా సంపుటిని ఆయన ఆవిష్కరించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ నానీలో ఉన్నవి మినీ కవితలు కావని, వచన కవిత్వంలో అంతర్భాగమన్నారు. లక్ష్మణరావు కవితల్లో అక్షరాలు కాంతివంతమైనవని, సమాజం సంక్షేమానికి మార్గం చూపుతాయన్నారు.

సభకు అధ్యక్షత వహించిన యువ స్పందన కన్వీనర్ డాక్టర్ రామసూరి మాట్లాడుతూ సాహిత్య రంగంలో యువత చైతన్య పథంలో పయనించాలన్నారు.

గ్రంథ సమీక్షకులు డాక్టర్ టి. పృధ్వీరాజ్ మాట్లాడుతూ నానీ కవితల్లో పిల్లలపై టీవీల ప్రభావం, సరస్వతిని లక్ష్మిగా మారుస్తున్న కార్పొరేట్ విద్యాలయాల తీరు, స్త్రీల సమస్యలు, అవకాశంవాదం వంటి పలు సమస్యల్ని అందంగా ఆవిష్కరించారన్నారు. ఈ కార్యక్రమంలో విజయ భావన కార్యదర్శి డాక్టరు ఎ. గోపాలరావు, జిల్లా రచయితల సంఘ అధ్యక్షులు డాక్టర్ బి.ఎస్.ఎన్. మూర్తి తదితరులు పాల్గొన్నారు.



పి. లక్ష్మణరావు రచించిన 'నావి – నీవి' ని డాక్టర్ ఎన్. గోపి ఆవిష్కరిస్తున్న చిత్రం

# "కలువకుంట నానీలు" పుస్తకావిష్కరణ

డాక్టర్ కలువగుంట రామకృష్ణ రచించిన "కలువకుంట నానీలు" పుస్తకాన్ని కరీంనగర్‌జిల్లా మెట్‌పల్లి పట్టణంలోఆచార్య ఎన్. గోపిచే ఆగస్టు 21న ఆవిష్కరించారు. జాతీయ సాహిత్య పరిషత్, మెట్‌పల్లి శాఖ అధ్యక్షులు డాక్టర్ డెంగరి రామాచార్య అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో ఆచార్య ఎన్. గోపి మాట్లాడుతూ – రామకృష్ణ ఇప్పటికే కవిగా తన సమర్ధతను ఐదు కవితా సంపుటాల ద్వారా నిరూపించుకున్నాడనీ, ఎక్స్‌రే – రంజని – కుందుర్తి వంటి ప్రతిష్టాత్మక అవార్డులు గెలుచుకున్నాడన్నారు. నానీల ప్రక్రియ ఒక దేశి ప్రక్రియగా తెలుగులో వ్యాప్తమవుతుందన్నారు. సాహిత్య సంబంధం రక్తసంబంధం కన్నా గొప్పదని పేర్కొన్నారు. ఎన్. అరుణ మాట్లాడుతూ – దీర్ఘ కవితల కన్నా చిన్న నిడివి గల కవితలు రచించడం కష్టమన్నారు – డాక్టర్ సంగనభట్ల నరసయ్య నానీలలో కవి చూపిన రూప నిర్మాణ శైలులను విశ్లేషించగా, డాక్టర్ అందె వెంకట్రాజు కవిత్వంలో సమాజ స్థితిగతులను స్థానీయతా ముద్రతను గురించి మాట్లాడారు. డాక్టర్ పత్తిపాక మోహన్, డాక్టర్ నారాయణశర్మలు పుస్తక సమీక్ష చేశారు. అన్నవరం దేవేందర్ కవిత్వంలోని మెళకువలను పరిచయం చేశారు. వాసాల వేంకటేశ్వర్లు కవిని గురించి అభినందనలు తెలియజేశారు. తెలంగాణా గొంతుకల్లో ఇది బలమైన గొంతుకగా కవులు ముక్తకంఠంతో అభిప్రాయం వ్యక్తం చేశారు.



"కలువకుంట నానీలు" పుస్తకావిష్కరణ దృశ్యం.
చిత్రంలో ఎడమ నుండి కుడికి వరుసగా డాక్టర్ డింగరి రామాచార్య,ఎన్. అరుణ, ఆచార్య ఎన్. గోపి, డాక్టర్ కలువకుంట రామకృష్ణ, డాక్టర్ అందె వేంకటరాజు, డాక్టర్ సంగనభట్ల నరసయ్య

# ఘంటశాల నిర్మలకు ఫ్రీవర్స్ ఫ్రంట్ పురస్కారం

ఫ్రీ వర్స్ ఫ్రంట్ 35వ పురస్కారాన్ని కవయిత్రి ఘంటసాల నిర్మల 'నిర్వచనం' కవితా సంపుటికి గాను ప్రదానం చేశారు. కవితా వస్తువు ఎంపికలోనే వైవిధ్యం కనబరుస్తూ ఘంటసాల నిర్మల అందరినీ అలరించే కవితలు రాయగలుగుతున్నారని పలువురు సాహితీవేత్తలు ప్రశంసించారు. సెప్టెంబర్ 9న ఈ కార్యక్రమం బాగ్‌లింగంపల్లిలోని సుందరయ్య కళానిలయంలో జరిగింది. కవి, సాహిత్య అకాడమీ గ్రహీత కె. శివారెడ్డి, కాకతీయ విశ్వవిద్యాలయం పూర్వ ఆచార్యులు డాక్టర్ కోవెల సంపత్కుమారాచార్య, ఆచార్య కాత్యాయనీ విద్మహే తదితరులు పాల్గొన్నారు. ఆమె కవితలో ఉన్నతమైన ముద్ర ఉందని అన్నారు. 'ఫ్రీవర్స్ ఫ్రంట్' వంటి సంస్థ పురస్కారాన్ని అందుకోవడం సాహిత్యకారులు ప్రతిష్టాత్మకంగా భావిస్తారని తెలిపారు. ఇప్పటి వరకు తమ సంస్థ పురస్కారాలను అందుకున్న వారి విశేషాలతో, వ్యాసాలతో వచ్చే ఏడాది ఒక సంకలనం తీసుకురావాలన్న యోచన ఉన్నట్లు చెప్పారు. ఈ సందర్భంగా ఘంటసాల నిర్మలను అభినందించారు.



నిర్మలకు పురస్కారాన్ని అందజేస్తున్న కోవెల సంపత్కుమారాచార్య







కోకు వర్ధంతి సభలో మాట్లాడుతున్న ఓల్గా, వేదికపై కేతు విశ్వనాథరెడ్డి, తెలకపల్లి రవి, హాజరైన సాహితీ మిత్రులు

# సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యాలయం ప్రారంభం

విశాల ప్రగతిశీల సాహిత్య వేదిక సాహితీ స్రవంతి. రాష్ట్రవ్యాప్తంగా అనేక కార్యక్రమాలు నిర్వహించి, అనతికాలంలోనే పలువురి ఆదరణ పొందిన సంగతి సాహితీ మిత్రులకు, సాహితీకారులకు తెల్సిందే. గత మాసం ఆగస్టు 17వ తేదీన సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యాలయం, హైదరాబాద్‌లో ప్రారంభమైంది. కొడవటిగంటి కుటుంబరావు 25వ వర్ధంతి సభతో కార్యాలయం ప్రారంభమవడం విశేషం. ఈ సభకు సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి అధ్యక్షత వహించారు. కొడ పుటాల సంపాదకుడుగా కేతు విశ్వనాథరెడ్డి కొడపై పరిశోధన చేసిన ఓల్గా ప్రసంగించారు. కుటుంబరావు కుటుంబ సభ్యులు కూడా రావడం అందరినీ సంతోషపరిచింది.

కార్యాలయం ప్రారంభించడం పట్ల హైదరాబాద్‌లోని సాహిత్య మిత్రులు హర్షం వ్యక్తం చేశారు. సాహిత్య సృజనకు, చర్చకు ఒక కేంద్రంగా ఇది మారుతుందన్న ఆశాభావాన్ని తెలిపారు. ఈ కార్యాలయం ఇక మీదట సాహిత్యానికి సంబంధించిన పూర్తి సమాచారాన్ని అందించనుంది. అందుకోసం కొత్తగా వస్తున్న పుస్తకాలతో పాటు, గతంలో సాహిత్య చరిత్రకు ప్రామాణికంగా నిలిచిన చారిత్రక, సిద్ధాంత గ్రంథాలను కూడా ఇందులో పొందుపరచడం జరుగుతుంది. సాహిత్య పత్రికలు, దిన, వార, మాస, వార్షిక సంచికలు, రిఫరెన్స్ కోసం కావలసిన పుస్తకాలు సేకరించి అధ్యయనానికి అందుబాటులో వుంచుతామని తెలకపల్లి రవి తెలిపారు. సాహిత్య సభలు, సమావేశాలు కూడా రెగ్యులర్‌గా జరుపుకోవడానికి ఈ కార్యాలయం అనుకూలంగా ఉంది.

ఈ కార్యాలయ ప్రారంభోత్సవ కార్యక్రమంలో ఇంకా జ్వాలాముఖి, అద్దేపల్లి రామ్మోహనరావు, రత్నమాల, సత్యభాస్కర్, శాంతారావు, గేరా, బి.ఎస్. రాములు, యాకూబ్, కె.పి. అశోక్‌కుమార్, జిలుకర శ్రీనివాస్, అచ్చిన అయిలయ్య, ద్వా.నా. శాస్త్రి, పసునూరి రవీందర్, కె. లక్ష్మయ్య, యాదగిరిరావు, మోతూకూరు నరహరి, శేఖర్, అక్కినేని కుటుంబరావు తదితరులు పాల్గొన్నారు.

# 'సాగర ఘోష'కు పురస్కారం

వరంగల్ కేంద్రంగా, సహృదయ సాహిత్య సాంస్కృతిక సంస్థ, గత తొమ్మిది సంవత్సరాలుగా, సహృదయ సాహితీ పురస్కారం అందిస్తూ వస్తున్నది.

ఈ సంవత్సరం పురస్కారం కోసం 31 ఎంట్రీలు వచ్చాయి. వీటిల్లో కాకినాడకు చెందిన డాక్టర్ గరికపాటి నరసింహారావుగారి 'సాగర ఘోష' పద్యకావ్యం పురస్కారాన్ని గెలుచుకుంది. న్యాయనిర్ణేతలుగా, హైదరాబాద్‌లోని కేంద్రీయ విశ్వవిద్యాలయం తెలుగు అధిపతి ప్రొఫెసర్ తారక రామబ్రహ్మంగారు, వరంగల్‌కు చెందిన ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు.

ఆగస్టు 21న హన్మకొండలోని ఆర్ట్స్ కాలేజి ఆడిటోరియంలో జరిగిన సహృదయ తొమ్మిదవ వార్షికోత్సవ సభలో డాక్టర్ గరికపాటికి పురస్కార ప్రదానం చేయబడింది. అనంతరం అవార్డు గ్రహీత ప్రధానోపన్యాసం చేసి ఆహుతులను అమితంగా ఆకట్టుకున్నారు.



సహృదయ సాహిత్య పురస్కార ప్రధానోత్సవం

వార్షికోత్సవంలో భాగంగా చివరి శ్రీ పి. అనంతకుమార్ దర్శకత్వంలో రచయిత ఆకెళ్ళ రచించిన 'భవదీయులు' సాంఘిక నాటికను సహృదయ సభ్యులు ప్రదర్శించారు.

# పిల్లల ఆటా... పాటా...

- శైలి

"పొన్నా చెట్టు కింద ఓ బావా!... నా బావా!

బొమ్మాలు చెక్కేటి నా బావా!

రాతి బొమ్మాలు చెక్కేటి ఓ బావా!"

మల్లీశ్వరి చిత్రంలోనిది ఈ గీతం. నాగరాజు, మల్లీశ్వరిలు బావా మరదళ్ళు. చిన్నప్పటి నుండి వాళ్ళిద్దరూ ఆడుకుంటూ ఉంటారు. పాడుకుంటారు. వారికంటూ ఓ స్వంత ప్రపంచాన్ని వారి ఆలోచనలతోనే నిర్మించు కుంటారు. అప్పుడు బాలశిల్పి నాగరాజు అంటాడు ధీమాగా...

'మల్లీ నీవిలాగే చూస్తూ ఉండు ఎప్పుడో ఒకప్పుడు నీ బొమ్మ చెక్కేస్తాను'.

'మరి బొమ్మ నాలాగా మాట్లాడుతుందా? అని మల్లి ఆటపట్టిస్తోంది.

'మాట్లాడదు గాని పోట్లాడదు' అని నాగరాజు టక్కున బదులిస్తాడు.

"పో బావా"? అంటూనే బుడ్డి మల్లికి బుంగమూతి సాక్షాత్కారం అవుతుంది.

ఈ సన్నివేశం చాలా చిన్నదే కావచ్చు.

ఆట, పాట, శిల్పం, ఊహ, స్నేహం, ఆనందం, జీవితం, భవితవ్యం... అంతా ఓ విశాలమైన బాలల జగత్తును కళ్ళ ముందుంచుతుంది. అందుకే

"వాన కురిస్తే.. మెరుపు మెరిస్తే..

ఆకశాన హరివిల్లు విరిస్తే..." అది తమకే (పిల్లకే) స్వంతం" అని శ్రీశ్రీ అక్షర ముత్యాలను ఏరిపెట్టాడు కదా!

మనిషి వ్యక్తిగతంగా స్వంతం చేసుకోలేని అందమైన ఆస్తి ఏదైతే ఉంటుందో అదంతా బాలలదేనని ఘంటాపథంగా చెప్పాడు. మరి అలాంటి బాలల ప్రపంచంలోకి అరమరికలు లేకుండా వెళ్ళి పిల్లల్లో పిల్లాడిలా కలిసిపోయి ఆ స్వచ్ఛమైన ఆనందం పొందడం అందరికీ సాధ్యమా? అందునా ఈ స్వార్థపూరితమైన యాంత్రికయుగంలో.. ఎవరికి వారు పరిశీలించుకోవాల్సిందే.

పిల్లలకు ఆటలంటే పాటలంటే చాలా ఇష్టం. సరదా. కాని ఎవరు నేర్పుతారు? ఒకప్పుడైతే అమ్మ కొన్ని నేర్పేది. లాలిపాటల పాడేది. అమ్మమ్మలు, నాయనమ్మలు, జేజెమ్మలు



నేర్పేవాళ్ళు. చక్క చక్కటి కథలు చెప్పేవాళ్ళు. గుళ్ళో భజనలు చేసేవాళ్ళు. పండుగలొస్తే కోలాటం, చక్క భజనలు చేసేవాళ్ళు. వాటిల్లో పిల్లలు కలిసిపోయేవాళ్ళు.

అప్పుడప్పుడు తోలుబొమ్మలాట, బిందు యక్షగాన బాగోతపోళ్ళు వచ్చేవాళ్ళు. భలే భలే వేషాలు గట్టేటోళ్ళు. వాటిని చూసి పిల్లలు ఆ తెల్లారి రంగులు పూసుకోవడం, తాటిపీచు మీసాలు పెట్టుకోవడం, దరువు కొడ్తూ అడుగులు వేయడం, చెట్లెక్కి కొక్కిరాయి రాగాలు తీయడం ఇవన్నీ చేసేవాళ్ళు.

బళ్ళో పంతుళ్ళు కూడా మంచి మంచి పాటలు, ఆటలు, చివరికి నాటకాలు కూడా నేర్పించేవాళ్ళు. మరి ఇప్పుడు ఆ పిల్లల ఆట పాట వాతావరణం ఏమయిందబ్బా! అని బుగ్గలు నొక్కుకోవాల్సి వస్తున్నది.

సరే! ఆ కారణాల జోలికి ఇప్పుడే పోకుండా మళ్ళీ ఆ పిల్లల్లో పిల్లల్లా కలిసిపోయి ఆ వాతావరణ ఛాయల్ని స్పృశిద్దాం. ఆనందాన్ని అనుభవిద్దాం అనే ఆలోచనకు వచ్చింది ప్రజానాట్యమండలి.

ప్రభుత్వ పాఠశాలలు అవి పంచాయతీవా? మున్సిపాల్టీవా? లేక జిల్లా పరిషత్‌వా? ఏవైనా కావచ్చు. వాటిని కేంద్రంగా చేసుకుని ఆ పాఠశాల పిల్లలకి కొన్ని ఆట పాటలు నేర్పి వారి నుండి మరెన్నో నేర్చుకోవాలి అనే లక్ష్యంతో వెళ్ళింది. ఊహించిన దానికంటే ఎక్కువ స్పందన వచ్చింది. ఈ ప్రభుత్వ పాఠశాలలో చదువుకొనేది ఎక్కువగా పేద పిల్లలు. ఆ పాఠశాలల్లో సరైన సౌకర్యాలు ఉండవు. ప్రైవేట్ కాన్వెంట్ పిల్లలతో పోల్చుకున్నప్పుడు ఆధునిక సమాజంలో ఎంతో కొంత నిరాదరణకు ఈ పిల్లలు గురవుతుంటారు. ఈ సంగతి తెలిసిందే.

అలాగే గిరిజనుల్లో బాలలు, దళితుల్లో బాలబాలికలు, బలహీనవర్గాల్లో బాలికలు ఈ పాఠశాలల్లో ఎక్కువగా చదువు కుంటారు. సమాజంలో కొనసాగుతున్న ఆర్థిక, సామాజిక, లింగవివక్షతకు ఇదొక తార్కాణం.

అయితే అణగారుతున్న ఈ పిల్లలు అచ్చమైన జానపద కళా సంస్కృతీ ప్రదాతల నిజమైన వారసులు అని మనం మరువరాదు. పైనుండి ఆలోచనల్లోనూ, ఆచరణల్లోనూ మెట్టు మెట్టు దిగుకుంటూ వారి స్థాయిని చేరుకునే ప్రజ్ఞ, ఓర్పు, నేర్పు నేర్చుకున్నకొద్దీ ఆ బాలల ప్రాపంచిక మాధుర్యాన్ని అనుభవించడం సాధ్య మవుతుందనే విషయం అవగతమవుతుంది.

ఓ మంచి పాట, ఓ మంచి ఆట నేర్పితే వారికి అర్థమయ్యే రీతిలో విడమరిచి నేర్పిస్తే అది త్వరగానే గ్రహిస్తున్నాడు. చాలా ఆనందంగా నేర్చుకుంటున్నాడు. కొత్త విషయాలు నేర్చుకుంటున్నాం. నలుగురు మధ్య ప్రదర్శించి గుర్తింపు పొందుతున్నాం. అనే అనుభూతి వారిని పరవశానికి లోనుచేస్తుంది.

చదువు ప్రాముఖ్యతను తెలిపే అక్షరాస్యతా జీతాలు. పర్యావరణ, విజ్ఞాన విషయాలు తెలిపే శాస్త్ర జ్ఞాన గీతాలు, దేశభక్తి గీతాలు, మత సామరస్య గీతాలు, సామాజిక



# మళ్ళీమానేశాక

- రమణ జీవి



కొత్త ఎండాకాలపు
గుండు సూదుల ఉదయం
సూర్యుడి వేడి వేడి వాసనలు
ఎండను కొరికి
తొక్కల్ని ఉమ్మేస్తూ...

ఉప్పటి నీడలు...

రంగుల్ని గుర్తించడం మానేసిన కన్ను
తల్లోని చీకటి నిండా
నిరంతరాయంగా
అవయవాల చప్పుళ్లు
నాలోకి దిగబడిపోయిన
కళ్ళనీ చెవుల్నీ ఆలోచనల్ని
ఎగరేసే ప్రయత్నం

చర్మంలేని నాటకం

మట్టిలో ఆకాశాన్ని వొంపి
ముద్ద చెయ్యాలనే
అబద్ధపు ప్రయాస

ఏమీ కాకుండానే అంతా అయిపోయాక
అలిసిన నా -
నాలుగు మూలల్లో డ్రాయింగ్ పిన్స్
నా-
ఫెయిల్యూర్‌నంతా
ఒక నలుచదరపు నిశ్శబ్దంలోకి
సేకరిస్తూ
అపుడు రంగుల్ని
గుర్తించడం పునర్ మానేస్తూ...
పునర్ పునర్ మానేశాక
ఆకాశమూ నేలా ఏకమైనా
గొడుగులోని
లేతబారిన కళ్లలో
నిజమూ అబద్ధమూ లేని
కొండలాంటి చెట్టు నీడలో
ఒక కుంచె విశృంఖల వర్ణచాలనం
నిద్రిస్తున్న అవయవాల
నడుమనించయితేనేం
ఒకే స్పృహ...

---

## పిల్లల ఆటా... పాటా... (తరువాయి)

అభ్యుదయ గీతాలు ఇవన్నీ చాలా చక్కగా నేర్చు కుంటున్నారు. గీతాలకనుగుణంగా నృత్యాలు చేస్తున్నారు. ఎక్కువ భాగం బృందగానాలే.

అయితే ఇది ఒకవైపు మాత్రమే...

మరోవైపు వారి విశ్వాసాన్ని చూరగొని వారి సాంస్కృతిక మూలాలను సృజిస్తే.. అప్పుడు చూడాలి. నాసామిరంగా... వారి విజృంభించే తీరు... వారి విశ్వరూపం... దాని గుణాత్మకంగా అర్థం చేసుకొని రంగంలో పెడితే అద్భుత కళాఖండాలు ఉద్భవించగలవనే విషయం కూడా అవగతమవుతుంది.

ఆగస్టు 15వ తేదీ స్వాతంత్ర్య దినం సందర్భంగా ఓ పక్షం రోజుల పాటు ఈ బాలల కళోత్సవాలను (చిల్డ్రన్ ఆర్ట్ ఫెస్టివల్) ప్రజానాట్యమండలి నిర్వహించింది.

ఆషాడమాసం సందర్భంగా బోనాల పండుగలు, శ్రావణ పూర్ణిమ రాఖీ పండుగలు ఈ వాతావరణాలు కూడా ఈ ఉత్సవాల్లో భాగస్వామ్యం అయిపోయాయి. పిల్లలందరూ ఉన్నంతలో మంచి బట్టలు చక్కగా వేసుకోవడం, మేకప్‌లు వేసుకోవడం కన్పించింది. కాన్వెంట్ పిల్లలు ఎలాగైతే తమ తల్లిదండ్రుల్ని స్కూల్ ఫెస్టివల్ సకు బలవంతంగా తీసుకువెళ్తారో ఈ పిల్లలు కూడా వారి తల్లిదండ్రుల్ని ఈ ఉత్సవాలకు వెంట తీసుకువచ్చారు. పిల్లలు పాడే పాటలు, ఆటలు చూసి వారు ఆనందంతో ముచ్చట పడ్డారు.

అశ్లీలత అంటు సోకని వారి సహజమైన జానపద గీతాలు విని పులకించి పోయారు. ఇదంతా ఒక ఎత్తు. అతిథులుగా వచ్చిన ప్రముఖులు, అధికారులు, పాత్రికేయులు చాలా సంభ్రమాశ్చర్యాలు వ్యక్తం చేయడం మరో ఎత్తు. ఎందుకంటే ఎవ్వరూ పట్టించుకోని, ఏ సహాయమూ నోచుకోని ఈ ప్రభుత్వ పాఠశాలల పిల్లల్లో ఇంత కళాశక్తి నిబిడీకృతమై ఉన్నదా! అని విస్తుపోయాడు. ఉపాధ్యాయులపై, ప్రజానాట్యమండలి ప్రశంసల జల్లులు కురిపించారు. కొందరు ప్రైవేట్ కాన్వెంట్ వాళ్ళకయితే బాహాటంగానే అసూయను వెళ్ళ గక్కారు కూడా. దీనికి చింతించనక్కర్లేదనుకోండి.

నిజంగానే నీలాకాశంలోఈ పిల్లలు మెరుపు మెరిపించారు. వాన కురిపించారు. హరివిల్లు విరిపించారు. స్వంతం చేసుకున్నారు. ఆట పాటలతో విజ్ఞానవంతులై ఇలా వికసిస్తూ పోతే సుందరమైన శైలి భారత భవితకు కొరతేముంది!

# నిషేధ కారణాలు నిజం కాదు : విరసం

**తమపై నిషేదం విధించడం సరికాదంటూ విరసం రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి మోహన్ కందాకు మెమోరాండం సమర్పించింది. నిషేధానికి ప్రభుత్వం పేర్కొన్న కారణాలు సరైనవి కావని ఒక్కొక్క అంశానికి విడిగా అందులో సమాధానమిచ్చింది. సమాచారం కోసం దాన్ని ప్రచురిస్తున్నాం:**

**విషయం** : జి.ఓ.ఎం.ఎస్. నెం. 373, తేదీ : 17-8-2005, జనరల్ అడ్మినిస్ట్రేషన్ (ఎస్.సి.ఎ) శాఖ – ఆంధ్రప్రదేశ్. ప్రజా భద్రతా చట్టం, 1992 – విప్లవ రచయితల సంఘాన్ని చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించిన ప్రకటన – విరసం సమాధానం.

**రెఫరెన్స్** : 1. వార్త దినపత్రిక, తేదీ : 19/8/2005, పేజి 8, 9
2. వార్త దినపత్రిక, తేదీ : 28/8/2005, పేజి 8
3. ఆంధ్రప్రదేశ్ ప్రజా భద్రతా చట్టం, 1992, సెక్షన్ 4

పైన ఉదహరించిన రెఫరెన్స్ 2 ప్రకారం ఒక సంస్థని చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటిస్తూ పత్రికలో ప్రకటన జారీ చేసిన 15 రోజులలోగా సంబంధిత సంస్థ తన వాదనని ప్రభుత్వానికి వినిపించడానికి వున్న హక్కుని వినియోగించుకుంటూ విరసం ఈ కింది వాస్తవాలని ప్రభుత్వ దృష్టికి తేదలచుకున్నది. విప్లవ రచయితల సంఘం (విరసం) వాదనలని నోటిఫికేషన్‌లో ఉదహరించిన సెక్షన్ 4 ప్రకారం ప్రభుత్వం ఏర్పాటు చేసిన సలహా మండలి ముందు ఉంచవలసి ఉంటుంది. సలహా మండలి ముందు విరసం తన వాదనలని వ్యక్తిగతంగా వినిపించుకోవడానికి సెక్షన్ 4 ఇచ్చిన అవకాశాన్ని కూడా వినియోగించుకోదలచుకున్నది.

రెఫరెన్స్ 1లో ప్రభుత్వం విరసంపై చేసిన ఆరోపణలన్నీ సత్య దూరాలు, నిరాధారమైన ఆరోపణలపై ఆధారపడి విరసంని చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించడం అసమంజసం. అంతేగాక భారత రాజ్యాంగంలోని అధికరణం 19లో పేర్కొన్న భావ ప్రకటనా స్వేచ్ఛకు, వాక్సభా స్వాతంత్ర్యాలకు, సంస్థా నిర్మాణ స్వేచ్ఛకు భంగకరమని విరసం భావిస్తున్నది. అత్యంత నిరంకుశమైన నియంతృత్వ పాలనలలో కూడా రచయితల సంఘాలను నిషేధించడం జరగలేదు. ప్రజాస్వామిక ప్రభుత్వమని చెప్పుకుంటున్న ఈ ప్రభుత్వానికి ఒక రచయితల సంఘాన్ని చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించే హక్కు లేదు.

ప్రభుత్వం పేర్కొన్నట్టుగా విరసం భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్ట్)కి అనుబంధ సంస్థ కాదు. విరసం 35 సంవత్సరాలుగా తెలుగు సాహిత్య సాంస్కృతిక రంగాలలో బహిరంగ కృషి సాగిస్తున్న స్వతంత్ర సంస్థ. విరసంకు ఏ పార్టీతోను నిర్మాణపరమైన సంబంధాలు లేవు. విరసం నిర్మాణం, విరసం సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలు విరసం సభ్యుల ఆమోదానికి లోబడి మాత్రమే జరుగుతాయి.

నోటిఫికేషన్‌లోని రెఫరెన్స్ 1లో విరసంను చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించడానికి 9 కారణాలు చూపారు. వాటికి ఇరసం ఈ కింది విధంగా అభ్యంతరాలు తెలియజేస్తోంది :

1. ప్రభుత్వం ఆరోపించినట్లుగా విరసం భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) లేదా ఏ ఇతర రాజకీయ పార్టీ ప్రయోజనాలనీ, లక్ష్యాలనీ నెరవేర్చడానికి సాధనంగా ఎన్నడూ ఉపయోగపడలేదు. విరసంకు స్వతంత్రమైన, స్పష్టమైన సాహిత్య, సాంస్కృతిక లక్ష్యాలున్నాయి. వాటిని నెరవేర్చడానికి గత 35 సంవత్సరాలుగా విరసం కృషి చేస్తున్నది. ఈ సాహిత్య, సాంస్కృతిక లక్ష్యాలకు పునాది అయిన తాత్విక దృక్పథం మరే సంస్థకైనా ఉన్నంత మాత్రాన ఆ సంస్థతో విరసంకు అనుబంధం ఉన్నట్లు చెప్పడానికి వీల్లేదు. విరసం సభ్యులు నిర్దేశించిన ప్రణాళిక, నిబంధనావళి ప్రకారం "సర్వ సభ్య సమావేశమే విరసంలో అత్యున్నత సంస్థ. విధాన నిర్ణయాలు చేయడానికి కార్యనిర్వాహక వర్గాన్ని, కార్యవర్గాన్ని ఎన్నుకోవడానికి దానికి అధికారం ఉంటుంది. సభ్యత్వాన్ని ఆమోదించడంలో లేదా రద్దు చేయడంలో దానిదే తుది అధికారం. సంస్థ ప్రణాళికను, నియామవళిని మార్చే అధికారం కూడా సర్వ సభ్య సమావేశానిదే" (విరసం ప్రణాళిక – నియమావళి 6 : ఊ). (చూ. అనుబంధం – 2)
2. ప్రభుత్వం ఆరోపించినట్టుగా విరసం ప్రజలని ఎప్పుడూ చట్ట వ్యతిరేక పద్ధతులలో సమీకరించలేదు. ప్రభుత్వం ఆరోపించినట్టుగా హింస, ఉగ్రవాదం, గుండాయిజం కార్యకలాపాల్లో విరసం ఎప్పుడూ పాల్గొనలేదు. ప్రచారం చేయలేదు, ప్రోత్సహించలేదు. 35 సంవత్సరాలలో విరసం కార్యకలాపాలన్నీ చట్టబద్ధంగా, బహిరంగంగా, వేలాదిమంది ముందు జరిగినవే. సంస్థ ఎన్నడూ ప్రజల మనసులలో భయాందోళనలు సృష్టించలేదు. "వ్యక్తుల మధ్య అసమాన, ఆధిపత్య సంబంధాలన్నింటినీ విరసం వ్యతిరేకిస్తుంది. శారీరక శ్రమకు, మేధోశ్రమకు మధ్య, పట్టణ గ్రామీణ ప్రాంతాలకు మధ్య, విద్యావంతులకు విద్యలేని వారికి మధ్య, వ్యక్తీకరణ శక్తి ఉన్న వారికీ, లేనివారికీ మధ్య వున్న అగాధాన్ని పూడ్చడానికి విరసం చైతన్యయుతంగా పనిచేస్తుంది." (ప్రణాళిక – 16) అని విరసం ప్రణాళికలో ఉన్నది. హింస, ఉగ్రవాదం, గూండాయిజంలను వ్యతిరేకించడం మాత్రమే కాక సమాజంలో నెలకొన్న దోపిడీ, పీడన, వివక్షతలకు గురి అవుతున్న ప్రజలలో మానసిక స్థైర్యాన్ని కలిగించడం, ప్రజల మధ్య అనేక కారణాల వల్ల ఉన్న వైరుధ్యాలను పరిష్కరించడం లక్ష్యాలుగా విరసం సాహిత్య సాంస్కృతిక కృషి కొనసాగిస్తోంది. ఈ అవగాహనతోనే కారంచేడులో దళితులపై అగ్ర కుల భూస్వాములు దాడి చేసినప్పుడు, బాబ్రీ మసీదు విధ్వంసం జరిగినప్పుడు, గుజరాత్‌లో ముస్లింలపై పాశవికమైన మారణకాండ జరిగినప్పుడు, అఫ్ఘన్, ఇరాక్‌లపై అమెరికా ఏకపక్ష యుద్ధానికి దిగినప్పుడు విరసం ఒక సాహిత్య సాంస్కృతిక సంస్థగా ఈ ఆధిపత్య హింసా రూపాలన్నింటికి వ్యతిరేకంగా బాధితుల పక్షాన నిలబడింది. అంటే విరసం మానవ జీవితాన్ని అతలాకుతలం చేసే హింసా, ఆధిపత్యాలను వ్యతిరేకిస్తూ వచ్చిందేగాని ఏ రకమైన హింసను కూడా అంగీకరించలేదు, ప్రోత్సహించలేదు.
3. ప్రభుత్వం ఆరోపించినట్టుగా విరసం ఎన్నడూ అసంబద్ధ విషయాలను ప్రచారం చేయలేదు. విరసం ప్రజలకి సామాజిక స్థితిగతుల గురించి వాస్తవ సమాచారాన్ని మాత్రమే అందిస్తున్నది. ఆయా కాలాలలో ఉన్న ప్రభుత్వాలు తమకి అనుకూలంగా లేని సమాచారాన్ని, చివరికి ప్రతిపక్ష రాజకీయ పార్టీల ప్రచారాన్ని కూడా అసంబద్ధమైన సమాచారంగా ఆరోపించడం ఆనవాయితీ. విరసం ఒక వ్యక్తికి గాని, ఒక నిర్దిష్ట ప్రభుత్వానికి గాని వ్యతిరేకం కాదు. ఇవాళ అమలులో ఉన్న అసమ సామాజిక ఆర్థిక వ్యవస్థకూ, దాన్ని కాపాడుతున్న రాజ్య వ్యవస్థకూ వ్యతిరేకంగా తన సాహిత్య సాంస్కృతిక కృషిని కొనసాగిస్తోంది.

4. ప్రభుత్వం ఆరోపించినట్టుగా విరసం ఎన్నడూ ప్రజలలో హింసాత్మక ధోరణిని ప్రచారం చేయలేదు. కాకపోగా సమాజంలో పేదలపై, దళితులపై, మైనారిటీలపై, మహిళలపై అమలవుతున్న హింసకు, ఆ హింసను రెచ్చగొట్టే ధోరణులకు వ్యతిరేకంగా సాహిత్య, సాంస్కృతిక కళారంగాలలో విరసం ఇంతకాలంగా కృషి చేస్తూ వచ్చింది. ప్రభుత్వం ఆరోపించినట్టుగా ప్రజల్లో హింసాత్మక ధోరణిని ప్రచారం చేయడానికి సాంస్కృతిక కార్యకలాపాలను, పత్రాలను, కరపత్రాలను, పత్రికా ప్రకటనలను విరసం ఎన్నడూ ఆశ్రయించలేదు. సమాజంలో అమలవుతున్న హింసను తొలగించడానికి భారతీయ భాషా సాహిత్యాల్లో జరిగిన ప్రజాస్వామిక కృషిని స్వీకరించి, హింసకు తావులేని సమాజ నిర్మాణమే లక్ష్యంగా విరసం కొనసాగుతోంది. "సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక సాహిత్య సృజనలో ప్రేమ్‌చంద్ ఆదర్శాన్ని, విప్లవ సాంస్కృతిక కార్యాచరణలో పాణిగ్రాహి ఒరవడిని విరసం స్వీకరిస్తుంది. కబీర్, వేమనలు మొదలుకొని పూలే, జాషువాల వరకు భారతీయ సాహిత్యాల్లోని ధిక్కార వారసత్వాన్ని, అనుకూల అంశాలను విరసం స్వీకరిస్తుంది. దేశ దేశాంతర ప్రజా సంస్కృతిలోని పోరాటాంశను, ధిక్కార ధోరణిని స్వీకరించి ప్రస్తుత యుగ అవసరాలకు అనుగుణంగా ప్రజా సాహిత్యాన్ని, సంస్కృతిని అభివృద్ధి చేయడానికి విరసం కృషి చేస్తుంది." (ప్రణాళిక – 17).

5. ప్రభుత్వం నోటిఫికేషన్‌లో ఆరోపించినట్టుగా విరసం ఎలక్ట్రానిక్, ప్రింట్ మీడియాలో ఎప్పుడూ ఎలాంటి ఇంటర్వ్యూలు నిర్వహించలేదు. ఆయా సమయాల్లో వివిధ ప్రజా సమస్యల మీద, సామాజిక సాహిత్య పరిణామాల మీద విరసం సభ్యుల అభిప్రాయాలను మీడియా ప్రతినిధులు అడిగి ప్రచారం, ప్రసారం చేశారు. అలాంటి సందర్భాలలో విరసం సభ్యులు ఎప్పుడూ ఎవరి హింసాత్మక చర్యలనూ సమర్థిచలేదు. ఆయా సందర్భాలలో ఆయా ఘటనలకు గల పూర్వాపరాలను చారిత్రకంగా, హేతుబద్ధంగా విశ్లేషించారు. ఈ విశ్లేషణే ఆ ఘటనల సమర్థన కాదు. భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) లేదా ఇతర పార్టీల హింసాత్మక చర్యల్ని కూడా ప్రోత్సహించే ప్రయత్నం విరసం ఎన్నడూ చేయలేదు.

6. ప్రభుత్వం ఆరోపించినట్టుగా విరసం మావోయిస్టు పార్టీకి గాని ఇతర తీవ్రవాద సంస్థలకి గాని ఎన్నడూ అనుబంధ సంస్థగా పనిచేలేదు. గత 35 సంవత్సరాలలో ప్రభుత్వం, పోలీసు శాఖ ఈ ఆరోపణను అనేకసార్లు చేశాయి. ఈ ఆరోపణను వారు ఏ న్యాయస్థానంలోనూ రుజువు చేయలేకపోయారు. విరసం ఈ ఆరోపణను అనేక సార్లు ఖండించింది. నోటిఫికేషన్‌లో ఆరోపించినట్టుగా విరసం తీవ్రవాద సంస్థలకి అగ్రస్థానం ఇవ్వలేదు. వాటి తరఫున వకాల్తా పుచ్చుకోలేదు. హింసాత్మక ధోరణిని రెచ్చగొట్టే ఏ పనినీ ఎప్పుడూ విరసం చేయలేదు. విరసం కార్యక్షేత్రం కళా సాహిత్య సాంస్కృతిక రంగాలు మాత్రమే. "భూస్వామ్య, సామ్రాజ్యవాద సాహిత్యాన్ని, సంస్కృతిని, కళలను, సైద్ధాంతిక ధోరణులను, భావజాలాన్ని నిర్మూలించే క్రమంలో నూతన ప్రజాస్వామిక సంస్కృతిని రూపొందించడం లక్ష్యం"గా (ప్రణాళిక – 7) విరసం సర్వస్వతంత్రంగా పనిచేస్తుంది.

7. ప్రభుత్వం ఆరోపించినట్టుగా విరసం ఎన్నడూ చట్టబద్ధంగా పనిచేసే ఏజెన్సీలని నైతికంగా బంగపరిచే ఉద్దేశ్యంతో సమాచార ప్రసారాన్ని సాగించలేదు. చట్టబద్ధ పాలన, రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులు, ఆదేశిక సూత్రాల ప్రాతిపదికపై ప్రభుత్వ పాలన ప్రజాస్వామికంగా సాగాలని విరసం కోరుకుంటుంది. ఏ పాలనా యంత్రాంగమైనా ఈ సూత్రానికి భిన్నంగా వ్యవహరించినప్పుడు దాన్ని ప్రజల దృష్టికి తీసుకెళ్ళడం మాత్రమే విరసం చేస్తూ వస్తున్న పని. ఈ పనిని విరసమే కాక అనేక ఇతర ప్రజాసంస్థలు కూడా చేపడుతున్నాయి.

8. ప్రభుత్వం ఆరోపించినట్టుగా విరసం మావోయిస్టు పార్టీకి చెందిన పీపుల్స్ లిబరేషన్ గెరిల్లా ఆర్మీకి సమాచారాన్ని సేకరించి అందించడం లేదు. ఇది అసత్యం. ఇంతకుముందే స్పష్టం చేసినట్టుగా విరసంకీ, మావోయిస్టు పార్టీకీ, దాని గెరిల్లా ఆర్మీకి ఎటువంటి సంబంధం లేదు. విరసం తన సిద్ధాంత దృక్పథానికి లోబడి ప్రజల సమస్యలను, వాటికి తగిన పరిష్కారాలను సాహిత్య సృజనలో ప్రతిబింబిస్తుందే గాని ప్రభుత్వం ఆరోపించిన సంస్థలకు ఏ రకమైన సమాచారాన్ని అందించే పని పెట్టుకోదు. అందువల్ల నోటిఫికేషన్ ఆరోపించినట్టుగా వారికి మనుషుల్నీ, వస్తువుల్నీ సరఫరా చేయడమనే ప్రశ్నే తలెత్తదు.

9. ప్రభుత్వం ఆరోపించినట్టుగా విరసం అండర్‌గ్రౌండ్ కాడర్‌కి ఎన్నడూ ఆశ్రయం కల్పించలేదు. ప్రభుత్వం, చట్టాన్ని అమలు పరచే ఏజెన్సీలు చేపట్టిన చర్యలకి సంబంధించిన సమాచారాన్ని వారికి అందించలేదు. విరసం పూర్తిగా బహిరంగ సంస్థ. విరసంకి రహస్య ఎజెండాగాని, కార్యకలాపాలు గాని లేవు.

అందువల్ల ప్రభుత్వ ఆరోపణలకు పైన చెప్పిన విరసం ప్రతివాదనల ద్వారా తేలేదేమంటే ప్రభుత్వ నోటిఫికేషన్‌లో ఆరోపించినట్టుగా చట్టబద్ధ పాలనకు విరసం అవరోధం కలిగించడం లేదు. ప్రజా భద్రతా నిర్వహణను విరసం భంగపరచడం లేదు. ప్రజాశాంతికి విరసం ఆటంకం కాదు. అందువల్ల నోటిఫికేషన్‌లో ఆరోపించినట్టుగా విరసంను చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించాల్సిన అవసరం ఎంతమాత్రం లేదు. అంతేగాక విరసం వంటి సాహిత్య సాంస్కృతిక సంస్థని చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించడం రాజ్యాంగంలోని భావ ప్రకటనా స్వేచ్ఛకు, సంస్థ నిర్మాణ స్వేచ్ఛకు భంగకరం. అంతర్జాతీయంగా అనేక ఒడంబడికలు గౌరవించిన భావ ప్రకటనా స్వాతంత్ర్యానికి ఈ చర్య వ్యతిరేకం.

అందువల్ల జనరల్ అడ్మినిస్ట్రేషన్ (ఎస్‌సిఎ) శాఖ ద్వారా ప్రభుత్వం 17-8-2005న జారీ చేసిన జిఒ ఎంఎస్ 373ను రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకమైనదిగా, భావ ప్రకటనా స్వేచ్ఛను హరించేదిగా, ఒక సాహిత్య సాంస్కృతిక సంస్థను నిరాధారంగా చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించేదిగా ఉందని విరసం భావిస్తోంది. ఈ అప్రజాస్వామిక, రాజ్యాంగ వ్యతిరేక ఉత్తరువును ఉపసంహరించవలసిందిగా విరసం కోరుతోంది.

పైన ఉదహరించిన చట్టం ప్రకారం నోటిఫికేషన్ వెలువడిన పదిహేను రోజులలోగా తన అభ్యంతరాలు తెలియజేసుకోవడానికి మూడు నెలలలోగా సలహా మండలి న్యాయమూర్తుల ముందు తన వాదన వినిపించుకోవడానికి విరసంకు హక్కు ఉండగా పోలీసు యంత్రాంగం ఈ హక్కును ఉల్లంఘించే చర్యలను నోటిఫికేషన్ వెలువడిన రోజు నుంచే చేపట్టింది. నోటిఫికేషన్ అచ్చయిన దినపత్రిక మార్కెట్లోకి రాకముందే విరసం కార్యవర్గ సభ్యుడు వరవరరావును ఈ చట్టం కిందనే నిర్బంధించారు. విరసం వాదనలు వినిపించడానికి చట్ట ప్రకారం అధికారం ఉన్న సంస్థ అధ్యక్షుడు కల్యాణరావును నోటిఫికేషన్ అచ్చయిర రోజున నిర్బంధించారు. రాష్ట్ర వ్యాప్తంగా విరసం సభ్యులపైన వేధింపులు, నిఘా, బెదిరింపులు సాగుతున్నట్టు వార్తలు వస్తున్నాయి. పోలీసు యంత్రాంగం అవలంబిస్తున్న ఈ చట్ట వ్యతిరేక నిర్బంధకాండను తక్షణమే ఆపవలసిన బాధ్యత ప్రభుత్వంపై ఉన్నదని విరసం భావిస్తోంది.

ఈ సందర్భంగా విరసం ప్రభుత్వం దృష్టికి తేదల్చిన నాలుగు అనుబంధాలను ఇందులో జత చేస్తోంది :

అనుబంధం 1 : విరసం ప్రణాళిక – నియమావళి
అనుబంధం 2 : విరసం చరిత్ర – విహంగ వీక్షణం
అనుబంధం 3 : ప్రాణప్రదమైనది భావ ప్రకటనా స్వేచ్ఛ
అనుబంధం 4 : భావ ప్రకటనా స్వేచ్ఛపై ఆంక్షలా?

# కాలాన్ని నడిపించిన కవి మఖ్దూం మొహియుద్దీన్



నిఖిలేశ్వర్

"హయత్ లేకే చలో, కాయనాత్ లేకే చలో
చలేతో సారే జమానే కో సాథ్ లేకే చలో!"
- మఖ్దూం

(జీవితాన్ని వెంట నడిపించు, సృష్టినంతా వెంట నడిపించు నడిపించితే కాలాన్ని సాంతం నీతో పాటు నడిపించు!)

**బ**హుముఖ ప్రతిభావంతుడైన మఖ్దూం మొహిద్దీన్ ఆధునిక ఉర్దూ సాహిత్యంలో గొప్ప కవి.

కార్మిక నాయకుడిగా జీవించిన ఆయన ఒక మంచి కమ్యూనిస్టు కాలాన్ని తనతో పాటు నడిపించిన వ్యక్తిగా నాటకాలు రచించి, నటించినవాడు. శాసనసభ్యుడిగా రాజకీయాలలో జీవించినవాడు. ప్రపంచ కార్మిక సంఘాల పనిపై చైనా, రష్యా, తూర్పు, యూరప్, ఆఫ్రికా దేశాలు పర్యటించినవాడు.

తెలంగాణాలోని హైదరాబాద్ దక్కన్ నుంచి జాతీయ - అంతర్జాతీయ స్థాయికి ఎదిగిన ఉన్నత ప్రమాణాలు కలిగిన కవిగా మఖ్దూం - చరితార్థుడైనాడు.

1857 తర్వాత అభివృద్ధి చెందిన ఆధునిక ఉర్దూ భాష, అంతకుపూర్వం ఫారసీ పదజాలంతో కఠినంగా వుండేది. భారతదేశంలోనే పుట్టి పెరిగిన ఉర్దూ క్రమంగా హిందూస్థానీ భాషగా దేశమంతా వ్యాపించింది. హిందీ కంటే ముందే సైనికుల భాష "లష్కరి"గా జనం నాలుకలపై ఆడింది. ఈ ఉర్దూకు లక్నవీ, అలీగఢ్ ఢిల్లీ, పంజాబీ దక్కనీ (దక్షిణ) ప్రాంతీయ మాండలిక ప్రత్యేకతలున్నాయి. పాతకాలపు ఉర్దూ కవిత, మహారాజుల పోషణలో, ముషాయరాల విలాసాలతో నడిచేది. రదీఫ్, కాఫియా అనే కవితా ప్రక్రియలలో శబ్దాడంబరం నిండి వుండేది. భోగలాలసత, కరుణ, నైరాశ్యం, వ్యక్తివాదం ఆనాటి కవితా వస్తువులు.

కవిత్వంలోని ఈ విలాస ప్రియత్వాన్ని మలుపు తిప్పి, జనజీవితంలోకి తెచ్చిన ఉద్యమం "అంజుమన్ తరక్కీ పసంద్ ముసన్నఫ్" (అభ్యుదయ సాహిత్య ఉద్యమం).

మానవతావాదం, విప్లవాత్మక ధోరణి, సామ్రాజ్యవాద వ్యతిరేకతతో ఉర్దూ అభ్యుదయ సాహిత్యం మిగతా భారతీయ భాషా సాహిత్యాలతో పాటు పురోగమించింది. విప్లవ కాల్పనికత ఒకవైపు, ఆధునిక గజల్ గీతా సౌందర్యం మరోవైపు విస్తరించిన ఆ కాలంలో (ముఖ్యంగా 1930 - 60ల మధ్య) ప్రసిద్ధి చెందిన కవులు ఫైజ్ అహ్మద్ ఫైజ్, మఖ్దూం మొహిద్దీన్, సజ్జాద్ జహీర్, ఆలీ సర్దార్ జాఫ్రీ, కైఫీ ఆజ్మీ, సాహిర్‌లుధియానీ!

ఈ ఆధునిక ఉర్దూ అభ్యుదయ మహాకవుల వరుసలో నిలిచిన మఖ్దూం, మెదక్ జిల్లాలోని ఆందోల్‌లు 1908న జన్మించాడు. అక్కడి తహసీల్‌లో ప్రభుత్వ అధికారిగా వున్న తండ్రి గౌస్ మొహిద్దీన్, ఆయన బాల్యంలోనే మరణించాడు. తల్లి రెండో వివాహం చేసుకొని వెళ్ళిపోగా, పినతండ్రి బషీరుద్దీన్ మఖ్దూంను పెంచాడు. పినతండ్రి ముస్లీం సాంప్రదాయబద్ధంగా జీవించినా, రష్యన్ విప్లవం తదితర అంశాల గురించి ప్రస్తావించేవాడు. అప్పుడే అరబ్బీ, ఫారసీ భాషలు నేర్చుకుంటూ క్రమంగా సాహిత్యపరమైన ఉర్దూలోకి ప్రవేశించాడు. 1937లో ఉస్మానియా యూనివర్శిటీ నుంచి ఎం.ఎ. చదివి, కొంతకాలం సిటీ కాలేజీలో లెక్చరర్‌గా ఉద్యోగం చేశాడు. 1933 నుంచి కవిత్వం రాయడం ప్రారంభించిన మఖ్దూం ప్రేమగీతాలతో మొదలై, 1934లో మార్క్సిజం ప్రభావంతో విప్లవ కవిత్వం రచించాడు.

"అభ్యుదయ సాహిత్యోద్యమంలో భారతావని మొత్తంలో ప్రాచుర్యం పొందిన మఖ్దూం గీతం - స్వాతంత్ర్య యుద్ధం" -

"యే జంగ్ హై జంగే - ఆజాదీ
ఆజాదీ కె పరచమ్ కె తలే
హమ్ హింద్ కె రహనె వాలోంకి
మహకూమోంకి మజబూరోంకి
దహకానోంకీ, మజదూరోంకి..."

(యుద్ధం ఇది స్వాతంత్ర్య మహాయుద్ధం,
స్వాతంత్ర్య పతాకచ్ఛాయల సాగే
యుద్ధం ఇది. స్వాతంత్ర్య మహాయుద్ధం
మన పవిత్ర భారత జనగణములు
పీడిత తాడిత ప్రజా ప్రవాహం
కార్మిక కర్షక స్వేచ్ఛా జీవుల
యుద్ధం ఇది స్వాతంత్ర్య మహాయుద్ధం)

అనువాదం : గజ్జెల మల్లారెడ్డి

ఆనాటి నిజాం కులీన (ఫ్యూడల్) రాచరిక పరిపాలనలో పుట్టి పెరిగిన ఈ కవి ఇస్లాం మతస్థుడైనా ఏనాడూ నిజాంను సమర్థించలేదు. తన బాల్యంలో పేదరికాన్ని అనుభవించి, వర్గ పోరాట సారాన్ని జీవితం నుంచి నేర్చుకున్నాడు. చిన్ననాడు హైదరాబాద్ వీధుల్లో బడికి నడిచి వెడుతూ, నవాబుల పిల్లలు గుర్రపు బగ్గీలలో పోతుంటే, ఆ బగ్గీల వెనుక కూచొనబోయిన, బగ్గీ నడిపేవాడి కమ్చీ (చెర్నకోల) చురకలు రుచిచూశాడు. బగ్గీకే పీఛే ఛోకా" అనే శీర్షికన మఖ్దూం జ్ఞాపకాల వ్యాస సంపుటి 1980లో "సియాసత్" ఉర్దూ దినపత్రిక ప్రచురణగా వెలువడింది.

నిజాం రాచరిక పాలనలో తెలంగాణా రైతాంగ దీనస్థితి, సామాన్య ప్రజల కడగండ్లు కళ్ళారా చూసిన మఖ్దూం - నవాబుల దోపిడీని తన చారిత్రాత్మకమైన కవిత "హవేలీ" (దయ్యాల మేడ) లో ఇలా వర్ణించాడు. కొంతభాగమే



ఉటంకిస్తున్నాను.

"ఎక్ బోసీదా హవేలీ, యానీ ఫర్సుదా సమాజ్ లే రహీ హై నజహకే ఆలమ్ మే ముర్దోన్సె ఖిరాజ్. ఇక ముసల్‌సల్ కార్బ్ మే డూబే హువే సబ్ వామోదర్ జిస్ తరఫ్ దేఖో అందేరా జిస్ తరఫ్ దేఖో ఖండర్...."

(అది దయ్యాల మేడ శిథిల సమాజాల నీడ. పీనుగులను పీక్కు తినే రాబందుల రాచవాడ. ఆద్యంతం అంతులేని అరిష్టాల మహాపీడ. ఎటు చూస్తే అటు చీకటి ఎటు కన్నా శిథిలాలే!
అంతా ఒక నిస్తబ్దత అలుముకున్న వల్లకాడు
పర్రెల్లో నెర్రెల్లో పాములు తేళ్ళూ కొల్లలు.
అబ్బో! ఎంత భయంకరమెంతటి
బీభత్స ప్రకృతి!!)
(అనువాదం : గజ్జల మల్లారెడ్డి
- "దయ్యాల మేడ")

తొలి దశలో మఖ్దూం యూనివర్శిటీలో చదువుతూ వుండగానే మూడు నాటకాలు రచించాడు. "హోశ్‌కే నా ఖూన్" (బెర్నార్డ్ షా "విడోయర్స్ హవుజ్"కు అనుసరణ), ముశీద్ (హాస్యనాటిక), సీర్ (గేయనాటిక). ఇందులో "హోశ్‌కే నాఖూన్" నాటకంలో స్వయంగా నటించి ప్రదర్శించినపుడు - సరోజనిదేవి నాయుడు, రవీంద్రనాథ్ టాగోర్ ఆ ప్రదర్శన చూసి ప్రశంసించారు. టాగోర్ ఆ సందర్భంలోనే స్వయంగా 'జనగణమణ' ఆలపించడం ఒక విశేషం!

మఖ్దూం జీవించిన 61 సం॥ల వ్యవధిలో నాటకాలు, వ్యాసాలు కాకుండా మూడు కవితా సంపుటాలు ప్రచురించాడు. సుర్ఖ్ సవేరా (అరుణోదయం - 1944) గుల్‌తర్ (తాజా పువ్వు - 1961) బిసాతే రక్స్ (నాట్యవేదిక - 1966), ఇటీవలే ఢిల్లీ నుంచి నాగరీ లిపిలో (హిందీ) 'సంపూర్ణ గాలిబ్' అనే సమగ్ర సంపుటి వెలువడింది.

1936లో నిజాం నిరంకుశ పాలనలోనే ఎన్నో ఆంక్షల మధ్య హైదరాబాద్‌లో "అభ్యుదయ రచయితల సంఘం" (అరసం)కు అంకురార్పణ జరిగింది. మార్క్సిస్ట్ అధ్యయన తరగతులు, కామ్రేడ్స్ అసోసియేషన్ కార్యకలాపాలు కొనసాగేవి. 1944లో సిటీ కాలేజి లెక్చరర్ ఉద్యోగం వదిలేసి కమ్యూనిస్టు పార్టీ 'హోల్ టైమర్"గా ప్రజా ఉద్యమంలో నిమగ్నమైనాడు. తెలంగాణా రైతాంగ సాయుధ పోరాట కాలంలో కామ్రేడ్స్ డాక్టర్ రాజబహదూర్ గౌర్, సిహెచ్. రాజేశ్వరరావు, రావి నారాయణరెడ్డితో పాటు రహస్య జీవితం గడిపాడు. ఆ సందర్భంలోనే "తెలంగాణా" అనే స్ఫూర్తిదాయకమైన గేయం రచించాడు.

"దియారే హింద్ కావో రహబర్ తెలంగానా
బనారహా హై బాసిమై దిగర్ తెలంగానా
బులారహాహై బాసిమై దిగర్ తెలంగానా
వో ఇన్‌క్విలాబ్ కా పైగంబర్ తెలంగానా
(భారత భూమికి మార్గదర్శకం తెలంగాణా
నవోదయాన్ని సృష్టిస్తోంది తెలంగాణా
నూతన దిశకు పిలుపు తెలంగాణా
విప్లవ సందేశమిచ్చే ప్రవక్త తెలంగాణా)

1943లో జాతీయోద్యమానికి అనుకూలంగా ప్రసంగించి నందుకు మఖ్దూంకు మూడు నెలల జైలుశిక్ష విధించారు. 1944 - 46 మధ్య కొనసాగిన కార్మిక సంఘాల స్థాపన (ట్రేడ్ యూనియన్ ఉద్యమం)లో మఖ్దూం నాయకత్వ స్థాయిలో పనిచేశాడు. నిరాహారదీక్షలు, అరెస్టులు సాగిపోయాయి.

1951 చివర సాయుధ పోరాటాన్ని ఉపసంహరించక పూర్వమే 1951 మేలో మఖ్దూంను అరెస్టు చేసి 1952 జనవరిలో విడిచిపెట్టారు. 1952 ఎన్నికల్లో వోడిపోయి, ఆ తరువాత హుజూర్‌నగర్ ఉప ఎన్నికలోనూ శాసనసభకు ఎన్నికయ్యాడు.

కవిగా మఖ్దూం వ్యక్తిత్వం - రచనా శైలీ ఆ రోజుల్లోనే ఉర్దూ ముషాయరాలలో (కవి సమ్మేళనాలలో) శ్రోతలను బాగా ఆకట్టుకునేది. ఆయన రాసిన ప్రేమగీతాలను రాగయుక్తంగా (తరున్నమే) సామాన్యులు కూడా పాడుకొనేవారు. ముఖ్యంగా ముస్లింల సాంస్కృతిక జీవితంలో ముషాయరాల అనుబంధం విడదీయరానిది. కమ్యూనిస్టు మఖ్దూంని ఇష్టపడని ముస్లింలు కూడా ఆయన కవిత్వమంటే ఎంతో అభిమానించేవారు.

హిందీ సినిమాల ద్వారా కొన్ని మఖ్దూం గీతాలు ప్రాచుర్యం పొందాయి. 'చంబేలికే మండవే తలే', 'జాన్‌వాలే సిపాహీ సీ పూఛో పవో కహాం జా రహాహై' మొ॥...

"చారాగర్" (వైద్యుడు లేదా ఉపశమింపచేసేవాడు) శీర్షికన ఈ ప్రేమగీతం ఎంతో ప్రచారాన్ని పొందింది. (ఈ సందర్భంలో పాబ్లో నెరూడా - లవ్ పోయెమ్స్ నే మనం గుర్తు చేసుకోవచ్చు)

"ఇక్ చంబేలీకే మండవేతలే
మైకదేసే జరాదూర్, ఉస్ మోడ్ పర్
దోబదన్
ప్యార్‌కీ ఆగ్ మే జల్‌గయే..."
(ఈ మల్లె పందిరి కింద
పానశాల నుంచి కాసింత దూరాన
ఆ మలుపులో
రెండు దేహాలు దగ్ధమైపోయాయి
ప్రేమగ్నిలో -
ప్రేమ సహజీవనాక్షరి
ప్రేమే వారి దైవం
ప్రేమే వారి చితి
ఆ రెండు దేహాలు
మంచులో తడుస్తూ, వెన్నెల్లో స్నానిస్తూ
అరవిచ్చిన పువ్వుల్లా
వీచిన చల చల్లని ఉదయ
సమీరంలా!
శోకతప్తగా
తోటలోని గాలి
నల నల్లని కురులతో చుట్టేసి
వెచ్చని చెక్కిలిపై ఆగిపోయింది -
ఒక్క క్షణం!
వాళ్ళను మేము
చీకటి వెలుగులో చూస్తూ వుండి
-
పోయాము దివారాత్రులు!
ఆద్యంతాల దాకా
మసీదు మీనార్లు చూసాయి వాళ్ళను
మందిరాల కవాటాలు చూసాయి వాళ్ళను
పానశాల సందులు చూసాయి వాళ్ళను



ఉపశమింపచేసే వైద్యుడా
నీ జోలెలో
ప్రేమ రస విద్యలాంటి కిటుకేదైనా వుందా?
ప్రేమ కోసం చికిత్స ఏమైనా వుందా?
ఈ మల్లె పందిరి కింద
పానశాలకు కాసింత దూరానా
ఆ మలుపులో రెండు దేహాలు
ప్రేమాగ్నిలో కాలిపోయాయి -
ఓ పరిరక్షకా!!
(అనువాదం - నిఖిలేశ్వర్)

ఇక మఖ్దూం కొన్ని 'నజమ్'లు (కవితలు), అరుదుగా గజళ్ళు రాసినా, ఆయన వాడిన భాష కొన్ని చోట్ల ఎంత సుకుమారంగా వుంటుందో, మరికొన్ని చోట్ల పారసిక (పర్షియన్) పద బాహుళ్యం వల్ల సామాన్య పాఠకులు ప్రతిపదార్థం లేకుండా అర్థం చేసుకోవడం కష్టం!

కవి మఖ్దూం మొహిద్దీన్ వ్యక్తిత్వం విలక్షణమైందని అభిమానులు - మిత్రులు ప్రత్యేకించి చెబుతారు. సీనియర్ కామ్రేడ్ డాక్టర్ రాజ్ బహదూర్ గౌర్‌లాగానే మఖ్దూం కూడా హాస్యప్రియుడు. ఆయన జీవితంలోని ఎన్నో సన్నివేశాలు మిత్రుల్ని అలరించాయి. విస్తరణ భయంతో ఇక్కడ పేర్కొనడం లేదు.

1969 జనవరలో నేనూ, చెరబండరాజు కలకత్తాలో జరిగిన అఖిల భారత కవి సమ్మేళనానికి వెళ్ళినపుడు, ఉర్దూకు ప్రాతినిధ్యం వహించిన మఖ్దూం, సులేమాన్ అరీబ్ ("సబా" మాసపత్రిక ఎడిటర్)ల సాన్నిహిత్యం మాకు లభించింది. ఆ నాలుగైదు రోజులు రైలు ప్రయాణంలో, కలకత్తా సదస్సుల్లో మఖ్దూం స్నేహాన్ని, ఆప్యాయతను చూసిన తర్వాత ఆయనని అందరూ ఒక మంచి మానవుడుగా ఎందుకు ప్రేమించేవారో అనుభవంలోకి వచ్చింది.

కామ్రేడ్ మఖ్దూం ఉర్దూ కావ్య ప్రపంచంలో సజీవంగా నిలిచిపోయాడనే వాస్తవాన్ని గుర్తు చేసుకుంటే ఆయన రమ్యమైన ఈ షేర్(కవిత) తళుక్కుమంటుంది.

"రాత్ భర్ దీదయే
- నమ్ నాక్‌మే లహరాతే రహే
సాంస్‌కే తరహాసే ఆప్ ఆతేరహే జాతేరహే"
(తెల్లవార్లూ తడిసిన నా కళ్లలో
తేలియాడుతూనే వున్నావు.
శ్వాసలాగా వస్తూనే వున్నావు -
పోతూనే వున్నావు.
అను : సదాశివ)

ఆగస్టు 1969లో మఖ్దూం ఢిల్లీలో మరణించినపుడు, ప్రఖ్యాత రచయిత సినీ దర్శకుడు ఖ్వాజా అహ్మద్ అబ్బాస్ - ఆయన 'సంపూర్ణ మానవుడు' అనే అంశాన్ని ఈ కవితాత్మకమైన పంక్తుల్లో వ్యక్తం చేశాడు.

"అతను జ్వాల,
అతను మంచుకూడా
అతను విప్లవ కాహళి,
గజ్జెల ఘల్ ఘల్ కూడా
అతను జ్ఞానం, కర్మ, బుద్ధి కూడా
అతను గెరిల్లా చేతిలోని రైఫిలు,
గాయకుల సితార కూడా
అతను తుపాకి మందు వాసన,
మల్లిపువ్వు సువాసన కూడా"

**(హైదరాబాద్‌లో ఆగస్టు 28న 'సమాలోచన'లో చేసిన ప్రసంగ సారాంశం)**

# మహనీయులకు మహా నివాళి - "సమాలోచన"

సాహితీ జగత్తులో మహనీయుల్ని స్మరించుకోవడం అన్నది జరుగుతూనే ఉంటుంది. కానీ రాష్ట్ర రాజధానిలో ఒకేసారి ఆరుగురు సాహిత్య ప్రముఖుల్ని స్మరించుకోవడానికి ఒక కార్యక్రమాన్ని రూపొందించుకోవడం విశేషం. సాహితీ స్రవంతి, శోధన (సుందరయ్య విజ్ఞాన కేంద్రం) సంయుక్తంగా ఆగస్టు 26, 27, 28 తేదీలలో సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో సమాలోచన కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమం మూడు లక్ష్యాలతో నిర్వహించారు. మహనీయుల సంస్మరణ, అనుభవాల కలబోత, అభిప్రాయాల నివేదనగా విభజించారు.

## నెరుడా, ప్రేమ్‌చంద్

తొలి సమావేశానికి డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు అధ్యక్షత వహించారు. ప్రముఖ కవి కె. శివారెడ్డి మాట్లాడుతూ తనదైన శైలిలో పాబ్లో నెరుడా విశిష్టతను వివరించారు. నెరుడా పీడిత జన పక్షపాతిగా చేసిన అనేక రచనలను ప్రస్తావించారు. సామ్రాజ్యవాదం మీద తిరుగులేని పోరాటం చేస్తూ ఎన్నోసార్లు నెరుడా దేశ బహిష్కరణకు గురయ్యాడు. కలం పేరును మార్చుకొని ప్రజల కోసం రచనలు చేశాడు. నెరుడా కవిత్వం ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధిగాంచింది. తన జీవితకాలంలో నెరుడా 30 కావ్యాలే రాసినప్పటికి, ప్రపంచ సాహిత్యంలో చిరస్థాయిగా నిలిచి పోయాయి. నెరుడా విశ్వప్రేమికుడు. ప్రపంచంలో ఏ మూల అన్యాయం జరిగినా దానిని ప్రతిఘటిస్తూ కవిత్వం రాశాడు అని శివారెడ్డి చెప్పారు.

రెండవ వక్తయిన ప్రముఖ కవి జ్వాలాముఖి ప్రేమ్‌చంద్ 'జీవితం - సాహిత్యం' అంశంపై ప్రసంగించారు. ప్రపంచ సాహిత్యానికి 'నవల'ను అందించింది రష్యా. గొప్ప నాటకాన్నందించింది జర్మనీ. అలాగే భారతదేశ సాహిత్యానికి మంచి నాటకాల్ని అందించింది బెంగాలీ సాహితీ కారులు. గొప్ప కథా సాహిత్యాన్ని అందించింది మాత్రం ఖచ్చితంగా ఉర్దూ సాహిత్యమే. ఈ దేశంలో బాధ్యతతో రచన చేసినవాడు ప్రేమ్‌చంద్. మార్పు ఆవశ్యకతను పట్టుకున్నవాడే యుగకవి. పూర్తిగా ఆ యుగకవి లక్షణాలున్నవాడు ప్రేమ్ చంద్. అట్టడుగు వర్గాల్ని, అందులోని సామాన్యుల్ని కథా నాయకులను చేశాడు ప్రేమ్‌చంద్. ఆ ప్రతిభకు యావత్ సాహిత్య లోకం దిగ్భ్రాంతి చెందింది. అయినా ప్రేమ్‌చంద్ ముందుకే సాగాడు కానీ, వెనుకడుగు వేయలేదు. రచయిత ఎల్లలు లేనివాడు. భాష ఎప్పుడు, పాఠకునికి - రచయితకు శాపం కాకూడదు... అని ప్రేమ్‌చంద్ భావించాడు. వస్తు దారిద్ర్యం ఏర్పడితే శిల్పం వస్తువవుతుంది. కానీ ప్రేమ్‌చంద్ వస్తు శిల్పాలను సమదృష్టితో చూశాడు. తను రాసిన 'గోదాన్' నవలలో ఒక సామాన్య రైతు కథా నాయకుడు. రైతు కష్టాలు వివరిస్తుంటే పాఠకుని గుండె కరిగిపోయే విధంగా వర్ణించాడు. ప్రేమ్‌చంద్ జీవితం, సాహిత్యాన్ని వేరు చేసి చూడలేము. ఆయనను లోతుగా అధ్యయనం చేస్తే రచయిత "తరాల బాధ్యత కలవాడ"ని అర్థమవుతుందని అన్నారు.

## సురవరం, మగ్దుం

రెండవ రోజు సమావేశానికి డాక్టర్ కె.కె. రంగనాథాచార్యులు అధ్యక్షత వహించారు. మొదటి వక్త మోతుకూరి నరహరి "సురవరం ప్రతాపరెడ్డి జీవితం - సాహిత్యం" అనే అంశంపైన ప్రసంగించారు. నిద్రాణమైన తెలంగాణను మేల్కొలిపిన ఘనత సురవరందే. తెలంగాణలో

దినపత్రికలు ఒకటో రెండో ఉన్న కాలంలో ఆ లోటును పూడ్చటానికి ఆయన ఎంతో కృషి చేశారు. గోల్కొండ పత్రికను అనేక ఇబ్బందుల మధ్య మొక్కవోని ధైర్యంతో నడిపారు. మరో చారిత్రాత్మకమైన విషయం "గోలకొండ కవుల సంచిక"ను వెలువరించడం. అనేక పత్రికల్లో వివిధ కలం పేర్లతో ప్రతాపరెడ్డిగారు రచనలు చేశారు. అలాగే గ్రంథ రచనలో కూడా ప్రతాపరెడ్డిగారిది అందె వేసిన చెయ్యి. వారు రచించిన 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' అనేది ఎంతో ప్రసిద్ధి చెందింది. ఆ గ్రంథం ప్రామాణికమైనది. సురవరం ప్రతాపరెడ్డి ఇంకా ఆంధ్రుల సాంఘిక చరిత్రతో పాటు "హిందువుల పండుగలు, రామాయణ విశేషములు" లాంటి మొదలైన రచనలు చేసి గొప్ప సాహిత్య కృషిని చేశాం అంటూ విశ్లేషించారు నరహరి.

రెండవ వక్త నిఖిలేశ్వర్ "మఖ్దూం సాహిత్య సందేశం" అన్న అంశంపై ప్రసంగించారు. మఖ్దూం ఉర్దూ కవితలను కోడ్ చేస్తూ ఆద్యంతం సభికులను ఆకట్టుకున్నారు. మఖ్దూం కవిగా, గాయకునిగా, రచయితగా, అధ్యాపకునిగా, కార్మిక నాయకునిగా, కమ్యూనిస్టు శాసనసభ్యునిగా, తెలుగు సాహిత్యం, తెలుగు ప్రజలు మరచిపోలేని కృషిని చేశారు. ఆనాటి నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా పోరాటం చేశారు. మఖ్దూం రాజకీయాల్ని, సాహిత్యాన్ని సమాన పార్శ్వాలుగా స్వీకరించారు. రెండు రంగాల్లోను రాణించడం కొందరికే సాధ్యమవుతుంది. అటువంటి వారిలో ముఖ్యుడు మఖ్దూం అని వివరించారు.

## ఆరుద్ర

చివరిదైన మూడవరోజు సభకు సెంట్రల్ యూనివర్శిటీ ప్రొఫెసర్ అట్లూరి మురళి అధ్యక్షత వహించారు. 'ఆరుద్ర - జీవిత సాహిత్యాల'పై వెంకటేశ్వర విశ్వవిద్యాలయం అసోసియేట్ ప్రొఫెసర్ ఆరుద్ర సన్నిహిత సహాయకుడు డాక్టర్ మేడిపల్లి రవికుమార్ ప్రసంగించారు. డాక్టర్ మేడిపల్లి రవికుమార్ మాట్లాడుతూ... ఆరుద్ర ఒక సనాతన సాంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. అయినప్పటికి సాహిత్యాధ్యయనం చేసి మార్క్సిస్టుగా మారారు. మిగిలిన వారిలాకాక ఆయన నేరుగా అభ్యుదయ కమిటీని ప్రారంభించారు. త్వమేవాహంలో అనేక ప్రయోగాలు చేశారు. "కూనలమ్మ పదాలు" వంటివి సరళంగా రాశారు. జీవితాంతం మార్క్సిస్టు దృక్పథానికే కట్టుబడ్డారు. సమగ్రాంధ్ర సాహిత్యం ఆయన అపార కృషికి నిదర్శనం అన్నారు.

ఈ సెషన్‌లోనే "నేను - నా రచన, నేను - నా సాహిత్యం" అనే అంశాలు ఔత్సాహికుల ప్రసంగాలు, ప్రముఖుల ప్రోత్సాహాలతో సాగాయి. ఈ కార్యక్రమాన్ని ప్రముఖ కథకులు కాలువ మల్లయ్య ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో పాతికమంది వరకు మాట్లాడారు. పి. ఆనందకుమార్, ఎ. అంజిరెడ్డి, డాక్టర్ కె. మధుసూదన్, జాన్‌హైడ్ కసుమూరి, బి. భువనేశ్వరి, పి. కుమారస్వామి, కపిల రాంకుమార్, ఎస్.వి. ప్రసాద్, డాక్టర్ ఎం. రవిప్రసాద్, జి. రాఘవులు, బీంపల్లి కాంత్, భూపాల్, ఆనందరావు, కర్లపాలెం నిరంజన్, దేవానంద్, రాజేష్‌ఖన్నా, ఖాజానుద్దీన్, డాక్టర్ కె. లింగారెడ్డి, నందిగామ గౌరినాథ్, తదితరులు మాట్లాడారు. సాహిత్య సభల్లో సీనియర్లు మాట్లాడుతుంటే కేవలం శ్రోతలుగా వినే పద్ధతి మారి, తమకూ అవకాశం వచ్చినందుకు పలువురు హర్షం వెలిబుచ్చారు.

## గిడుగు

సాయంత్రం ముగింపు సమావేశం ప్రజాశక్తి ఎడిటర్ ఎస్. వినయ్‌కుమార్ అధ్యక్షతన జరిగింది. ఈ సమావేశంలో ప్రముఖ భాషా శాస్త్రవేత్త చేకూరి రామారావు గిడుగు రామ్మూర్తి కృషి పైన ప్రసంగించారు.

ఈ మూడు రోజుల కార్యక్రమాన్ని సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్, సాహిత్య ప్రస్థానం ఎడిటర్ తెలకపల్లి రవిగారు సమన్వయం చేశారు. మధ్య మధ్యలో ప్రముఖులు ఎస్.వి. సత్యనారాయణ, బి.ఎస్. రాములు, మోహన్ మొదలగువారు సందేశాలిచ్చారు. మూడురోజుల కార్యక్రమాల ఏర్పాట్లను విజ్ఞానకేంద్రం కార్యదర్శి సి. సాంబిరెడ్డి ప్రస్థానం మేనేజర్ కె. లక్ష్మయ్య, గణేశ్, రవీందర్‌లు పర్యవేక్షించారు. గతంలో నిర్వహించిన పెద్ద కార్యక్రమాలు సాహిత్యశాలలు, జనకవనాలులాంటి వాటి సరసన ఈ సమాలోచనం కూడా నిలుస్తుంది.

**- పసునూరి రవీందర్**

సాహితీ స్రవంతి, హైదరాబాద్

---

* పుస్తక సమీక్షలు చేయడంపై ఆసక్తి గల వారు తెలియజేయాలని చేసిన ప్రకటనకు పలువురు మిత్రులు స్పందించారు. వారు రాసిన వాటిలో పలు సమీక్షలు ఈ సంచికలో వున్నాయి. భవిష్యత్తులో మరిన్ని రానున్నాయి. ఇంకా ఆసక్తి గల వారు తెలియజేయాలని కోరుతున్నాము. సమీక్షలు క్లుప్తంగా వుండాలని గమనించగలరు.

### పాఠకులు, రచయితలకు...

* కథలు, కవితలు పంపిన పలువురు మిత్రులు ఫోన్‌లు చేస్తున్నారు. సాధారణంగా అందిన రచనలన్ని జాగ్రత్తగా పరిశీలించి ఏమాత్రం వీలున్నా అవకాశం ఇవ్వడం జరుగుతుంది. కేవలం రచనల ప్రచురణ విషయమై ఫోన్‌లు చేయవలసిన అవసరం లేదు.

# నా అమెరికోడు!



నా అమెరికోణ్ణి
ఏమన్నా అంటే అన్నం ముట్టను!
వాడు ఎన్ని యుద్ధాలు చేసినా
ఎన్ని ప్రాణాలు తీసినా
వాణ్ణేమన్నా అంటే పచ్చి మంచినీళ్ళు ముట్టను!
ఎవడి నోట్లోనో మన్నుకొడితే నాకేటి?
వాడు నా నోట్లో బన్ను పెట్టాడు!
వాడి పిజ్జా, బర్గర్‌లు చల్లగుండ!
వాడి సిలికాన్ వేలీ, కంప్యూటర్లు పచ్చగుండ!
వాడు నన్ను విమానాల్లో ఊరేగించాడు
అందని డాలర్ల ద్రాక్షలను అందించాడు
వాడి 'చాక్లెట్' ముందు
నా 'బెల్లం జీడి' బలాదూర్!
వాడి 'కోలా' ముందు
నా 'కొబ్బరి బొండం' బలాదూర్!
వాడి 'ఫాస్ట్‌ఫుడ్' ముందు
నా 'చద్దిముద్ద' భలే దూర్!
వాడు 'డంకెల్' అయి 'రంకె' వేస్తేనేమి?
వాడు 'పేటెంట్' అయి 'టెంట్' వేస్తేనేమి?
వాడెన్ని కుయుక్తులు పన్నితేనేమి?
వాడెన్ని కుతంత్రాలు చేస్తేనేమి?
వాడి డాలర్ల పంట పండినంత కాలం
వాడి సామ్రాజ్యవాదం వెలిగినంత కాలం
వాడు నా ఆస్తే! నా దోస్తే!

**- సాదనాల వేంకట స్వామినాయుడు**

---

# పుస్తక సేకరణకు సహకరించండి

సాహితీ ప్రవంతి కార్యాలయం అందరికీ అందుబాటులో ఉండేందుకు అవసరమైన పుస్తకాలను సేకరిస్తున్నది. సిద్ధాంత గ్రంథాలు, చారిత్రక వ్యాస సంకలనాలు, తులనాత్మక అధ్యయన గ్రంథాలు, విజ్ఞాన సర్వస్వాలు, సాహిత్య చరిత్రలు, పరిశోధన గ్రంథాలు, కవితా కథా విమర్శ సంకలనాలు ఆహ్వానిస్తున్నాము. అందుకోసం సాహిత్యకారులు, పోషకులు, కవులు, రచయితలు, విమర్శకులు, అధ్యాపకులు, ప్రొఫెసర్లు, జర్నలిస్టులు, సాహితీ ప్రియులు ఇందుకు సహకరించాలని, ఈ గ్రంథాలను ఎవరు బయటకు ఇవ్వకుండా నిర్ణీత సమయానికి అక్కడే వుండి చూసుకునేందుకు మాత్రమే అవకాశముంటుంది. అందువల్ల పుస్తకాలు భద్రంగా చూసుకోగలమని హామీ ఇస్తున్నాము.

**- సంపాదకులు**

---

## హలో! మిత్రులారా!

సాహిత్య ప్రస్థానంలో వెలువడే అన్ని అంశాలపైన చర్చ జరపొచ్చు. విమర్శలు, సూచనలు చేయొచ్చు. అనుభవాలు పంచుకోవచ్చు. ఇదంతా మీ భాగస్వామ్యం పెరగడం కోసమే. ఆరోగ్యకరమైన చర్చ, అర్థవంతమైన సృజన ఈ నాడెంతైనా అవసరం. గతంలో ప్రకటించిన శీర్షికలే కాక పాఠక మిత్రులు రచయితలు ఏ విషయమైనా రాసి పంపించవచ్చు. దాన్ని సముచితమైన రీతిలో ప్రచురించడానికి తప్పక ప్రయత్నం చేస్తాము. సమీక్షకులకు కూడా మలివిడత పుస్తకాలు త్వరలో అందుతాయి.!

ఒకసారి రచనలు ప్రచురితమైన మిత్రులు కొంత వ్యవధి రావడాన్ని అర్థం చేసుకోవాలి. పంపిన వెంటనే సంచికలో రాకపోయినా నిరుత్సాహపడకుండా వుండాలి. రాని వాటిపైనే పదే పదే ఉత్తరాలు ఫోన్ల బదులు మరింత ఉత్సాహంగా కృషి చేయడంపై కేంద్రీకరించాలి. అలాగే మీ నేస్తాలకు కూడా ప్రస్థానం గురించి తెలియజెప్పి రచనలు పంపించేందుకు ప్రోత్సహించాలి. అనుభవం, అవగాహన వుండి రచనలు చేయని పెద్దలు, నిపుణులపై మీరే వత్తిడితెచ్చి రాయించాలి. అది మీ బాధ్యత కూడా.

ప్రస్థానం మెరుగుదలకు మీ సూచనలు, సలహాలకు సదా స్వాగతం!

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**




# జిల్లా ప్రాథమిక విద్యా కార్యక్రమం-II

## సాధించిన ప్రగతి

- డిపిఇపి కార్యక్రమం, రెండో దశలో భాగంగా, రాష్ట్రంలోని శ్రీకాకుళం, విశాఖపట్నం, గుంటూరు, ప్రకాశం, చిత్తూరు, కడప, అనంతపూర్, మహబూబ్‌నగర్, రంగారెడ్డి, మెదక్, నిజామాబాద్, ఆదిలాబాద్, ఖమ్మం, నల్గొండ జిల్లాల్లో 1998 - 99 నుండి అమలవుతుంది. ఈ కార్యక్రమం 2005-06 నాటికి ముగుస్తుంది.
- ప్రాజెక్టు వ్యయం రూ. 725.60 కోట్లు కాగా భారత ప్రభుత్వ వాటా రూ. 591.68 కోట్లు. రాష్ట్ర ప్రభుత్వం సమకూర్చిన వాటా రూ. 94.37 కోట్లు. సమకూరిన నిధులు రూ. 686.06 కోట్లు.
- జూన్ 2005 వరకు వ్యయమైన మొత్తం 667.46 కోట్లు. 2005-06లో ఇంకను వ్యయం కానున్న మొత్తం రూ. 58.14 కోట్లు.
- 1997-98లో విద్యార్థులకు పాఠశాలలు అందుబాటు 73.53 శాతం కాగా 2004-05 వరకు ఈ అందుబాటు 99.63 శాతానికి పెరిగింది. 2005-06 సంవత్సరంలో వంద శాతం పాఠశాలలు బాలలందరికి అందుబాటులో ఉండాలన్నది లక్ష్యం.
- 3,969 రెగ్యులర్ టీచర్లతో, 3969 పారా టీచర్లతో 3,969 క్రొత్త పాఠశాలలు ప్రారంభించబడ్డాయి. లక్ష్య సాధన వందశాతం.
- 1997-98లో పాఠశాలల్లో విద్యార్థుల నిలుపుదల 52.32 కాగా 2004-05 వరకు 69% పెరిగింది. 2005-06 వరకు వంద శాతం నిలుపుదలను సాధించాలన్నది లక్ష్యం.
- 2004-05 సంవత్సరంలో 282 బ్రిడ్జి క్యాంపుల ద్వారా 23,358 మంది బాలల్ని ప్రధాన స్రవంతిలో చేర్చడం మరో విశేషం.
- 20,329 తరగతి గదుల భవనాల నిర్మాణాలు పూర్తయినాయి. 721 మండల రిసోర్సు కేంద్రాల భవనాలు, మరో 55 వివిధ నిర్మాణాల పనులు పూర్తయినాయి. ప్రగతి శాతం 97.6

- ప్రాథమిక విద్యారంగంలో వినూత్న కృషికి 'మూలంగా' నిలిచింది డిపిఇపి-II ప్రాజెక్టు,
- రాష్ట్రం 'అక్షరాంధ్రప్రదేశ్'గా రూపొందే దిశలో బహుముఖ సేవలను అందించింది డిపిఇపి-II పథకం.

- మీ పరిసరాల్లో గానీ, గ్రామంలో గానీ బడి ఇంకా అందుబాటులో లేకుంటే వెంటనే మీ జిల్లా విద్యాశాఖాధికారిని (డిఇఓ) లేదా అడిషినల్ ప్రాజెక్టు కో-ఆర్డినేటర్ (ఎస్.ఎస్.ఎ / డిపిఇపి) గారిని సంప్రదించండి.
- రాష్ట్రంలో 6-14 సంవత్సరాల పిల్లలందరూ బడిలో చేరేలా, కొనసాగేలా మనమందరం చేయి, చేయి కలుపుదాం! విజ్ఞానదాయక సమాజాన్ని రూపొందిద్దాం!




స్టేట్ ప్రాజెక్టు కార్యాలయం
డిపిఇపి / సర్వశిక్షా అభియాన్
ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు



"బాలలు ఉండాల్సింది బడిలో - పనిలో కాదు"
"అందరికీ విద్య - అందరిదీ బాధ్యత"



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A117 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |